శ్రీరస్తు

దోమకొండ సంస్థానాధిప

రాజా రాజన్న భూపాలశేఖరాస్థాన కవిపుంగవ

రాపాక లక్ష్మీపతి కవి విరచిత

# భద్రాయురభ్యుదయము



ఇది

శ్రీమంతు రాజా రాజేశ్వరరావు బహద్దరు వర్మ

సంస్థాన్ దోమకొండగారి యాజ్ఞానుసారము

గోలకొండ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడియె.

# పీఠిక

భద్రాయురభ్యుదయంబను యిమ్మహాప్రబంధమును దోమకొండ సంస్థానాధీశ్వరుల పూర్వుఁడు కామినేని వంశశేఖరుఁడు రాచుర్లగోత్రపవిత్రుఁడు రాజభూపాల పుత్రుఁడగు శ్రీమద్రాజా రాజన్న చౌదరిభూపాల వర్యునకు నంకితముగ దద్దాస్థాన కవికులరాకాని శాకరుండగు రాపాకలక్ష్మీపతి కవిగారిచే రచింపఁబడి నది. ఈకవిసార్వభౌముఁడు నీభద్రాయురభ్యుదయము రచించుటకుఁబూర్వమే శంకరవిజయము, నీలావివాహము, శ్రీమదుమాపాఖ్యానము, శ్రీకృష్ణవిలాసమను గ్రంథరాజములను రచించిన వాఁడనియు శ్రీమద్రామచంద్ర సాంద్రప్రసాద ప్రాప్తోభయ భాషాకవితా ధురంధరుండనియు రాపాకవంశ సంజనితుఁడు పరాశరగోత్రుఁడు నగులింగ నార్యునికిఁ బుత్రుఁడనియు నీక్రిందిపద్య గద్యములవలనఁ దెలియుచున్నది

సీ॥ అద్వైతి యోగివరో త్తానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయమాం ధ్రాంచితముగ
ఘనజగజ్జనన్యాది, కారణ శ్రీమదుమా
పాఖ్యానము తెనుంగు నైదలిర్ప
లలితపదార్థాద్య, లంకార సహితనీ
లావివాహము సముల్లాసమమరఁ
గృతులు మెచ్చంగ శ్రీ కృష్ణవిలాసంబు
జనమనోహరముగ మునురచించి.

గీ॥ మించియున్నట్టి నిన్నువ, ర్ణించ దరమె
ప్రబల రాపాక వంశసం, భవ నవీన
జవనభవన ప్రభవనభా, షావిశేష
లక్ష్మ[illegible] ప్రతిభాధుర్య, లక్ష్మణార్య

గద్య॥ ఇది శ్రీమద్రామచంద్ర సాంద్ర కరుణాకటాక్ష వీక్షణప్రసాద ప్రాప్తోభయ భాషావిశేషక విత్వతత్వ నిర్మాణ కర్మణ చాతుర్యధుర్య పరాశరగోత్ర రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి కవిప్రణీతం బైన శ్రీ కృష్ణవిలాసంబను మహా ప్రబంధంబు నందు ప్రథమోల్లాసము సంపూర్ణము

మఱియు నీ కవిపుంగవుని కవిత్వము సలక్షణమై శబ్దార్థాలంకారవిలసితమై యసదృశవిశదనవరసధారావిసరసంభరితా సర్గళప్రవాహమై అభంగరంగద్దివ్య గంగాధునివలె నతిపవిత్రమై నలరారుచున్నది. కవితాశైలిఁ జూపుటకై స్థాలీపులాకన్యాయముగా నిట రెండుపద్యముల మాత్రము నుదహరించు[illegible]

సీ॥ ఏలా వనీజాత, మాలాఘ నీభూత
బాలా నిలాధూత, శాలికంబు
హేలీకృతారాళ, పాళీ లతాజాల
కేళీరతోద్వేల, జాలికంబు
నానాలతాస్పంద, సూనాయత మరంద
పానాగ తమిళింద, స్థానకంబు
సారసోదారకా, సారసోదార సా
సార సంసారయు, క్కారికంబు

గీ॥ లుంగతరు సంగరింగత్తు, రంగములును
ప్రియకసాలల సద్వన, ప్రియకములును
కోరకని కుంజకుంజచ్చ, కోరకములు
కలిగి తత్ప్రమద వనంబు, పొలిచియుండె

సీ॥ శృంగారరసములు చెలికొప్పు మొగ్గలను
గనిడాయవచ్చు శి, ఖావళములు
రాగవిసృష్టతోరంబులౌ కుచమంజ
రుల ఘటింపగఁ జేరు, నళులగములు

మధువినోదము దెల్పు మహిమవీగతిలోన
నాబ్జముల్ గనవచ్చు, హంసతతులు
నతిమధురత, జూపు, నధరబింబము దారి
గేరివచ్చును దార, కీరవార

ఆ॥ మలరనింపు సొంపు, హావంబు భావంబు
వహిందలిర్చు నీయ, పయవరుచుల
గొనరి దెసల మసలు, నను బాణబలంబు
లేలజాలి జేయు, లోలనయన

భద్రాయురభ్యుదయము

ఇట్టిమహా ప్రబంధమును రచించిన రామలక్ష్మీపతి కవియు రచింపజేసిన కామిరెడ్డి రాజన్న భూమీశ్వరేశ్వరుండు నేనన్న శతాబ్దములో నుండిన వారలో దెల్పుటకు మట యావశ్యకము గాని యున్న శతాబ్దమున నీసంవత్సరమున నీపతికృతి జెందెను. కవిగ్రంథము రచించిన నినిరూపించుటకు వీలులేక పోయినను యున్న శతాబ్దమున నుండిన వారలని మాత్రము లబ్ధమైన యాధారములతో నీక్రిందివిధమున నిర్ణయించుచున్నాము

గీ॥ కలరు బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమి విభునాశ్రయించిన బుధులు నిజము
శాలివాహన శకవర్ష సంఖ్య పదియు
నైదునూర్లైన వర్తమానాబ్దములను

అను బ్రహ్మోత్తర ఖండావతరణిక సీసగీతివలన బిక్కనవోలు కామారెడ్డి ధరణీశ్వరుండు శా॥ శ ౧౫౦౦ లో నున్నటుల నిశ్చయింపవచ్చును. కామినేని వంశసంభవులగు దోమకొండ సంస్థానాధీశుల వంశానుక్రమణికానుసారము నాం జూచిన కామారెడ్డి భూపాలశేఖరునకు బిమ్మట రాజన్న చౌదరి ధరణీశ్వరుం డైదవతరము వాడగును. గావున తరమొక్కంటికి ౩౫ సంవత్సరముల చొప్పున లెక్కబెట్టినను నైదుతరములకు ౧౭౫ సంవత్సరములగును. కావున రాజన్న చౌదరి వసుమతీశ్వరుండు శా॥ శ ౧౬౭౫ క్రీ॥ శ ౧౭౫౩ అనగా నిప్పటికి ౨౦౦ సంవత్సరముల ప్రాంతమున నుండినవాడని తెల్లంబగుచున్నది. మరియు.

సీ. తనగురూత్తముపేర • జనకునిపేరను
దనయన్న పేరను • దనదుపేర
దమ్ములపేరను • దనయపేరిట దల్లి
పేరను సోదరి • పేరభాగ్య
పేరమరందలి • పేరను లింగాపు
రంబునుగాచాపు • రంబుజంగ
మారెడ్డిపురము కామారెడ్డి యును నెల్ల
రెడ్డిపేటయు మల్ల రెడ్డికామి

గీ॥ రడ్డిపేటలు తిప్పాపు • రంబు సిరుల
బొదలు లింగాపురంబును • పోతసాని
పల్లెయును మించఁగట్టించె • భవ్యకీర్తి
ప్రబలు మాయన్న శ్రీకామి • రడ్డిఘనుఁడు

అను శివధర్మోత్తరావతరణికపద్యమువలన కామారెడ్డి ధరాధీశుండు లింగాపురము కాచాపురము జంగమరెడ్డిపురము కామారెడ్డిపేట యెల్లారెడ్డిపేట, మల్లారెడ్డిపేట, కామిరెడ్డిపేట తిప్పాపురము పోతసానిపల్లెయను గ్రామములను నిర్మించినట్లు దెలియుచున్నది. చెరువులు కుంటలు వాటికి కాలువలు బావులు చలేంద్రంబులను చిక్కనవోలు శ్రీసిద్ధరామేశ్వరస్వామికినొక దేవాలయంబును నిర్మించినట్లు పైతటాకాదులను నిర్మించుటకు రు ౧౬౩౦౦౦లు వ్యయమయినట్లు అఫజల్ మినన్ అలపు అనస్ ౧౦౦ హిజరినాటి శాసనపత్రము సంస్థానాధీశుల చెంతగలదు. ఈహిజరిని బట్టి జూచినను రాజభూపాలుఁడు ౧౭౭ సంవత్సరములకు బూర్వముండినవాడని స్పష్టమగుచున్నది.

రాజన్నచౌదరి భూపాలుండు కృతిజెందిన శ్రీకృష్ణ విలాసము [illegible] భద్రాయు రభ్యుదయమును మఱియు నిజవంశ భూషణుండగు రాజా మల్లారెడ్డికవి రచించిన షట్చక్రవర్తి చరిత్రము శివ ధర్మోత్తరము పద్మపురాణము మొదలగు గ్రంథముల ముద్రింపఁజేసి యాంధ్రలోకమునకు మహోపకారం బొనరించిన వర్తమాన దోమకొండ సంస్థానాధీశ వదాన్యులగు శ్రీమంతు రాజారాజేశ్వరరావు బహద్దరు వర్మగారిని శ్రీవారి పుత్రపౌత్రులను జగదీశ్వరుడు రక్షించుగాత.

ఉమాబాగ్
[illegible]పల్లి స్టేషన్ రోడ్
[illegible] హైద్రాబాద్ దక్కన్

ఇట్లు
పెద్ద మందడి వేంకట కృష్ణకవి
సంస్థాన్ దోమకొండ



శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము.



## ప్రథమోల్లాసము.





శ్రీవర్ధిష్ణులిదం సమస్తచిదచి । జ్జేగీయమానప్రపం
చావిర్భావతిరోవిధానకరుల । న్యోన్యావినాభావవే
షావిష్కారులు పూర్వదంపతులు స । త్యానంన్ములైనట్టియా
శ్రీవర్ధిష్ణులఁ బార్వతీశ్వరుల నే । సేవింతు నేతత్కృతిన్ - ౧

శా. శ్రీమద్ద్వాదశ ముఖ్యవర్ణముఖమి । శ్రీభూత నానామను
స్వామిత్వాంచితమై పరాపరరహ । స్యస్థేమమై స్వప్రభా
యామామేయ చిదంబరాకృతియునై । హార్దస్తుతిం జెందు నా
శ్రీమాతన్ పరిశుద్ధమానసమునన్ । సేవింతు నే తత్కృతిన్. ౨

శా. శ్రీసంకాశ దనూపమాగుణ సితాం । ఘ్రిధ్యానమే శజ్జగ
ద్వ్యాసాభ్యాస కరంబు గాఁగ నిజపుం । భావోపపన్నంబులై

వాసింజెందిన వారిజాసనముఖ • న్యాపాగముల్ స్వప్రభా
రాసంయుక్తత నొందుచోఁ దగు మహా • రాజ్ఞిన్ దలంతున్మతిన్.

మ. విలసత్త్రాత్రింశదక్షరసమా • విఖ్యాత మన్వంతరా
జ్వలదాత్మప్రతిభన్ సభక్తిసమయా • చారంబులోనిల్చువా
రలకిష్టార్థ మొసంగి లోకముల సం • రక్షించుచున్నట్టి శ్రీ
లలితాంబాకళమైన దేవిఁ దలఁతున్ • లక్షించి యేతత్కృతిన్ ౪

శా. ప్రాకాశాఖ్య నిజాననాంతరమునన్ • భాస్వత్ప్రకాశంబుఁడా
లోకించన్ దదుదారభావమును మున్ • లోగొంచు నానాప్రకా
రాకారంబుల గల్గు లోకములనె • య్యంబొప్పఁ గల్పించి తా
నేకాకారతనొందు నాస్ఫురణనే • నేతత్కృతిన్ దల్చెదన్. ౫

చ. విలసితమైన యమ్మిహిర • బిందువు ముద్దుమొగంబుగాఁగనా
జ్వలన సుధాంశుబిందువులు • చక్కనిసిబ్బెపు గబ్బిగుబ్బలై
యలరఁ బరార్థమెన్న రశనాస్పదమై విలసిల్లుచుండ వ
ర్తిలు తదభేదమైన పర • దేవిఁ దలంచెద నీమహాత్కృతిన్. ౬

మ. అమితాలంకరణాభిశోభితయు మా • యాపాయ దుర్మంత్రచం
క్రమణప్రక్రమ మార్గదుర్గజయవి • ఘ్నప్రాజ్య యంత్రాద్యప
క్రమనిర్వక్ర పరాక్రమ స్థితివిశు • క్రప్రాణ హృచ్ఛాపశౌ
ర్యమునన్ మించి నమించితాత్మయగు వా • రాహిన్ మదిన్ దల్చెదన్. ౭

మ. కరమొప్పన్మనుతాళభేదనియతుల్ • కాలక్రియామానముల్
పరివిస్ఫూర్జిత మూర్ఛనాంతరములు, త్పాదించి వీణావినో
దరతిన్ సొంపుజనింపు పెంపుగల మా • తంగాంగనల్ బాడను
స్థిరసింహాసన వాసయై దనరు ల • క్ష్మిన్ నెమ్మదిన్ గొల్చెదన్. ౮

శా. కాదంబాళి చకోరికాపికశుక, క్రౌంచాదిపక్షి స్ఫుర
త్కాదంబ ప్రసవ ప్రభూత మధుసం • ఘాతాప్లుతాకారమై
కాదంబర్యదన ప్రమోదననట • త్కాంతా నినాదార్భటీ
కాదంబస్థితి గల్గుదేవినిఁ బుర • స్కారింతు నేతత్కృతిన్.

శా. ఆదిన్ దివ్య విమర్శరూపిణియునై • యా శ్రీ ప్రకాశాత్మతా
వైాదంబేర్పడ నీచరాచర జగ • న్మూలంబు తానయ్యు త

త్ప్రాదుర్భూత పరాదివైఖరులచే • భాసిల్లుచో ముందహం
తేదంతైక్యము నొపఁగాకళను నే • నేతత్కృతిం గొల్చెదన్ .

మ. సకలస్థావర జంగమాత్మకజగ • జ్జాలంబు నిర్మించి త
త్ప్రకటీభూతములైన కార్యములను • త్పాదించి బ్రహ్మాండక
ల్పకుఁడై నిక్కపునాఁడునన్ వెలయునా • భారత్యధీశుండు ది
వ్యకవిత్వాంచితమైన మత్కృతిని ని • త్యానంద మొందించుతన్, ౧౧

మ. సముసూక్ష్మాత్మక దశాసమేత చిదచి • జ్జ్ఞానస్వరూపంబు జెం
దముహా స్థూలదశాసమేత చిదచి • త్కార్య స్వరూపంబునన్
బ్రముదంబేర్పడ నొక్కఁడై జగమును • త్పాదించు లక్ష్మీశ్వరుం
డమితస్తోత్రకృతాస్మదీయకృతినా • హ్లాదంబు నొందించుతన్. ౧౨

శా. శ్రీకాంతా రుచిరత్వమెల్లపుడు ఫీ • క్షించన్మదిన్దల్చి య
స్తోకంబైన నిమేషమొందునని వి • స్ఫూర్జత్కటాక్షాలయ
ప్రాకట్యస్థితి నొందఁజేసి సకల • ప్రాణ్యుత్సవంబెంచునా
శ్రీకాంతుండగు వేంకటేశ్వరుఁడు ర • క్షించున్మదంచత్కృతిన్. ౧౩

శా. శ్రీవర్ణావయవాత్మసంభవగచి • జ్జీవాఖిలస్వామి సా
భావప్రస్ఫుట జానకీరమణి సం • భావింపఁ దత్త్రిక్కయా
ప్రావీణ్యంబు వహించు తారకమను • ప్రావీణ్యము జ్జెందునా
శ్రీవర్ణుండగు రాముఁడీకృతిని ర • క్షించున్నిరస్థాయిగా. ౧౪

మ. వనజాక్షుండు పురందరోపలమునై • వర్తింప దానాజపా
కనదచ్ఛప్రసవంబునైఁ దనరి త • త్కాయంబులో వెల్పలన్
దనకాంతిన్ బ్రసరింపఁజేయుచును ముద్దత్వావినాభాతమై
మనుగన్పుట్టిన లక్ష్మిమత్కృతిని స • మ్మోదంబునొందించుతన్. ౧౫

మ. యతులొక్కప్పుడు భక్తిచే నిజసహ • స్రారంబులన్ శ్రీశ్రియః
పతిబూజింపఁగటంచెంత నే సతతము • ప్పద్మాక్షు నంతర్బహి
స్థితునింజేసి తదాజ్ఞచే ననురమో • పిత్కంఠ కైవ్యాసం
యతవృత్తిన్ జరియింతునంచను సహ • స్రారంబు దల్తున్ మదిన్. ౧౬

సీ. ధుర్యయో క్త్రాదనో • త్సుకత వచ్చునటంచు। నిసుఁడనూరు ప్రేమ • ననువరింప
కార్ముకజ్యాజిఘ్ను • తనుజను దెంచునో। యనిశంకరుఁడుశంకఁ • గొనివదింప
దల్పగ్రసనబుద్ధి • దలపోయునోయని। హరి సాదరంబున • ననునయింప
యజ్ఞోపవీతసం • హరణార్థమే తెంచు।నోయని విఘ్నేశు • డూహసేయ

గీ. నిజగరున్మరుదుద్ధూత • నిఖిలభూమి। ధరుఁడు ఫణిభృతయువతిప • త్రపహరణుఁ
డైన శ్రీవైనతేయుండు • నస్మదీయ। కలుషము లడంచుగావుతఁ • గరుణతోడ.

మ. మునుగృష్ణార్జున పక్షవిస్ఫురణతన్ • మోదంబుగల్పించి సొం
పునఁ గృష్ణార్జునపక్షవిస్ఫురణనీ • భూతప్రపంచంబునే
ర్పునఁ గన్పట్టగఁ జేయుచో నిజపదాం • భోజాతముల్ గొల్చువా
రిని రక్షించు శివుండు మత్కృతినిసు • శ్రీనొందగాఁ జేయుతన్. ౧౮

శా. శ్రీవాణీశము ఖామరాధిపులిదం • సృష్ట్యాదిలోనాత్మలం
దేవానిన్ భజియించి హృద్యఫల సా • హిత్యంబు ముంజెందిర
ద్దేవున్ దజ్జయ యంత్రవిఘ్నహరణున్ • దీనావనున్ సిద్ధల
క్ష్మీవిఘ్నేశు నిరంతరాయమున కై • జింతింతు నేతత్కృతిన్. ౧౯

శా. శ్రీరామాయణ భారతాఖ్య రచనా • జేగీయమాన ప్రథా
ధౌరంధర్య సమేత వాస్తవకథా • ధన్యాత్మ వల్మీకభూ
పారాశర్యులఁ గొల్చి ఛందములసం • పాదించి వృత్తప్రభే
దాహూతస్థితు లెంచు పింగళభుజం • గాధీశ్వరున్గొల్చెదన్. ౨౦

గీ. కావ్యనాటకసంగ్రహ • కాళిదాస। దండి భవభూతిశంకర • డిండిమాంక
రామకవిచోర మాఘభా • రవిమయూర। బాణబిల్హణముఖులమున్ • బ్రస్తుతింతు

ఉ. ప్రాకృత సంస్కృతాంధ్రపర • భాగము లుల్లసిలంగ వైకృత
వ్యాకరణంబు జేసి బుధ • వత్సలతన్ సకలార్థవత్పురా
ణాకలితేతిహాసము • నన్నివచించిన నన్నయాఖ్యను
శ్లోకునిఁ దిక్కయజ్వనువ • చోనియతిన్ వినుతింతు మత్కృతిన్. ౨౧

గీ. తెలివిలేక ప్రదోషైక • దృష్టిరూఢి। విఘునవవిబోధితావృత్తి • వెలయుచుండ
సంతతారుంతదోక్తులు • సల్పుచుండు। కాకవులుకాకవులుగాక • కలితనుతుల

కం. కృతులుగల • కృతులొనర్చని। కృతులదలంచియు దలంచ • కెంతేనినిరా
కృతులంచు • గృతులొనర్చిన । గృతుల దలంపంగనేల•పృథ్వీస్థలిపై. ౨౪

వ. అని యిష్టదేవతా, గురు, సుకవి, కుకవి, నమస్కరణ, పురస్కరణ తిరస్కర
ణంబు లొనరించి యొక్క పారమేశ్వర సపర్యాచర్య ధురంధుండగు మహీశ్వ
రు దర్శింపు తలంపున నుండునెడ. ౨౫

సీ. నవరత్న మాళిసం • భవమహః పుంజంబు
ముందు జ్యోతిశ్చక్ర•మును హసింపc
గరుణా రసస్యంది • సరసనేత్రంబులు
సితకరార్కుల గ్రేణి • సేయుచుండ
చారుముక్తాఫలో • దారహారద్యుతుల్
గురు భార్గవులకు సం • కోచ మొసcగ
సకల వాణీమయ • చ్ఛన్న వీరప్రభల్
రత్నసానుచ్ఛవి • రహినడంప

గీ. సామితన్మూర్తి భృజ్జగ • జ్జనని ప్రేమ। దెలియcగc బరాపరప్రకృ• తిత్వ మొందు
భవ్యసమయస్వరూపప్ర•భావమహిమ।నలది యొక దేవదేవుండు•పొలిచె మదిని.

వ. ఇట్లు స్ఫురించిన విశేషఫలంబు నగునని తలంచి•. ౨౬

మ. పరవిద్యానుపమానమీనానయనా • ప్రాకాశ సీకాశసుం
దర పాదద్వితయోల్ల సన్నఖముఖాం • తర్బింబి తప్రత్యగాం
తరదృక్తారక నామయోగి గురుపాదద్వంద్వము న్నెమ్మదిc
స్థిరతc జెందcగcజేసి ప్రత్యగయనా • ప్తిన్బొందcగా నొక్కచో. ౨౭

కం. శ్రీరాజేశ్వర వరకరు • ణారూఢికటాక్షవీక్ష • ణాగతలక్ష్మీ
పూరిత ధనధాన్యాది • శ్రీరామా రెడ్డిపేట • చెలcగుc భువిలో. ౨౮

సీ. హారిహారిద్గిరిచర • ద్ఘురుమరుద్వరనరి
త్సరివహత్కృతకాది • పరిసరములు
శ్లథదళత్పలగళ • న్మధుల లన్నదలగ
ద్దళచలత్పికశుకో • ద్యానములును
నవభవత్పవసము • ద్భవసముత్పవయుతో
పవనాంతరితయజ్ఞ • భవనములును

ఘనకంజ వనసంజ । వనసంజ వనగుంజ
దళిరంజిత సమంజ • సాంబుఖసలు

గీ. దొరయ మెరసె నిరంతర • సరదసమకు । సుమసుమరసరజోఘుమ • ఘుమితగంధ
వాసితాంతర్గృహారామ • రామరాము । నృపపురమఖిలశ్రీల • నెగడుచుండె. ౩౦

సీ. దీపితా శ్రావయే • త్రిపయోగ శ్రుతి
జాగదక్షరభృతి • సంచయములు
సుఖిత కామాజికా • స్త్రీశ్రౌషడితి సదా
వావదచ్చారికా • వారములును
శ్రోతృశ్రవణసౌఖ్య • దాతృయ జేతృ
రారట ద్రుచిరపా • శావతములు
హితయేయ జామహా • ఇతిభవ్యభాషి
లాలపద్భర్త్రికా • లాపములును

గీ. సరసవౌషడితిప్రభా • షచ్ఛుకములు । బరగ జెలువొందె రామభూ • పాలనగరి
మానసీయోల్ల సత్కామి • నేనివంశ । జననరాజన్న భూపాలు • శాసనమున. ౩౦

సీ. సింజాన సుమనః ప్ర • యుంజాన మకరంద
భుంజాన మధుకరీ రంజితంబు
కంజాత కింజల్క • పుంజాత తపరాగ
సంజాత నదపరి • ష్వంజితంబు
ఖంజరీట విహార • మంజరీ పరివార
పింజరీ కృతభూజ • మంజులంబు
గుంజాధిగమ్యసా • మంజస్య సమ్యజ్ఞ
గుంజాతి రమ్యభా • మంజిమంబు

గీ. నగుచు దొగరగు జిగిడగి • నిగుడు మొగడ । లగణితములగు పొగడల • తెగలసొగసు
గలవలపుగుమగుమయని • చెలువుజూప । బ్రమదవన మొప్పుచుండు న •ప్పట్టణమున

సీ. సముదాతిశయపయః • ప్రమదాతతకరాగ్ర
సముదాతతపలాశ • కుముదములును
స్యందమానమరంద • బృందపానమిళింద
నందదాన మహార • విందములును

## ప్రథమోల్లాసము

నానావినీతప్ర • సూనావృతాంతరీ
పానీత హీరసో • పానములును
ల్లోలాను వేలాను • కులానువేలక
ల్లోలాను సరకోక • జాలములును

గీ. దనరనాంతర తలపాతి • తప్రమాక్తి। కగ్రహణనైగ నిద్యోద • కప్రకార
పూరితోదర దీర్ఘికా • వారములరె। రామభూపాలు పేటలో• రమ్యముగను.

కం. అపరాగములై • తనరివ। నవరాగంబులను దోహ • దార్ధక్రియచే
నవరాగగములు• జేయుదు। రుపవనమునఁ దత్పురీవ• రోయుక్తసతుల్. 3౫

సీ. పాటీర వాటీర • కోటీర నికటాగ
• కందంబులైన మా • కందములును
యుక్తాతి ముక్తాతి • రిక్తాప్రసవకాంతి
పాటలా కృతినొందు • పాటలములు
నీపాను రూపస్వ • రూపద్యుతుల్ గల్గు
కేసరంబులఁ జెందు • కేసరములు
సాలావృతైలాప • మాలోల కిన్నరీ
మోదినులైన • ప్రమోదినులును

గీ॥ మల్లికలలోనఁ దగు దీవ • మల్లికలును
జీవకములై వెలయు బంధు • జీవకములు
కాంచనంబు లనఁగ నొప్పు • కాంచనములు
గలిఁగి విలసిల్లుఁ దత్పురో • త్కంఠవనము. 3౫

సీ. తతదరీ చ్యుతఝరీ • హితకరీ స్తుతతరీ
గతచరీ తతపరీ • వృతధరములు
నతివేల ఋతిశీల • గతిలోల రతిపాల
హితఖేల దతినీల • ధృతిమదలలు
సారదుర్వారదో • స్సారవన్సారనా
సీరసంచారయు • క్యారికలును
ప్రకట కోరకఫలా • దికమధూదకభూజ
శుకసముత్సకపిక ప్రకరములును

గీ. తరణికిరణవిహారణ నిగ • రణతతులు। వరుణ వరణాంతరిత సరో • వరనివసద
వక్ర చక్రాంగ చక్రప్ర • వర్తనములు। దనర దన్నగరోద్యాన • వనములలరె.

సీ. ఏలావనీజాత - పటాలాఘు నీభూత
శాలా నిలాధూత • జాలకంబు
హేలీకృతారాళ • పాళీలతాజాల
కేళీరతోద్వేల • బాలికంబు
నానాలతాస్పంద • సూనాయత మరంద
పానాగతమిళింద • తానకంబు
సారసోదారకా • సారసోదారసా
సార సంసారయు • క్చారికంబు

గీ॥ లుంగతరుసంగ రింగత్తు • రంగమ్ములును। బియకసాలలసద్వన • ప్రియకములును
కోరకనికుంజ గుంజచ్చ • కోరకములు। గలిగి తత్పురమదవనంబు • పొలిచియుండె.

సీ. ధూపముల్ కర్పూర • దీపముల్ మధురసా
పూపముల్ దర్పణ • స్థాపనములు
ఖాద్యముల్ దివ్యనై • వేద్యముల్ విమలాంబు
పాద్యముల్ నిస్వన • ద్వాద్యములును
పూగముల్ పీటికా • భోగముల్ దక్షిణా
భాగముల్ గంధసం • యోగములును
ఫలములు మాలూర • దళములు సారసో
త్పలములు శుద్ధతం • డులములలర

గీ. శంఖకాహాళఘంటికా • ఝల్లరులును। మ్రోయమ్రోయ త్యాల ముగ్గులింపుగ ఘటింప
దివ్యమందిరములమహా • దేవుభక్తి। బూజసేయుదు రెప్పుడ • ప్పురజనులును. ౩౮

కం. ఆనకములు విమతజనభ। యానకములు మ్రోయునాప • డధ్వవిచారా
దానసదానదాకములు। మానవపతులలర శివుని • మంటపములపై. ౩౯

కం. దరములు సతతసుధాసా। దరములు షడ్విధివిచార • తాత్పర్యసమా
దరములు సంస్కృతిదరతో। దరతోదరములయి మెలగు • దత్పురిలోనన్. ౪౦

కం. నయమానయమానయనో। చయములై దత్పురి వసించు • జనతతులు సదా
నయతోదయతోదములై। ప్రియమగు శివభక్తి మదిని • బెంపెసలారన్. ౪౧

కం. నవకుసుమానసమానాగో। పవనోదర సద్విహంగ • భవరవభరనీ
ప్లవనోదర పవనోదర। భవనాదములగుచునుండు • ప్రజలప్పురిలోన్. ౪౨

సీ. మదనాశుగ వికాస • కృదనారత విలాస
సదనా హతావాస • సద సదులును
కేళీ విహిత సంత • కేళీ విహిత నారి
కేళీ విహిత సుప్ర • త్తోళికలును
నాళీకనిర్యన్మ • ధూళీక చర్య ప్ర
ణాళీకదర్యన్మ • రాళికలును
పాళీ లతాంతరిం • ఛోళీ నితాంతయు,
క్షాళీ హితాంత ద్రు • మాళికలును

గీ. దోరయి మెరసె నిరంతరాం • కురిత, తపల్ల
విత, సుమిత ఫలితోద్యాన • వితతు లెపుడు
రాజితాద్మూరి సీమాభి • రామ రామ
రడ్డిపేటను జను లెల్ల • రంజిలంగ. 43

మ. బలనత్స్వర్ణ మయూగ్ర విగ్రహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం • తర్పింబితంబై తగుఁ
దలరాదంచు వచింప శేషమున నెం • తఁ విన్న నయ్యోంగదా
బలిపాలంబిక దీనిఁ దేర్తు నని • సంభావింపఁగా నోయనన్. 44

పాఠాంతరము.

బలభిద్రత్న ఘృణీసమూహ బహిః•ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం•తర్బింబితంబౌచు, సొం
పలరెన్, దీనిజలంబున్నపుడి, మను•ష్యాద్రుశ్యమైయుండె, నా
బలిసద్మంబట దీనిఁ దేర్తుననిసం • భావింపఁగా నోయనన్, 45

మ. అమలాగాధ పయఃప్రపూర జల స • త్త్వానేక తీర్థోరుఖే
యము, దోచున్ నిజభక్త పాలనమునం • దాసక్తుఁడై సన్నుతా
గము రాజేశ్వరుఁడుండిరన్ పదభిషే • క స్వస్తి హేత్వర్థమై
యమరాధీశ్వరుఁడంప, సంభ్రమముతో • నందుండు మిన్నేరనన్. 46

మ. సరసాభ్రంకష చందిరోపల చతు • స్తంభంబు లొప్పంగఁద
త్సౌధమధ్యంబున మధ్యశాల దనరున్ • పుంజీభవత్పుణ్యమాం

ర్గ రతుల్ ధర్మము నాల్గు పాదములచేఁ • గన్పట్టఁ జేయంజతుః
పురుషార్థంబులుగూడి నిల్చెనన సం • పూర్ణేందిరావాసమై. ౮౭

మ. అలరున్ స్వర్ణమయం పుటోడలునురు • వ్యాయూథ వాద్యత్త్రరో
జ్జ్వల దచ్ఛోదక కూపముల్ దనరుత • స్థానీయ లక్ష్మీ శుభా
చల నారంభమునన్ జనుల్ నిలుపు, మో • చా స్తంభ సంభారమ
ధ్యల సత్పూర్ణ సువర్ణ కుంభముల చం • దంబొప్ప నా ప్రోలునన్. ౮౮

మ. వియదుల్లంఘన జాంఘికా జిరతలా • విర్భూత వానస్పతుల్
శ్రియ సంప్రాప్య ఫలప్రసూన కలికా • సంపత్తి బొల్చెన్ శివా
దయితారాధ్య విధిక్రై చెలంగి పురుహూ • త ప్రేషితంబైనయ
వ్యయ కల్పద్రుమ మన్నగా కృతులచే • నందుండెనా నప్పురిన్. ౮౯

చ. లలితరసాలసాలకిస • లంబుల నింపగు పచ్చతోరణం
బులుగల చైత్య వృక్షములు • పొల్చెను, నిర్విష వర్తనంబుల
న్గలసిన గారుడాశ్మముల • గంటుల నొందిన మేలుకట్టులన్
నలువ సృజించెనో యన జ • నంబులు సంతసమంద నప్పురిన్. ౯౦

చ. కలువల తేనెసొలపయి • కప్పుల పుత్తడి యోంటికంబ పుం
బలితపు మేడల ప్పురిని • భాసిలు, తత్పుర లక్ష్మికింపుగాఁ
బలరిపు, దక్షిణాధిపతి, • పాశి కుబేరకులాంగనామణుల్
కలిత సితాతపత్రములఁ • గౌతుక మొప్పఁగఁ బట్టిరో యనన్. ౯౧

శా. అంతర్వ్యాసవ నీలతారకలు బా • హ్యాస్థారుణ గ్రావనే
త్రాంతంబుల్ రుచిరార్జునారద సుప • క్ష్మౌఘంబు లింపొందగా
నంతర్ద్వార విలోకనంబుల సుప • ర్వావాస భూలక్ష్మి శు
ద్ధాంత స్త్రీలఁ గనుంగొనన్ నిలుచు చం • దంబేర్పడన్ బ్రోలునన్. ౯౨

మ. పొలుచుం జిత్రపచితి త్రపతివజలా • సూర్ఘజ్జ త్రైతీహారని
ర్మలపాండుద్యుతిదీప్త హర్మ్యములువా • రస్త్రీసుగాంధారకా
కలితగ్రామ విపంచికా శ్రవణసౌ • ఖ్యోదయ ద్వైస్వ్రుతిన్
న్గలయన్ నిల్చిన వేల్పువీటిచెలులో • నాఁదత్పురిన్ నిచ్చల్. ౯౩

మ. నెలరాలన్ విలసిల్లు స్తంభములపై • నెక్కొన్న రాత్రిందివా
జ్వలదాజ్యాంచద ఖండదీపకళికా • స్వద్యోతమంత ర్బహి
స్థలులన్నిండగమించె, నచ్చటిమహీ • శప్రార్థ నాప్తిన్ రసా
తలనిర్వృత్తఫణి రాట్ఫణాఘటితర • త్న శ్రేణిలో నాపురిన్. ౫౪

సీ. కురువింద సంచయా • కుంఠిత పటలముల్
కమనీయ రక్తరాం • కవములుగను
పుష్యరాగవ్రజ • స్ఫురితవలీకముల్
తద్రాంక రాంకవ • ప్రస్తములుగాఁగ
రుచిరగోమేధిక • రచితసోపానముల్
రమణీయ దీర్ఘతుం • డములుగాఁగ
హరిహయోపలవిశా • లాంచిత కుడ్యముల్
రమ్యబంధురశరీ • రములుగాఁగ

గీ. బద్మరాయుగళో పరి • భాగములును
కళలఁ జెన్నొందు చౌడోలి • కలునుగాఁగ
సౌధములు యూధపస్థితి • చంద మొంది
వెలయుచుండును బురిభూప • తులవహించి. ౫౫

సీ. గమనవేగ సముత్థ • ఘర్ఘరస్వాననేమి
చక్రసంధానిత • స్యందనములు
సప్తధా మదభర • స్రావిహాసిత చతు
ర్దంత దుర్దాంతదం • తావళములు
రింఖావి శృంఖలా • రింఖణా సంఖ్యాక
కంఖాణ పుంఖాను • పుంఖములును
నసమాన చరణాయు • ధాంక శస్త్రాస్త్రవి
ద్యారూఢ ధౌరేయ • వీరభటులు

గీ. నడుమ కడువేడ్క లడరంగ • నెడనెడలను
తడఁబడక వడివడి జను • పుడమిజనుల
నుడులచే ఘుమఘుమితమై • సడలనిత్య
ధన్యమైనట్టి తద్రాజ • ధాని భువిని. ౫౬

చ. వెలఁదుకలప్పు రోపవని • వెన్నెలకుప్పల నొప్పు క్రీడలన్
గలువలతేని రాలయిను • కన్ గ్రహియించి వధూ పదిష్టభూ
తలమున నంచి తొల్తటిప • దంబునఁ జేరి తిరంగిచూడ, గఁ
ల్వలచెలిచే తులంగరఁగ • లజ్జవహింతు రు రేలనిచ్చలున్. ౫౭

సీ. పలుదెరంగుల మోవు • లలరిదే చెలియేల
తావులు లేమిచే • తనుదొరకవు
గోరంటలకుఁ గోర్కె • లూరెము ద్దులగుమ్మ
వేగుజాము నకాని • విరియ వవియు
సజ్జాతు లడుగ,వే • సారెదంబుజముఖీ;
యామని యెతీఁగినీ • వడుగరాదు.
ప్రొద్దుదిరుగు పల్వ • పొసఁగిచు వెలఁదుక
తొలికాంచనంబుల్లు • విలువదాని

గీ. కనుచు సర్మవచోజాత • హావభావ
గర్భితము గాఁగ ముచ్చటల్ • గిరపి నరన
బరిగి సరసులఁ గరగించి • విరుల వెలల
వలయుచుండరు పుష్పలా • వికలు పురిని. ౫౮

వ. మఱియును. ౫౯

సీ. వనిత నీకైదండఁ • గొనవచ్చితి నటన్న
కైదండ నొక్కఁడు • పాదుకొనిమె
నింపుతోఁ జనుగుత్తు • లెట్టివోజూపవే
చనుగుత్తులును మ ఱుం • గునవసించు
నీయెత్తుఁ గొనటకై • నేవచ్చితి నటన్న
నాయెత్తుఁ గొనెనొక్క • యనువుకాదు
వడతిరో: కురు వేర • పరిపినకో పమూ
కురువేరుపరుపనీ • తరముగాదు

గీ. పరిమళముజెందు మరువమొ • ప్పటికినైన
నమ్మగలవా యనంగని • న్నమ్మగలను
కలియికల సర్మగర్భోక్తు • లలర సంజ
విటుల నమ్మమ రవ్వేట • వెలరుకొలఁది ౬౦

సీ. మణ్యంతరోపోత పణ్యస్థలాగణ్య
పుణ్యగంధంబులఁ • బొరలి పొరలి
నానావిధోపదం • శాసీత పాత్రభృ
త్పాన గోష్ఠీశాల • లాని యాని
పుంభావనారంభ • శుంభద్వధూఘుర్మ
బాలితాంభః కేళిఁ • దేలి తేలి
పరిపక్వశాలికా • పాలికా బాలికా
గానాను వృత్తులఁ • గదలి కదలి

గీ. సిరత ఘుమఘుమితామోద • భరకుసలయఁ
జలజవలయిత పరిసర • సరిదుదరజ
లఘుజల కణవహన గతి • లక్షణముల
దిరుగుఁ దెమ్మెరలప్పురీ • వరమునందు. ౬౧

మ. సరసాలాప గతాగతాంబుఘటయు • క్ప్రాంద్రాననామానసాం
తరసుప్తాంగ బోధకంబులగు యం • త్ర శ్రేణి భాస్వారుసా
పరుపోద్గీతము లైన గేయములు స్వ • ప్నక్ష్మాలి గోపీనిరా
దరపత్ర్యాసయన క్రమంబునఁ దగుళ్ • దద్బాహ్య దేశంబులన్. ౬౨

మ. చతురాస్యుల్ రసనాంచల ప్రకటభా • షామూర్తులఁ, భ్యంచిత
శ్రుతుల, త్యాజిత సత్యలోకమతిద • క్షుల్, సర్వకాలోల్లస
ద్వ్రతుఁగా పద్మనివాసులై తగినవి • ప్రశ్రేణు, లప్పట్టణ
స్థితులై బ్రహ్మను ధిక్కరింతురు మహా • దేవున్ బరిశంసింపుమన్. ౬౩

సీ. కువలయస్థితికి సం • కుచితభావ మొనర్చి
పంకజామోద ప్ర • పంచ మొంది
ద్విజరాజ తేజంబు • నిజదీప్తి నడగించి
సద్విహారము దూర • సరణిఁ జెనచి
పగలు రజోవతు • లగు పద్మినులఁ గూడి
యొకవేళ సుతతో • నోగ మొంది
సకలలోకములకు • సహ్యతాపము జూపి
రాజకాంతోల్లస • ద్రక్తి మాద్చి

గీ. మఱియు నిగుడెంత వాడని • కెరలికలహ
తలపరబలబలాహక • విలయపవన
జవన శరసికరావక్ర • చక్రముఖము
లమర నప్పురి నివసింతు • రవనిపతులు. ౬౪

ఉ. ఆపణ వీథికా ప్రథిత • హాటకకూటచిరత్నరత్నముల్
వాపుచు రాసిబోసికొన • వచ్చు బెహారుల కిచ్చితీప్పులై
దోపినవానినెల్ల కడఁ • ద్రోచిన తద్భరమాని,రత్నగ
ర్భాపరమాభిదన్ బుడమి • రంజిలెఁ దద్వణి జాళినిన్నుచున్. ౬౫

గీ. మిన్నొరయుధాన్యరాసుల మించలేక • జలజ బాంధవుఁ డీవల్లా, వలజనంగ
దన రె భువినుత్తరాయణ• దక్షిణాయ, నములు, తత్పురిసచ్ఛాభ్రదంసమితివలన.

గు. కలువలఁజేనిరాల యుప•కారికలన్ నవలాలు కేళికా
కలనమునొంద ముందురిలి • గన్పడుముత్యము లందుచోఁజగం
బులఁ గురియింప నాటబలె • ముత్తియముల్ గురియించు నంబుదం
బులనెడివార్త లోకములఁ•బుట్టె ముదంబుల నొప్పునప్పురిన్. ౬౭

గీ. కుంకుమాగరుఘనసారసంకుమదమృగమదగ్నహములనుదయాస్తసమయములను
దొరగుకసవానఁచోమించి•తోయదములుబహుళవర్ణత్వమొందున•ప్పట్టణమున

వ. మఱియు నప్పురంబున రమ్యసౌమ్య ప్రతివిధి విధిమత్ర్పథిత మేధావ్యధాపితో
దీర్ణ వర్ణనిర్ణయ వర్ణక్రమాంత స్వాధ్యాయధ్యాన మేదురదురధిగమ నిగమశి
రః ప్రముఖ మర్మపారగాసంఖ్య సంఖ్యావన్ముఖ్య ముఖర ముఖరిత భువనంబు
లగు విప్రభవనంబులు,నిరంతరాభ్యస్త శస్త్రసమస్త శస్త్రశాస్త్ర విశారదోద్యద్య
ద్గర్వాఖర్వ శౌర్యవర విద్యా ప్రదర ప్రదర సంధానాద్య వధానాభ్యసమాన
సంధానోల్లంఘన తత్పరస సమర్థాభ్యామర్ద క్షమాతల సర్వవిపక్షనిర్దయమ
ర్దన క్షమాక్షీణ బలవద్భద్ర నిర్నిద్ర తేజోవిజిత దినరాజ లోకంబులగు రా
జలోకంబులును,సతతాగారాతి రైపతి ప్రభృతి దిక్పతి విచిత్ర ప్రచురతరవి
రత్నరత్న ధనధాన్యాది ప్రచయ క్రయావిక్రయనిపుణ పరకృత వంచనాసంధాన
గంధానభిజ్ఞజ్ఞాతనయాయన పోషితార్య జనంబులగు నార్యజనంబులును, స
మంచిత వర్ణనిర్ణయాశ్రమ మర్యాదాభిజ్ఞ ప్రజ్ఞాప్రజ్ఞ ప్రభుసంతత దురంత

శాసనధర్మ నియమనితాంత శాంతాంతః కరణమానస ఘనులగు శూద్రఘను
లును. సాపకారగవారముఖ్య ప్రఖ్యాతాభినయాభావసూచన చణరణన్మంజు
మంజీర చరణతల నూత్నరత్న క్రేంకారనాదమేదురకంకణ కరవిన్యాసాభిన
యప్రదీప్త స్వైరప్రపంచ విపంచికా వికస్వరవినోదవిశదమానసమానసభవవా
హనాకాంక్షవిటపుంభావసంభావనారంభసుభగంభావుకలగు రూపజీవికలును
దుహారోహానోకహానివహామనోరమ మహోత్సవద్యోతితోద్యాన వననవో
న్మీలనమాలతీమాధవీ విచికిలవకుల ముకుళకులానుకూల నిష్యందమాన మ
రందబిందు సందోహానంగ దిందిరానవరతరుత సంతానతాన హేతుభూతా
భ్యాస ప్రదేశా విరళసంజాతపచేళిమ నారికేళతృణరాజాది సాలరాజరాజిశా
ఖాసమాలింగి తైలాడోలాలాలితోత్సుకశుకపిక నికరగాన మాధురీరసాతివే
లాస్వాదన సద్యోమాద్యత్సంగ భంగా సహాశృంగార రసలాల ససారసర
థాంగ క్రీడత్సారంగ ముఖసుఖారావ పూరిత దిగంతరాళ వర్ధనానో
త్సాహ సంకర్షనార్థసార్థ త్రికోటితీర్థస్నాన ఫలేప్సితసుహిత సిమజ్జనో
న్మజ్జనమజ్జనాన వరతానంద ప్రదానలోల లోలానువేలవేలాభిముఖోల్ల
సత్కల్లోల జాలకోలాహలనినాదమేదుర నదీతటాకదీర్ఘికా ప్రదేశంబులును,
హీరపంజరసంజన విహారశారికా కీరకలరవాదివివిధ పిష్కిరామోదక
రవిష్వగ్విష్కిరోదీర్ణ సువర్ణదుర్వర్ణ ముఖభవ్య ద్రవ్యసవ్యానవ్యవైభవ ని
పుణ విపణితతీతస్థాపితాంశు మత్సలానుగళ ద్రసపూరానుసర
శిశిరకరకాంత కుట్టిమతలానుకూల నీలనాళి ప్రణాళీ కాంతి సంక్రాంత చ్ఛా
యాత్రివేణీ సందర్శన కుతూహల బృందారక సుందరీనేత్రాంతోత్పలతోర
ణంబులగు తోరణంబులును, సంతతనాయక పరిరక్షిత దుర్గమదుర్గప్రాకా
ర గోపురాట్టాలక పృథురథగజవాజి శస్త్రశాలాది రాజద్రాజ మార్గంబులు
గలిగి చెలువొందునందు.

కం. ఆపురమున రాజన్యమ । హీపాలాగ్రణియు నిజబలేతధ్వజినీ
ధూపాయితపాపాయిత। భూపాయుతుఁడగుచు సిరులఁబొలుపొందెదగన్. ౨౦

సీ. ఒకచో[illegible]మత • ప్రోక్త ప్రసంగంబు
లొకచోట తర్కశా • స్త్రోదితంబు
లొకచోట సూత్రభా • ష్యార్థానులాపంబు
లొకచోట రతిరహ • స్యోక్తి యుక్తు
లొకపట్టునను నాట • కోరుచాతుర్యంబు

లోకరంజక వ్యాకర • ణకథనంబు
లోకప్రకేవ సుపనిష • త్ప్రకట సల్లాపంబు
లోకయుక్తి సంగీత • సుకరభణితు
గీ. లోకదిక్కున సామర • స్యోత్థసౌఖ్య
కరణ సమ్యగనుత్తర • గ్రంథగోష్ఠు
లలరు గొలువునఁ జెన్నొంది • యఖిలశాస్త్ర
సరసుఁడైపొల్చె రాజన్న • జనవిభుండు.

వ. అతండొక్కనాఁడు హితపురోహితామాత్య సామంతసేనాధిప దండనాయకో
పప్రధాన రాయబార సంధివిగ్రహ విచారచార ద్వారిక గణక పౌరాణిక
జ్యోతిషిక, కవీశ్వర, తార్కిక, శాబ్దిక, నయశాస్త్రమంత్రశాస్త్ర ధర్మశాస్త్ర
భరతశాస్త్ర శకునశాస్త్ర సాముద్రికశాస్త్ర శిల్పశాస్త్రజ్ఞులును, దానాధి
కారి భాండాగారాధికారి గోష్ఠాధికారి వస్త్రాధికారి శస్త్రాధికారులు
గస్తూరి ముఖపరిమళ కరండాధికారులును, ఫణిహార లాంఛన విదే
శగ విదూషకులును, అంగరక్షక రావధానకాదులును, దాస దాసీజనాందో
ళికా ధ్వజాల వట్టఛత్రచామర వ్యజనతాంబూల పేటికా పాదుకా మాలికా
దిధారులును, వాద్య వాదక గాయక నర్తకీ నర్తకమార్దంగిక పాణవిక, వైణ
విక, వైతాళిక చాక్రిక ఘాంటిక శాంభిక శాక్తిక నైస్త్రింశిక యాష్టిక పా
రశ్వధిక కౌంతిక ప్రాసిక వైజయంతిక వైవధికాదులు చెన్నొంద సింహాసం
హానన సింహాసనా సీనుండయియుండి పేరోలగంబున.

మ. నను, శబ్దార్థపరిష్క్రియా కలితవా • నైపుణ్య గణ్యప్రదా
జనితానంద కవిత్వ తత్వరచనా • సౌజన్యజన్యాత్మ వై
నవవద్దేశిక పాదుకానియుత చి • త్తప్రస్ఫురన్మార్గ ఖే
లను నైదిఘంటిక యుక్తి యుక్తమతి బి • ల్వాన్పంచి పల్కె దయన్. ౨౩

సీ. అద్వితీయ్యాపరో • క్షానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయమూం • భ్రాంచితముగ
ఘనజగజ్జన్మాది • కారణ శ్రీమదు
పాఖ్యానము దెనుంగు • నైదలిర్చ
లలిత పదార్థాద్య • లంకార సహితనీ
శావివాహము నము • ల్లాసమలర

కృతులు మెచ్చంగ శ్రీ • కృష్ణవిలాసంబు
జనమనోహరముగా • మునురచించి

గీ. మించియున్నట్టి నిన్ను న • ర్పించ దరమె
ప్రబల రాపాకవంశ సం • భవనవీన
జవన కవన ప్రభవనభా • సావిశేష
లక్ష్మణప్రతి భాధుర్య • లక్ష్మణార్య. ౨౫

గీ. నీవు శబ్దార్థ చిత్రసన్నిహితమైన • కవన మొనరించు ప్రోడవు• గానవొక్క
దైవికావ్యక్త సూక్తసం•ధానమహిమ •గలిగినప్రబంధము రచించుము•కౌశలమున

వ. అది యెట్టిదనిన.

క. అసమానము,భయభాషా! రసమానము• వృత్తిరీతి• రసశయ్యాస
ల్లసమానము చిత్రోక్త్య• న్యసమానముగా రచింప • జర్పింపదగున్. ౨౬

వ. మఱియు గుణదోష విభావజ్ఞుండగు వివేకియు, ననుప్రాస సమాబద్ధపదబంధు
రుండగు వాచకుండును ప్రసాద మధురాయత్త వచనుండగు రౌదికుండును,
అర్థసంగ్రహ చాతుర్య ధురంధరుండగు ఆర్థికుండును, యమకాన్విత శ
బ్దత్వాదత్తుండగు శిల్పకుండును సాలంకార తత్పరుండగు భూషణార్థియు
రసతత్పరుండగు మార్దవికుండును, దన్నియంబు లిట్టి రీతులు త్రివి
ధంబులు వైదర్భిగౌడి పాంచాలి యనందనరు బంధపారుష్య రహితంబు,
శబ్దకాఠిన్య వర్జితంబు నాతిదీర్ఘ సమాసంబునగు వైదర్భియు సమాసభూయ
స్త్వంబైన యోజస్థితియు, స్ఫుటబంధతా విశేషంబుగల కాంతియు, దనర
గౌడీరీతి యనందగు వైదర్భి గౌడీరీతి మిశ్రితంబై పాంచాలిరీతి యనంద
గు శబ్దార్థంబులు మూర్తి వ్యంగ్యవైభవంబు జీవితంబు అలంకారంబులు
హారంబులు శ్లేషాదులుగుణంబులు రీతులుస్వభావంబులు కైశిక్యాదివృత్తులు
వృత్తులుపదానుగుణ్యవిశ్రాంతిగలశయ్యలుశయ్యలు.రసాస్వాద ప్రభేదంబులగు
పాకంబులు పాకంబులు కావ్యసామగ్రికి నుండవలయు వాచకలక్షక వ్యంజక
త్వంబున త్రివిధంబు శబ్దజాతంబు వాచ్యలక్ష్యవ్యంగ్యత్వంబున నర్థజాతంబు
త్రివిధంబు: తాత్పర్యార్థము వ్యంగ్యార్థగతంబైయుండు అభిధాలక్షణ వ్యంజ
నాఖ్యల శబ్దవృత్తులు త్రివిధంబులు సంబంధానుపపత్తి మూలంబగుటచేసి
గౌణవృత్తి లక్షణాభేదంబైయుండు గావున నొక్క ప్రబంధంబు రచించి శ్రీర

రితం బౌనర్పుమని జాంబూనదాంబర తాంబూలాదికంబుల బహూకరించి
న సంతుష్టాంతరంగుండనై తద్వాక్యంబులు ప్రమాణీకరించియమ్మహాత్మునికి
వేలుపైన రాజేశ్వరు దర్శింపఁదలఁచి

సీ. సరసనానారత్న • భరశృంగ సంగత
దివ్యసాలాంతర • స్థిరతఁ జెంది
మహిసహస్రస్తంభ • మంటపం బలరారు
నదిమణి ఖచితమై • పొదలుచుండు
వరుస చతుర్దిశా • వధిసహస్రస్తంభ
ములు పంక్తి పంక్తికి • మ్రుగ్గ వెలుంగ
రమణీయ మణిసహ • స్రస్తంభములు మించి
తిర్యక్ప్రవర్తనో • ద్దీప్తి నెనయ
గీ. తాదృశస్తంభ పంక్తులు • తఱచుగలిఁగి
తదుపరిచ్ఛన్న పటలంబు • తద్విధావి
రత్నమయమై దలిర్చివి • భ్రాజమాన
మైచెలంగిన యమ్మంట • పాంతరమున. ౨౪

కం. నవమణిగణ ఖచితంబగు। భవనాభ్యంతరమునందుఁ • బార్వతితోను
త్సవమున శ్రీరాజేశ్వరుఁ। డవనిజనులఁ బ్రోచుచుండు•నతిముదమలరన్. ౨౫

వ. మఱియు నమ్మహాదేవుండు వికస్వర పుండరీకనిభ కోమలామల శరీరుండు,
తరుణారుణకిసలయ విలసిత చరణాధోభాగతలుండును, చారుతరహీర విశదశ
కల సదృశంబులగు పదపృష్ఠప్రదేశంబులును, ప్రత్యగ్రస ముదగ్రజాగ్రత్సింజా
న మంజుమంజీర రంజితంబులగు చరణంబులును, రుచిరశశిమణి గణనీయకాహ
ళ యుగళ సంకాశంబుగులగుజంఘికలును, మహోద్దండ శుండాలశుండాదండవ
న్నిభంబగు నూరుయుగళంబుకలధౌతవూత దుకూలాంబర • చిరత్నరత్నరశనా
యుక్తంబులగు పులినసదృశనితంబంబులు స్ఫాటికకవాటపాటవంబుగలవక్షస్థ
లంబును, సకలాభీష్ట ప్రదానేక మణిగణఖచితపటు కటక కేయూరాంగుళీయ
కాది భూషణ భూషితంబులగు చతుర్భుజంబులు, శారదైందవ బింబసంకాశ
సముల్లాస భాసురంబగు వదనంబు• కోటిసూర్య ప్రకాశానంత రత్నకీలిత కిరీ
టంబుగల మస్తకంబును గలిఁగి సర్వజ్ఞత్వాద్యనంతకల్యాణ గుణపరిపూ
ర్ణుండు• పూర్ణిమాశశాంకకోటి విభ్రాజమాన విగ్రహుండును, నిత్యనిరవద్య

నిరతిశయ తేజస్సంయుత స్వసమాన రుద్రగణ ప్రమథగణ పరివృతమణిమయ సింహాసనాసీనుండును కుండలి కుండలాలంకృత దేదీప్యమానుండును, నిత్యశుద్ధ బుద్ధముక్త కేవలాఖండ సచ్చిదానంద స్వరూపుండును, రామణీయకతను ప్రభాభాసితానంత కోటిబ్రహ్మాండ పరాణుగవాక్షీభూతానేక రోమవివర దేహుండును, కామసేని రాజన్న భూపాలశేఖర కులదైవతంబగు రాజరాజేశ్వరునిగాంచి బహుప్రణామంబు లాచరించి.

అనులోమ విలోమ శ్లోకము

శ్లో. రదసారస గోసారస మానానఘ కాశికా
కాశికా ఘననామ సరసా గోసర సాదరా. ౧౮

గీ. శరవృషవనాబ్జ పుష్కర • హారిరసాభ
శుచిశరీర ప్రవర్ధిత • సుమశరాంగ
శరవృషవనాబ్జ పుష్కర • హారిరసాభ
శుచిశరీర ప్రవర్ధిత • సుమశరాంగ. ౨౦

వ. అని యివ్విధంబున నమ్మహేశ్వరు వినుతించి దక్షిణాశావిశాల మందిరంబున సీతాసమేతుండైన శ్రీరాముల సేవింపఁదలంచి. ౨౧

సీ. సుమతి రేకాకీన • రసి తేయని వచించు
రాజిత రాజకీ • రవ్రజంబు
ధీయుక్తిచే నద్వ • తీయమైచ్ఛత్తని
వచియించు శారికా • వారములును
సుచితోక్తి నధవురు • షోహవైనారాయ
ణోకామయతయను • కేకికులము
స్థిరవచస్థితి నద్వి • తీయోస్తి కశ్చిత్త
నుచుఁబల్కు పారావ • తచయములును

గీ. మహితభాషల యస్యచా • త్మాశరీర
మనుచు సూచించు పికసమూ • హములుగల్గి
వెలయు శుకపుష్ప మంటపా • వృతమహీరు
హంబుల వసించిభక్తి • మోదంబుదనర, ౨౨

వ. మఱియు ౨౩

సీ. వెలయు నారాయణ • వేదగుం సర్వంబ
నుచుఁ బల్కుకిన్నరీ • నిచయములును
హితముమీరంగ, త • మీశ్వరాణాంపర
మం మహేశ్వరమను • మధుపగణము
తెలివిమీరంగ,తం, దేవతానాంపర
మంచదైవతమను • నంచకోలము
నలువొంద, నారాయ • ణం మహాజ్ఞేయం బ
ని పఠించు ఖంజరీ • టపతగములు
గీ. నవ్యయః పురుషఃస్సాక్షీ • యనుశుకంబుంగ
తతులు జెన్నొందు దత్పవి • ధద్రుమముల
నిష్కళంక నిరంజన • నిర్వికల్ప
నిర్గుణబ్రహ్మ మచటరా • ణించుకతన ౮౬

గీ. అదియు నిశ్శ్రేయసామృత • పదియునిత్య
వాస్తవస్థానమదియు ని • ర్వహణపదము
దూరవర్జిత సుఖదుఃఖ • కారణమునఁ
దనరఁ దత్పద మెన్నంగఁ • దరము నగునె. ౮౭

వ. ఆచ్చోట. ౮౮

గీ. దేదిసద్వేదికావిప్ర • ధీరవార। పఠ్యమానస్మృతిశ్రుతి • ప్రకటితేతి
హాసఘుమఘుమితారావ • భాసమాన భర్మహర్మ్యంబులో రామభద్రుఁడలరు.

వ. అద్దేవుఁడు స్వాభిమత స్వసంకల్పానుకూల్య పరమపద స్థానీయభోక్తృభోగ్య భోగోపకరణ భోగస్థాన స్వరూపుండును నిఖిల హేయ ప్రత్యనీకకల్యాణైక తానస్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభావికానవధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజోవిరాజమాన దివ్యమంగళ విగ్రహ చింత్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయ సౌందర్యౌజ్వల్య సౌగంధ్యసౌశీల్య వాత్సల్య యౌవ్వనాద్యనవద్యానంత కల్యాణగుణపరిపూర్ణుండును నిఖిల జగదుదయ విభవలయలీలాపరబ్రహ్మ పురుషోత్తమ నారాయణాది శబ్దవాచ్యుండును, బ్రహ్మాది దేవర్షిమనుష్యధ్యానారాధనాది గోచరుండును, తత్తద్భేద స్వరూపావస్థితుండును, శ్లో. ఉపాస్యోపాసకత్వేన గురుశిష్య క్రమేణచ స్వామి భృత్యాది రూపేణ క్రీడతే స్వేచ్ఛయేశ్వరః" అన్న న్యాయంబు

సమ్మోహాత్ముండు రవికరనికరవికసిత ప్రభామండల మండిత పుండరీక దళస్ఫాయదాయతేక్షుండు, భ్రూలలాట సునాసాపుటసుస్మితాధర సురుచిరమణిమకుర సుకపోల యుగళుండును కంబుగ్రీవుండును, దనుతర మధ్యభాగుండును విశాల వక్షస్థలుండును, సువిభక్త సర్వాంగ నిర్దేశ్యవిశ్వరూప సింహసంహననుండును, స్నిగ్ధవర్ణుండును, శోణసారస సుకుమార చరణయుగళుండును, నీల నీరదాంతర నటత్ప్రతప్త కార్తస్వర ప్రభాధగద్ధగిత పీతకౌశేయాంబరధరుండును సకలభువనోదయ హేతుభూత పితామహవిహారణంబుగల నాభీకమలకుహరుండును; జ్వలద్విశాలోరస్థలసూత్న రత్న వేదికా సమారోహణ కౌతుకితమతి నంద దిందిరాసుందరీసుందర పురందరోపల కలితసోపాన విరాజితంబగు రోమరాజియు, విరాజమానమై జయంతీ వనమాలికా కౌస్తుభ మణిఘృణిఘృణితాగణితమణి సమంచితకాంచన కవాట తుల్యంబగు వక్షస్థలంబును, చతుర్విధపురుషార్థ ప్రదంబులగు చతుర్భుజంబులు వర్ణనీయ సువర్ణ దివ్యరత్న సముదీర్ణకర్ణయుగళభాసమాన మకరకుండలమండితంబులగు గండ స్థలంబులును, మణిమయ భ్రాజమాన కిరీటంబుగల మస్తకంబును, గలిగి యనాలోచిత శేషాశేషలోక శరణ్యుండును, శంఖచక్ర గదాశార్ఙ్గనందక శ్రీవత్సపద్మవనమాలాలంకృతుండును, అనవధికాతిశయ సౌందర్యమ్యాతవిశ్వమనోదృష్టివృత్తి లావణ్యామృతపూరపూరితాశేషచరాచర భూతజాతాత్యద్భుతా చింత్యనిత్య యౌవనుండును, పుష్పరసవిసరసరదగణ్యపుణ్య గంధవాసితానంత దిగంతరాళ త్రైలోక్యాక్రమణ ప్రవృత్తగంభీరకరుణాకటాక్ష వీక్షితాపరిమితాశ్రితసమూహుండును సజాతీయవిజాతీయ స్వగతభేదస్వరూపుండును, తత్త్వలక్షణుండునగు శ్రీమన్నారాయణుని సంపూర్ణాంశంబువహించిన శ్రీసీతారాముల సేవించిరిదీయ దివ్యశ్రీపాదతులసీతీర్థ దివ్యమంగళవిగ్రహ శ్రీపాదాంకితశఠగోపదివ్యనామ సంకీర్తనకల్యాణగుణ శ్రవణ పానసంతర్పణ శిరోవహనా కర్ణనధన్యులై కాయన భాగధేయుండనై. ౯౦

కం. శతమఖముఖులను దినమును। గతకల్మషులైరినిన్ను • గనుగొనిశరపాతితవాలీ హితకేలీ। శ్రితపాళీ కల్పధామ • సీతారామా ౯౧

కం. నావంటి యాచకౌఘము। నీవంటివదాన్యవరుల • నేనమ్మదగు
• సేవాపర భావాచం। జీవాదరణాభిరామ • సీతారామా. ౯౨

కం. క్రతుశతములుజేసిన ని • న్నతిభక్తిని దలపవలయు • ననుదినమును మా
• హితకైరీ హితకారీ। సితవారిజనేత్రభామ • సీతారామా. ౯౩

వ. అని యిట్టిధంబున శ్రీరామచంద్రుని వినుతించి శ్రీమద్రాజన్న భూపాలహా ళి లక్ష్మీవిలాసనివాస మహాలక్ష్మిని సేవింపదలంచి తన్మహారాజాజ్ఞ గొ ని చని.

చూర్ణిక. శ్రీమత్కులశ జలనిధి విలసదంతరనిరంతర సురవిటపివిటపవలయిత బలభి దుపల విపుల విపులాతల ద్వీపనీపోపవనభవన కాంతచింతామణి ఘృణిధగద్ధగి తమృగరాజవిరాజమానాసనసమాసీనాంహ్రుద్యానవద్యగద్యపద్యవైశారద్యో ద్యద్విద్యాధరీలోచనచకోరానందకరసాంద్రచంద్రాతపవద్దరహాసాస్య రామాం నితాంతలతాంతబాణ బాణశాణాయమానాసమాన మణిగణ ప్రభామండల విచండిలకుండల కమణనిశిత సాయకపీయూకదంబాం, సౌరవరవర్ణినీవర్ణనీయసువ ర్ణవర్ణ నిటలతట ఘటితాకలంక కుంకుమ సంకలిత సుఖసంపాదనసఖము భో ల్లసంతీం తరుణతరణికిరణ జాంబునదాంబుజహారితాళవినీలనీరదాంతర నటిత్త టిత్ఫుల్లహల్లకజపాకర్ణికార కోరకప్రకారతను ప్రభా భానమానాం, కామా లికాబద్ధ సకలస్నిగ్ధ కేశపాశ విభ్రాజమానాం సమానాధికనూతనకేతకీజాతి చంపకాశోక పున్నాగమల్లీ బంధురబంధూకస్తబకకుచకుంభగుంభిత గంధసార ఘనసార మృగమదసంకుమద మసృణఘుసృణ ముఖామోదవిరాజమానాం, నవరత్నగిలితాంచిత కాంచనకిరీట తారహారకేయూరచ్ఛన్నధీర ఝణంఝు ణాయమానకంకణాంగుళీయక ఘంటికోడ్డాణ కాంచీదాము శింజాన మంజీ రాద్యలంకారవిద్యోతమానాం నిరంతర సుముకదంబక దంబవన సంచరన్మద్రిణీ ప్రదాపితోర్ధ్వకీలకుండల మండితప్రభాకర పాత్రశోభిత సుధాకర కిరణ పరా మృతోపహారప్రియాం, శ్రీకామేశ్వరాంక పర్యంకనివాసినీం, సువాసినీ పూజావి ధానావధాన రాచుల్లగోత్రపాత్ర కామినేసి రాజభూమీశ్వరేశ్వర లక్ష్మీవి లాస మాణిక్యసింహాసన స్థిరమహాలక్ష్మీం సదాకలయామి.

వ. అని వినుతించి బ్రహ్మోత్తర ఖండంబునంగల భద్రాయురభ్యుదయంబు ద నింగించి శ్రీరామేశ్వరునకు నర్పితంబు జేయువలయునని యాజ్ఞయొసంగు కా మినేని రాజన్న నృపాలు వంశావతారం బభివర్ణించెద.

సీ. సతతఘూళంఘుళ • స్వనదచ్ఛజీవన
కమనీయ నదనదీ • కదంబంబు
వికచాంబుజోత్పల • ప్రకరప్రసవన్మరం
దాసార కాసార • భాసురంబు

కలకంఠ శుకనీల • కంఠపారావత
నినదముఖరితోప • వనచయంబు
హాటక కటకర • త్నావాస బహుళృంగ
సంగత కృతకాద్రి • సముదయంబు
గీ. తారకాపథకమణాబ్జ • ధవకుముద్వ
తీరమణకాంత కాంతను • స్థితవిశాల
సాలశిఖరోరుకేయ ప్ర • శస్తవస్తు
పుణ్య నివహంబు చెక్కనోల్ • పురవరంబు. ౧౬

మ. చిదచిన్మూర్తి పరాపరప్రకృతిమ • త్శ్రీసిద్ధరామేశ్వరా
స్పదవిద్యాకర దివ్యవారహరహ • స్నానాగతానేక మా
నిదివాకః ప్రభుభక్తి సంస్తుతిమిషో • న్మీలద్విజన్వస్తివా
క్పదయప్రాభవమై తలిర్చెనదిమః • సర్వంసహామండలిన్. ౧౭

కం వర్ణితమణిగణకనకో। దీర్ణరుచిరుచిరవిపణ్యా • ధీనానుపమా
భ్యర్ణప్రదేశగచతు। ర్వర్ణంబులవారుదనర • వహికెక్కెదగున్. ౧౮

మ. బలభిన్నీల విశాలకుట్టిమపరీ • వాహప్రభాహర్మ్యశా
జ్వాలదభ్రంకష శృంగసంగతములై • సౌధంబులోనన్ మహా
చలవంకాశ గజేంద్రబృందములతో • నయ్యాటలాడన్ రసా
తల సర్యన్మద ధారవారణఘటల్ • దారొందున్న చందంబునన్. ౧౯

సీ. స్ఫాటికస్ఫుటకోటి • హాటకకుట్టిమా
ట్టాలకంబులజాల • మాతిశయిల్ల
సాంద్రచంద్రోపల • స్థాపనాంచచ్చంద్ర
శాలాపరంపరల్ • సందడింప
వర సుధాలేపన • స్ఫురదంబు దాయన
స్ఫుగ్గోపురములు రం • జిల్లుచుండ
ప్రతిమార్గనిర్మిత • ప్రచురకాంత్యాథర
రాజితగేహముల్ • తేజరిల్లనయ
గీ. లలితజీవన దంటివి • లానవాన
క్రజకేలీత గేహముల్ • వన్నెబూవ

మందరాద్రిని గైలాస • మహితగిరిని
గేలిఁ గొనఁజాలు నవ్వీటి మేలిములర. ౧౦౦

కం. ఆపురవరము నరంశో। ద్దీపకుఁడై కామినేడు • ధృఢతరబలనం
తావిత వరభూపాలకుఁ • డైబాలిచెనసమస్త లోక • మభినుతిసేయుజా. ౧౦౧

గీ. అతఁడు తద్బిక్క నోలు వృ• రాధిరాజ। పూజ్యసామ్రాజ్యలక్ష్మిచేఁ జాలిచియుంజ
గుతుపపాహాదియవనర్యాట్కుతుకదత్త।ఘనతరాందోళికా దివి,ఖ్యాతిఁగాంచి.

సీ. ప్రాగ్భవోత్కటమద• ప్రవణ గంభీరవే
దులు పాయసంబులై ( వెలయుచుండ
పటుపరోదగ్భూతి • బాహ్లీక కాంభోజ
తురగరింబులు పదలైఁ • బరగుచుండ
ప్రత్యగ్భవోదీర్ణ • వర్ణసౌవర్ణము
ద్రికలుపహారనం • స్థితివెలుంగఁ
దక్షిణ దిగ్భవో • దాత్త ముక్తాఫల
వ్యూహముల్ కానుకలై యొప్పుచుండ
గీ. సరస కర్ణాటరాజ్య ప • శస్తుఁడగుచు
భాగ్యనగరాది రాజ్యసం• భావ్యలక్ష్మి
నొందఁ దలపోసి శ్రీబిక్క • నోలుపురవ
రంబు నిర్మించె శ్రీకామి • రడ్డినృపతి. ౧౦౩

సీ. దివ్యత్క వేరజా • తీరంబున వసించు
పాలె గాండ్రను బడ•ల్పడన డంచి
ఘన సుపర్ణముఖ రోడ్డ • డ్డున వసించుచు నండు
పరి పంథులను బట్టి•భంగ పెట్టి
నవ్యక్షి నాకభృ • జ్జా కూలను న మండు
ప్రత్యర్థులను ఒయల్పడనొనర్చి
రూఢ కృష్ణా నదీ • రోధంబు నందుండు
ప్రతి వాదులను గట్ల • పాలు జేసి
గీ. తనరి నైజ ప్రతాపదీ • ప్త ప్రభావి
ఘటిత దుర్వార గర్వాంధ • కార పటల

రాయవేశ్యాభుజంగాభి • రామబిరుద
సహితుఁడై కామినేఁడు ప్ర • శస్తుఁడయ్యె. ౧౦౪

క. ఆకామినేని నిజనామాంకమై కాంకతము గాఁగ కులము • నలరించినయా
శ్రీకామినేని వంశం • బాకల్పస్థాయి గాఁగ • నవనిఁ బరఁగెన్. ౧౦౫

వ. తదీయపుత్రపౌత్ర సంతాన పరంపరానుక్రమంబున. ౧౦౬

గీ. అవనిఁ దత్కామినేని వం • శంబున సకల
గోత్రపరమైన రాచ • గోత్రమునను
దనరుచుండంగ దత్కుల • మనను గాచి
రెడ్డిభూపతి జనియించెఁ • బ్రథితుఁడగుచు.

క. ఆకాచిరెడ్డికిని సు। లోకుండు రెడ్డియను నాత్మ • జుండుదయించెన్
భూకాంతా సంఘటిత సు। ఖాకౌతుక హస్తకమలుఁడై జనమెన్నన్. ౧౦౭

సీ. ఆ రెడ్డి నృపతి భా • ర్యారత్నమైనదే
చాంబికయందు వి • ఖ్యాతులైన
నదమ కాచారెడ్డి • సరసమల్లారెడ్డి
• భూరి బలోపేత • బొమ్మిరెడ్డి
నాదగు సుతుల నా • నందంబు నన్గాంచె
నందుఁ గాచారెడ్డి • యనునృపుండు
కులకాంతయై మూర్తి • కలితయౌ మాచాంబ
యందు నెల్లారెడ్డి • యనెడుపుత్రుఁ

గీ. గనియె నా యెల్లరెడ్డీంద్రుఁ • డనుపమాన
రూపలావణ్య విక్రమా • రూఢిఁ జెంది
భవ్యగుణసాధ్వి మల్లమాం • బను వరించి
యిష్టవర్తనమున రాజ్య • మేలుచుండె. ౧౦౮

కం. అతిముదమున నెల్లమహీ। పతిమల్లాంబికను గూడి • బలవత్కన్య
క్షితినాథుఁ గాచవిభుఁ డీ। ధృతి రెడ్డియు ననుతనూజ • వర్యులఁ గనియెన్. ౧౦౯

వ. అందు. ౧౧౦

కం. గాచారెడ్డినృపతిస । త్యాచారనిదానదాన • హాదక్ష్యసుతుం
డై చతుర హృదయలోకా । సేచనకతనూకళా వి • శేషుండగుచున్. ౧౧౧

గీ. సకల సాధ్వీమతల్లియై • సంభ్రమించి । యెప్పుడొప్పులకుప్పయై యొప్పవచ్చు
తిప్పమాంబను పెండ్లాడి • ధీరుడైన । సుతులగాంచెను నల్వుర • నతులయశుల.

కం. ధీరుఁడు జంగమరెడ్డియు । దారుండగు గాదిరెడ్డి • ధన్యుండగునె
ల్లారెడ్డి శాస్త్రఖనిమ । ల్లారెడ్డి యనంగఁదగిరిలఁ జను లెన్నన్, ౧౧౩

వ. అందు.

కం. శ్రీకరజంగమ నరపతి । కా కామారెడ్డి కనుజుఁడై సంతతసు
శ్లోకుండెల్లారెడ్డిమ । హీకాంతుఁడు వృద్ధినొందె • హితవర్తనుఁడై.

సీ. అపరవర్ణులెకాని • అపరవర్ణులు కారు
సరివాగ్రహాప్రాప్తి • వంభుతులను
నలతమోనుదులెకా • నలతమోనుదులెగా
రెనశుచితాకాంతి • ఘనరుచులను
గోత్రాధిపులెకాని • గోత్రాధిపులు గారు
తరము ధర్మఖ్యాతి • [illegible]ర్యములను
హరినామకులెగాని • హరినామకులుగారు
బలసత్య పాలన • ప్రాభవముల

గీ. వరహరి హరాగ్ని చంద్రభా • స్కరవృషగురు
శైలమారుతసమవర్తి • చక్రముఖుల
సాటి గోగుచు నెల్లర • సావిభుండు
ధరణిఁ బాలించెఁ ధార్మిక • త్వంబుమెరయ. ౧౧౪

సీ. మొదలు దాతృత్వంబు • తుదియాచకత్వంబు
నిచ్చతోనుండు వాఁ • డెంతవేల్పు

వార్షించి యొకవేళ • యప్పులిచ్చుటకాని
యెప్పుడీ కున్నవాఁ • డెంతవాఁడు
అహమున యాచకుల • యంబిచ్చియప్పుల
నీవిలేదన్నవాఁ • డెంతదాత
యడిగినంతనె యర్థ • మిడక వెన్నెగ కము
న్నొప్పించువాఁడేబ • హుప్రదుండు

గీ. ఇచ్చి మరలంగ గొనక తా • నిచ్చవచ్చి
నట్టులొసగుచు రేబగ • లనక బంచి
పెట్టుచును ముఖ్య వస్తువు • పేర్మినొసఁగు
నెల్లరెడ్డి మహీపతి • నెన్నదరమె. ౧౧౬

సీ. సప్తసంతానప్ర • శస్త కామారెడ్డి
దేశాయి దివ్యాజ్ఞ • దేజరిల్ల
నమ్మహామహుఁడు ని • త్యమాచ్చరించిన
ధర్మంబు నభివృద్ధి • దనరఁజేసి
రాజకార్యాకార్య • రచనలాలోచించి
యుక్తయుక్తములుగా • నొప్పజేసి
బహుళ రత్నాకర • ప్రస్ఫీతదీర్ఘికా
కుల్యాదికిఁ దదాను • కూల్యమొంది

గీ. యమ్మహీపతి కిష్టుఁడై • యనుదినంబు
నన్నలందును దమ్ముల • యందుఁ బేరు
గలిగి విలసిల్లె నెల్లభూ • కాంతుఁ డవని
భారమాత్మీయ భుజమునఁ • బ్రబలు చుండ. ౧౧౭

కం. శ్రీరమణీరమణీయమణీ రుచిరాదగ్నమనఁగ నిపుణశ్రీమె
ల్లారెడ్డిపేట దనరె మ। హీరామాస్యాబ్జ తిలక•హితమైసతమై. ౧౧౮

వ. అది యెట్టిదనిన. ౧౧౯

సీ. ధ్వజపటాగ్రజనిభ • స్వర్ధుతద్యోధుని
సాంద్ర శీకరపూత • సౌధతతులు

సావరద్వీపసాధ్వ • సప్రపదసింహాత
లాటాంశు కోదీర్ణ • హర్మ్యములును
హాటపుర స్త్రీసమా • హ్వానార్థ కంపిత
చేలాలవట్టిక • ట్టాలకములు,
సురపూరహాస్మృతి, నిరసనోత్పతదభ్రి
తోపరి భాగభా • గ్గోపురములు

గీ. స్వాత్త నాట్యక్రమ విలోక • నాగతస్త్రి
దివయు వతిదేహ జస్వేద • నివహసారణ
వీజిత పటత్పటాగ్రప • వేశగృహము
లలరు చుండంగ కత్పురం • బవని వెలసె. ౧౨౦

ఉ. గాటపుకోటకొమ్మలు చో • కాటపుహాటక కూటకోటులున్
బాటిలు గోపురంబులు న • పారములై. తగు స్వస్తికంబులున్
దీటగు చంద్రశాలలు నదీర్ణ విభూత్వము దెల్పనొప్పున
వ్వాటికి సాటియే స్వపుల వీథులు వేల్పుల వీడు లెంచినన్. ౧౨౧

గీ. పనసకుర్వింద సుందర • మరకతాది। కములుగలజాళువాకోటగా నవ్యో
గగనలక్ష్మీకర ధగద్ధగాయమాన। కంకణచ్ఛటరవలించు • పొంకమలర. ౧౨౨

చ. సురుచిరనూత్నరత్నమణి • సోరణగండ్లఘటించి కాంచన
స్ఫురదురు సౌధయూథములు • పూజిత రాజిత శాలి శాలల
స్ఫురిమొనసెన్ సురావహాన • పోషణ తాభినివేశ మేరు మం
దరవఃలు సర్వ సంపదల • దత్తదు పాథులఁ జెందనోయనన్. ౧౨౩

సీ. దక్షిణాయన మరు • త్సహితులు భువనర
క్షాదక్షులు విపక్ష • వంచనమ్ములు
వితత రంభామోద • గతులుప కంఠన
క్షత్రమాలాప్రభా • సంభృతులును
స్ఫటిత శతాంసం • ఘటన శయ్యాన్వితుల్
కిన్నరీ తానసం • గీతవతులు
సురసాలదివ్యభూ • సరణిసుధాదాను
లిభవాహన శృంగు • లచల వృత్తు

గీ. లద్భుత రస ప్రకటిత కాం • తాభిరామ
భామ లోకాభి రాములై • పొలచిన పన
భూచరత్సు మనోవృద్ధి • బూని కేళి
పర్వతేంద్రులు వెలసి • రప్పట్టణమున. ౧౨౪

శా. గంగా భంగతరంగ సంగత విహం • గ వ్యూహ భీకృన్నవా
త్తుంగ ప్రాంగణ గోపురో పనదా • స్తోక ప్రభా భీల మా
తంగాది వ్యవహార సారబల సం • ధాన ధ్వజోపేతమై
శృంగారా స్పదమయ్యె నెల్ల నృపతి • శ్రీమత్పురంబెప్పుడున్. ౧౨౫

మ. స్మరసీజాప్తుఁడొకానొకప్పుడు తదైశ్వర్యాది దృష్టార్థత
త్పరుఁడై నిల్చిన సాలజాల శిఖరస్థప్రోజ్జ్వల న్మాణిక్య ర
త్న రుచి వ్యూహము వక్ర చక్రగతి నొందన్నాట నుండివ్వ సుం
ధరలోనంబరివేష భూషిత పదస్థానుండ సంగన్బడెన్. ౧౨౬

చ. అహరహ మప్పురీపరిసరాంచిత కాంచన కూటకోటి సం
గ్రహణ విలాస వాసములఖండ విభా విభవంబు దోపనా
గ్రహముల ధిక్కరించిన చిరంతన కాంతమణీ గణాంతరా
వహగతిఁ జూచు వారికి దివస్స్పృహ జేయుచు నుండు నెల్లెడన్. ౧౨౭

క. పద్మహిత స్వర్ణమణీనపద్మండగు నెల్ల నృపతిస్వన మాఖ్యఁదగన్
పద్మాకర పద్మాకరపద్మాకరముల నొనర్చిప్రజలు నుతింపన్. ౧౨౮

సీ. ఒక విప్రు చులుకంబునకు లోనుగాకున్న
లవణ సముద్రంబు • నవతి యగును
కేవల ఖండవికృతి జెందకుండెనా
మైక్షవాంబు ధినమంబగు దలంపఁ
బానంబుచేఁ దంద్రపట్టింపకుండెనా
మదిరా సరిత్పతిమాద్రియగును
ముక్కవాసన లేకచొక్కమై యుండెనా
యాజ్యాబ్ధి సిద్ధి జత యగు వచింపఁ

గీ. జరఠబడబకున్న దధివార్ధి తరమునగును
జరణమించని క్షీరాబ్ధి పాటియగును
దేల లేకున్న శుద్ధాబ్ధి పోలికగును
ఘనత నెల్ల విభుని తటాకంబు తోడ. ౧౨౯

సీ. మాని సంచిత కమండలూజ్జ్వలజలో
త్పన్నయౌ నలద్వీపవతిని విడచి
తాపస భుక్త సంత్యక్తయై విలసిల్లి
చరియించినట్టి నిర్ఝరిణి వదలి
హరిభేద్యమానయై యవనీతలంబున
మెలగుచున్నట్టి శైవలిని గడచి
ముని శప్తయై గుప్తమాలంబునం దిరంగి
రయిదగి యున్నట్టి యన్నదినిం దాటి

గీ. కలిత రాచుళ్ళ గోత్రతకామినిని
వంశోండెల్లన నృపమౌళి పరతటాక
గర్భమున శివనాథ ముఖ్య స్వామూర్తు
లగుచు హరిహరులై యుండు రనుదినంబు. ౧౩౦

సీ. కలధౌతనిలయ సంగ్రహణుం డసంగను
హిత సర్వ మంగళాన్వితుం డనంగ
బుధ చమూపతి సద్విభూతి యుక్తుండన
సంతత ద్విజరాజసహితుం డనంగ
ననయంబు రాజ రాజాంచ త్సభా నీకుం
డనంగ సత్య శ్రీనిందనరె ననంగ
నహిత దక్షావళీపహరణుండనగను
ఘనత దుర్గాధ్యక్షుండనంగ వర్ణ

గీ. నీయుండై మించె శ్రీ కామినేని కులజుం
డైన శ్రీ యెల్లరెడ్డి దేశాయి మౌళి
యతి దయాసాంద్రుం డాత్మాన్వయాబ్ధి చంద్రుం
డలరు శ్రీ సాంబమూర్తియో యనంగ ధరణి. ౧౩౧

క. శ్రీమద్యల్లారెడ్డి మహీ మండల నాథశౌరి, కిందిరవలె సా
ధ్వీమణి కీర్తిత వర్తనయై మోదమొనర్చెఁ బోచమాంబధరిత్రిన్. 132

సీ. [illegible] ల్లారెడ్డి దేశాయి
[illegible] మోదమున బోచమాంబయందు
నందనుండై తగిన విస్సారెడ్డి ముత్తెయి
రెడ్డియు చినకామిరెడ్డి యనెడు
పుత్రుల మువ్వుర భూరి కీర్తులఁగాంచె
నా మువ్వురిలో గీర్తి కాముఁడైన
శ్రీమంతుఁడైనట్టి చినకామిరెడ్డింద్రుఁ
డవని భారము బూనియుగ్రగణ్య
గీ. దేవతా గురుభక్తి సందీప్తుఁడగుచు
మాని తాడ్లూరు సీమసామ్రాజ్య పూజ్య
పదవిఁ జెన్నొంది గ్రామముల్ పట్టణములు
విరివిగాఁ బెంచెఁ దన మహావిభవములర. 133

సీ. తన కీర్తి చంద్రికా తతసార సుందరీ
ముఖ చంద్ర మండలంబుల వెలుంగ
దనగుణ రత్నముల్ ఘన దిగ్వధూటికా
స్తనహార వర్తులైసంభ్రమింపఁ
తన దివ్య తేజంబు దినకర బింబ సం
దీప్తి కరంబయి తేజరిల్లఁ
దన మహా విఖ్యాతి వనజ భవాండ భాం
డాంతర పూర్ణతఁ దిశలనుల్లఁ
గీ. దనరె నని జన మనుదినమును నుతింపఁ
గుశల చారిత్రు రాచుల్ల గోత్ర పాత్రు
గామినేన్యన్వయునిఁ జిన కామిరెడ్డి
దేశముఖు నెన్నఁదరమె పృథ్వీతలమున. 134

సీ. రమణీయ చినకామిరెడ్డింద్రునకు సార
సముఖ మువ్వురుదయించి రలఘుబలులు

మహిత పోతారెడ్డి విహిత కంతారెడ్డి
ననయుఁ డెల్లారెడ్డి యన జలిర్చి
రందులో నగ్రజుండైన పోతారెడ్డి
నిగ్రహానుగ్రహనియత శాలి
శ్రీ భాగ్యనగర రాజ్యాభిత స్థిరతర
ప్రభువర్య వర్ణిత ప్రాభవుండు

గీ. నలభగీరథ నృగు సగరులను దెగడి
పడమి పడఁతికి సౌఖ్యంబు పొనఁగఁజేసి
రాజరాజ మహారాజ రాజ బిరుద
సహిత పోత మహీనేత చంద్రుఁడలరె. ౧౩౫

సీ. శాత్రవాక్రాంత సలిల పూర్ణంబైన
జల దుర్గమున స్వశాసనము నిలిపి
దురవగాహంబరుంతుద పథంబగుచున్న
వన దుర్గముల నిజాజ్ఞను విధించి
పర భయంకర జలప్రత్యవ స్థాతుయు
క్త స్థల దుర్గముల జయస్తంభ ముంచి
దుర్ధర్ష దుర్ధర్ష ప్రాకార విద్వేష
చ్చెల దుర్గములు వశ్యములు జేసి

గీ. యదుభృత్తైశ్వర్య ధుర్యుండు ననుపమాన
శౌర్య ధుర్యుండు వీర్య గాంభీర్యుఁడగుచు
పోతి రెడ్డీంద్రుఁ డాశితాంభోధి చంద్రుఁ
డవనిఁ బాలించె బూర్వ రాజానుమతిని. ౧౩౬

శా. ఏ రాజైనను రెడ్డి నామమున నీ వ్యాప్తిన్ బ్రవర్తించునే
యే రెడ్డైనను రాజ శబ్దమున బం హిష్ఠ స్థితిం జెందునే
ధారావాహిక బుద్ధిచేఁ దనరు పోతారెడ్డి దేశాయి ము
న్నీరాజన రెడ్డిన భూషనము న్నీల ద్యశో లక్ష్మిచే. ౧౩౭

క. ఆసేతు తుహాచల వాసరమణి శైల శాలి పశ్చిమ ఖరము
ధ్యాసీన ధర్మవజ్జయ శాసనుఁడై పోతిరెడ్డి జన విభుఁడలరె. ౧౩౮

సీ. అద్భుత స్వాపతే • యమువ్యయంబానరించి
బహు తటాకంబులే • ప్రభుఁడొనర్చె
నిమ్నోన్నత క్షోణి • నిమ్నగా తుల్యకా
కుల్యలనే ధార్మి • కుండు ద్రవ్వె
నిర్జన స్థలులపై ని • ఖిల ప్రజోల్లస
ద్గ్రామములఁ బేటలే • ఘనుఁడు గట్టె
దుర్గమార్గంబుల • దోఁగంబులైనట్టి
యారామములనే మ • హాత్ముఁడుంచె

గీ. నప్పితామహు ధర్మంబు • ననుసరించి
యంతకన్నను మిక్కుటం • బై దలిర్చ
వాని పరిపాలనముఁ జేసి • వసుధనేల
యెల్ల భూపాలు పోత ధా • త్రీశ్వరుండు. ౧౩౯

క. శ్రీ పత్యంశ భవుండగు । నా పోతారెడ్డి మాచ • మాంబికయందున్
దీపిత పుత్రులఁ గనియె మ । హీ పాలన శీలన ప్ర • హేతులుగాఁగన్. ౧౪౦

మ. లలితాలంకర కాంచితా వయవుఁ డై • ల్లారెడ్డి జోగావనీ
తిలకుల్ వారలు దాన ధర్మముల ధా • త్రీ నిర్జర శ్రేణులన్
వెలయంజేయుచు రాజ కార్య ఘటనా • విఖ్యాత కౌతూహలం
బలరన్ వర్ధిలి రాహవ ప్రకటితా • హంభావ పుంభావులై. ౧౪౧

వ. అందు. ౧౪౨

శా. అంకారంభ విజృంభమాణ విజయో • ద్యద్భేరికా ఝాంక్రియా
లంకర్మీణ మహారవ శ్రవణ వే • ళా నిశ్చలాకాటవీ
కింకుర్వాణ వచోవిచార పరులై • గ్గించన్ దలిర్చన్ రణా
లంకారాసి భుజార్గళుండగుచు నె • ల్లారెడ్డి భూమండలిన్. ౧౪౩

సీ. ఒక వేళఁ బరిహాస • మొనరించె నేనియు
నుచితోక్తులే కాని • యొండు లేదు

శయనించి యుండియు • స్వప్నంబు నందైన
నన్యకాంతాగోష్ఠి • నరయలేదు
సాహసోదగ్రుండై • శాత్రవునందైన
దుర్గుణారోపంబు • దొడరలేదు
మనసున నుడులనే • మరపాటు నైనను
దగనసత్యపు దల్పు • దలచలేదు

గీ. గాన నీ రెడ్డి నృపతియా • కల్ప మవధి
గను ప్రవర్తించ వలెనని • జనులు పొగడ
ప్రబలి వర్ధిల్లెనెల్ల భూ • పాల మౌళి
తన సమజ్ఞాలతలు కల్ప • తరువు ప్రాక. ౧౪౪

క. ఆ యెల్లనృపతికతి భా • గ్యాయత జగ్గమ్మ భార్య • యై దనరె న
ద్ధ్యాయతన ముఖకమల శో • భాయుతయై బుధనిజనులు • ప్రస్తుతి సేయన్. ౧౪౫

గీ. అమ్మహీపతి కనుజుండై • యవని వెలసె
జోగి రెడ్డీంద్రుం డత్యంత • సుగుణగణ్యుఁ
డ ప్రతీప ప్రతాప ప్ర • తాభిరాముఁ
డాశ్రిత కదంబ వార్ధి కా • బ్జాభుఁడగుచు. ౧౪౬

మ. గరిమన్ భూపరి పాలకుండయిన జో • గారెడ్డి తేజో విభా
స్కరుఁ డొప్పన్ మును చక్రవాళగిరి పా • ర్శ్వవ్యాప్త ప్రదేశ స్థమ
స్తర జీవోల్లుఠ దంధకార చయభి • ద్భావద్విప త్కామినీ
వర ధమ్మిల్ల తమోనివారక కర • వ్రాతంబు సంధిల్లగాన్. ౧౪

చ. నిరతము భూజనమ్ములకు • నెమ్మదిరంజిలఁ జేయుచున్ ధరా
సురలను బ్రోచు చోదనకు • జోగనృపాలుఁ డొనర్పు దానవి
స్ఫురణను జూచి కల్పతరు • పుంజము దుర్యశమున్ వహించె నా
కర మరయంగ షట్పద పిక • ప్రకరాదిక కైతవంబునన్. ౧౪

శా. కారుణ్యాకర మూర్తియై వెలయు జో • గారెడ్డి సత్కీర్తి హం
సీ రత్నంబు సమస్త విశ్వములని • క్షేపించు నండంబుల

త్యారూఢంబుజ సంభవాండ తతి • మధ్యస్థంబులై యుండ త
త్పారంపర్యము నొంది పిక్కటిలుచో • బంహిష్ఠ వృత్తిన్ దగన్. ౧౪౯

సీ. అంగవంగ కళింగ • బంగాళ వనితలు
లలిమించు వీచోపు • లను వహింప
లాట కర్ణాట ష • రాట భోటాంగనల్
విమలంబులగు ముకు • రములు బూన
మాళవ మళయాళ • చోళ నేపాళ కాం
భో ధరల్ వేటు రు • మాళ్ళ వీవ
గొంకణ కొంకణ • కుకురు కాశక యూశ
రమణులు వీటీ భ • రములు దాల్ప

గీ. సర్వ సర్వం సహాచక్ర • చక్రవర్తి
లక్షణోపేతుఁడై మహా • లక్ష్మీ మదనర
కామినేని కులాం • భోధి సోముఁడైన
జోగ భూపాలుఁడలరె యు • శోధనుడయి. ౧౫౦

క. ఆ జోగారెడ్డి మహీ • రాజుకు దేవేరి యగుచు • రంజిలె సుగుణ
భ్రాజిత చొక్కవ్వ జయశ్రీ జగతీ సదృశయగుచుం • జిర కీర్తి దగన్. ౧౫౧

గీ. సుదతి పుట్టిన యింటికి • జొచ్చినింటి | కలరు వన్నియఁ దెచ్చిన • తలిరుఁబోడి
చారుతరకీర్తి వలయపాణి • కీరవాణి | యైన చొక్కవ్వ నెన్నఁగ • వలవియగునె ౧౫౨

క. శమదమముల నెన్నఁగ నా | యమసమథ్యే మగుపతీశ్వ • రార్చితమతియై
రమనను దినంబుపూజల | నమరఁగ జేయుచును చొక్క • మాంబదలిర్చెన్. ౧౫౩

గీ. అట్టి జోగనృపతి చొక్క • మాంబయందు
భూరి బలవంతుఁడైనట్టి • పోతిరెడ్డి
సుందరాకారుఁడై యుండు • జోగిరెడ్డి
యనఁగఁదగు బుత్రులను గాంచె • వనయులుగను. ౧౫౪

క. ఆ జోగిరెడ్డి మహా • భాగుండతి నీతిపరుఁడు • ప్రకటతరసమా
భ్యాగరిమనొనరి రాజ్య | శ్రీ గురు బుద్ధి ప్రసిద్ధిఁ • జెందుచునుండెన్. ౧౫౫

గీ. ఆమ్మహీపతి భార్యయై • యలరె లింగ
మాంబ, విల సద్గుణ గణావ • లంబ యగుచు
జోగిరెడ్డి మహీశుఁడర్ • సూన శరుని
కల రతీదేవి యనఁదగి • యలరె భువిని. ౧౫౬

క. ఆ జోగిరెడ్డి కగ్రజుఁడై జనములు బొగడ నెగడె • నాత్మీయయశ
స్తేజశ్చంద్ర దివాకరుఁ | డై జగతీ భారమూని • హర్షిత మతియై. ౧౫౭

శా. లలిన్ సవ్వులకైన బొంకడు బుధా • ళింబూజనొందించు, సు
శ్రీలన్ దా ధనమున్ నగున్ శివునిపైఁ • జిత్తంబు గీలించి ము
న్నాలాయంబు పసిండి పువ్వులను శే • వాయుక్తి నర్పించు ధీ
శీలుండై తగు పోతిరెడ్డి నృపతి • శ్రీ నాథుఁడత్యున్నతిన్. ౧౫౮

సీ. సతత విద్వత్కల్పి • తేశ్వర పారిజాతంబు
సార స్థైర్యంబున • మేరు నగము
ప్రతి దినాభ్యుదయాప్త • బంధు రక్షణ శాలి
పుంజీభవద్యశో • రంజితుండు
గణుతికెక్కుచు ధర్మ • గుణగణో జ్వలుఁడెంత
పనికైన నాడి త • ప్పని ఘనుండు
సుర్వీశ్వర సమర్చి • తో పథా సంభృతి
యర్థి సందోహ క • ల్పాగమంబు

గీ. దాన కర్ణుండు రణ సమిం • ధాన పార్థుఁ
డాశ్రితావన శీలుఁడం • చఖిల జనులు
సన్నుతించంగ దగె సద్వి • చార పరుఁడు
పోతిరెడ్డి మహీపాల • పుంగవుండు. ౧౫౯

మ. నవ ఖండంబుల మోచుపారలు మహా • నాగంబులున్ ఘోణియున్
జవ నత్కూర్మము సర్వ మద్రులని హా • నంబెన్ని పోతావనీ
ధవదోర్వజము యంవు పీఠమున మో • దంబందు నా ధారుణీ
యువతీరత్నము గాసిచో నదయు భో • గోద్యుక్తయై యుండునే. ౧౬౦

క. ఆ పోతారెడ్డి మహీ • భూపాలుని భార్యయగుచుఁ • బొగడొందె నయ
శ్రీపతిపూజా పరమ్మోద • యాపాదిత భక్తి సర్వ • మాంబ దలిర్పన్. ౧౬౧

గీ. అర్థి జనములఁ గనుగొన్న • నాదరించి
పూజలొనరించి యన్నమిం • పుగ విధించి
యన్నపూర్ణ భవానియో • యనఁగ మించి
సర్వమాంబికద నరెయా • జగతిలోన. ౧౬౨

సీ. సమ్మోద మొనరంగఁ • దమ్మిగద్దియ నుంచు
కొమ్మఁ జిత్తమ్మున • గుదురు కొలిపి
బలువైన చలువగు • బ్బలి రాచ కూతురు
నెలఁమి మానసమున • నిరవు కొలిపి
పటు బుద్ధి మగని పు • క్కిటనుండు పోలతుక
డెందంబులో ముందు • పొందు పరచి
సురరాజ రాణి చం • దురు కీరవాణి ము
న్నంత రంగంబున • నలరఁ దలఁచి

గీ. వారివారిని గురుకరి • వీరకర్ణి
కార చంపక నవమల్లి • కాజపాప
కుందకాంచనముల పూజ • లొందఁజేసి
యింపుదళుకొత్తుచుండ రా • జింపుచుండె. ౧౬౩

శా. ధీయుక్తిన్ ధరణీసురాగ్రణుల భ • క్తిన్ బూజ్యలం జేయుచున్
శ్రేయోవంతుని పోతభూమిపతిన • ర్థిం బ్రేమ పాటింపుచున్
స్వాయద్రూప విలాస వైఖరులచే • సర్వాంబ రంజిల్లె శ్రీ
న్యాయంబేర్పడ సజ్జనంబులకు నా • నందంబు సంధిల్లగన్. ౧౬౪

క. శ్రీ రాజేశ్వర కరుణర । సారూఢ కటాక్ష వీక్ష • ణాగత రాజ్య
శ్రీ రక్షణ దక్షణ పో । తారెడ్డి మహీపతికి ము • దంబలరారన్. ౧౬౫

గీ. మానవతియైన యా • సర్వమాంబ గర్భ
మునను జన్మించి ప్రతి • దినాభ్యుదయమొంది

నర్వ నర్వం సహా చక్ర • శక్రుండనంగ
వెలసె రాజన్న నృపమౌళి • విశ్వమెన్న. ౧౬౬

సీ. తన సమాఖ్యావధీ • తతినిత్య దానాంబు
ధారలచే వృద్ధి • దనరుచుండఁ
దన సుగుణ సుమంబు • ల నుపమ ధర్మ ధీ
కల్పలతాగ్రణిఁ • గలసివెలయ
తన విశ్రుత శ్రుతో • దన్వతీశ్వరునకు
శమదమాదులు తరం • గములు గాఁగఁ
దనకరుణామృతం • బునకు నేత్రాంతముల్
కలశయుగంబులై • కానుపింప

గీ. ధరణి వర్ధిల్లెనని సుధీ • తతులు బొగడఁ
గుశల చారిత్రు రాచుళ్ళ • గోత్ర పాత్రుఁ
డమిత జయసాంద్రు కామి • నేన్యన్వయేంద్రుఁ
డైన రాజన్న చౌదరి • యవని నేలె. ౧౬౭

సీ. విధులై మహా యజ్ఞ • విధులై శివార్చన
విధులైఁ దగిన వేద • వేత్త లలర
పదవులై సద్వనీ • పదవులై ఘన దవా
పదవులై ప్రతి పక్ష • లొంగుచుండ
కృతులై పరానిరా • కృతులై సదుక్తి ఖ్యా
కృతులై విచక్షణుల్ • నుతులొనర్ప
మాన్యులై రాజ న • న్మాన్యులై విజితారి
మాన్యులై సైనికుల్ • ఘనినిగొలువ

గీ. ప్రకట పాషండ బౌద్ధ చా • ర్వాక జైన
విరస మతములు తన మహా • సరస వచన
రచనల హసింపుచును రాజ • రాజ సదృశుఁ
డై తగెను కామినేని రా • జన్న నృపతి ౧౬౮

శివభక్త గణముతోఁ • జెలిమి పాటింపుచు
శివకథాశ్రవణంబు • చేఁదలిర్చు
నవ్య వివాహోప • నయనార్థ మర్థించు
భూదేవతలఁ దృప్తి • బొందఁజేయు
క్రతుని మిత్రాగత • శత సంఖ్య విప్రోత్త
ములు గోరు విత్తమి • మ్ముగనొసంగు

గీ. ఘన తటాకోప వనదీర్ఘి • కలను కూప
ములను నిర్మించి కారుణ్య • కలితుఁడగుచు
నిలను బాలించె శ్రీ కామి • నేని కులజుఁ
డైన రాజన్న చౌదరి • యనుదినంబు. ౧౯

మ. ప్రయుత శ్రీకర కామినేని కులుఁడౌ • రాజన్న భూమీశ్వరుం
డయితో దీర్ఘ సువర్ణ ముద్రికల ది • వ్యాచ్ఛాద్య నాదంబులన్
వ్యయ భాగంబొసరింపుచుండగను నిత్యంబవ్రత ప్రార్చిత
ప్రియ మేధాయను వైదికోక్తి దనరున్ • రేయున్ బవల్ దత్సభన్. ౧౨౦

సీ. జపముచే భీకరా • హవముచే రాజ్యాను
భవముచే రామ ప్రభావ మెన్న
భక్తిచేఁ దేజ ప్రయుక్తిచే కాంతి ప్ర
సక్తిచే ఖగరాజ సరణులెన్నఁ
బ్రాప్తిచే సకల విద్యాప్తిచేఁ బావన
వ్యాప్తిచే శుచి వృత్తి ననుసరించుఁ
గీర్తిచే సౌందర్యమూర్తిచే జ్ఞాన వి
స్ఫూర్తిచేఁ గృష్ణ సంశుద్ధులరయు

గీ. శరభ భృగురామ రాఘవ గరుడసూర్య
చంద్ర శివ కవివహ్ని విజయగదాగ్ర
జన్మ సత్యవతీ సుత సరణులెసఁగ
నరస రాజన్న దేశాయి చంద్రుఁడలరే. ౧౨౧

సీ. కింపచాన సదాన్నితంపచానలు నిత్య
దివ్యాన్న భోక్తలై తేజరిల్ల

గచ్ఛరోద్వేల్ల త్ఫటచ్ఛటల్ సంతతో
దంచదంశుక ధారులై దలిర్చ
బ్రజ్ఞాన మార్గాన భిజ్ఞాన భూసురుల్
వేదశాస్త్రజ్ఞులై వెలయుచుండ
హల్యానుగత కర్మ కల్యాణరజులు స
ద్గ్రామాధికారులై రంజిలంగ

గీ॥ జేసి వారల కిష్టార్థ సిద్ధులొసంగి
పుడమి రంజిల్లె భూభుజుల్ బొగడుచుండ
రమ్యతరమూర్తి చంద్రికా సౌమ్య కీర్తి
నిపుణ రాజన్న దేశాయి నృపవరుండు. ౧౭౨

సీ. తెలిదమ్మి గద్దియ చెలువొందు పైదలి
దలిరమ్మ దొరతండ్రి గెలువు కొమ్మ
కొమ్మచే నిలకింపు గూర్పునాతని మేను
మేను దాల్పుల నేలు వానివ్రాలు
వ్రాలు గట్టుల గొట్టు వాడెక్కిన మెకమ్ము
కమ్మదీయక పాలు గమ్మసొమ్ము
సొమ్ముగా జిలువరా నొమ్మ జేసినవాడు
వాడు జూపక తాశి గూడినలరు

గీ నలరు నల్లని వలువచే వెలయుసామి
సామి చెలితోడ జగడంపు (బు) నలుపు సవతి
సవతిగోనె గామినేని సద్వంశమౌళి
పరస రాజన్న నృపతి యశమ్ముతోడ. ౧౭౩

సీ. తన మూర్తి విధునకు జననేత్ర పంక్తులు
కువలయ స్థలములై కొమరు మిగుల
తన విత్తమునకర్థి జనకరాజ్యంబులు
నిక్షేప సంస్థితి నియతి జెంద

తనదు తేజోదీపమునకు స్వాన్వయములు
భువన జాలంబులై ప్రభ వహింప
దన బిరుదులకు దిక్తటములు శాసన
స్తంభంబులై నితాంతముగ వెలుగ

గీ. వలరె నని సజ్జనంబు లభినుతింప
గామినేన్యన్వయాంభోధి హేమధామ
సన్నుత ఘన ప్రసన్న రాజన్న నృపతి
ధరణి బాలించె ధనధాన్యసరణి దనర. ౧౨౪

గీ. అమ్మహీనాథు భార్యయై యలరుచుండె
రామమాంబ సుశీలాభిరామ మాంబ
నిత్యసత్య వ్రతాచార నియమ వృత్తి
సకల సాధ్వీమ తల్లులు సన్నుతింప. ౧౨౫

సీ. రాజకార్య విశేష రచనల నిజభర్త
కానుకూల్య ప్రధాన సాధ్య యగుచు
భర్తృ శుశ్రూషాభిరత కర్తవ్యార్థ
ములయందు దాసీత్వ కలన జెందు
వల్లభాభీష్టాన్న కాంక్ష విచారించి
సర్గత మాతృ భావంబు నొందు
పతి దేహ సౌఖ్య సంపాదన క్రియ నెంచి
రంభావిలాస సంరంభ మొనయు

గీ. ధవుడు ధర్మ ప్రవర్తనత్వంబు దలప
నానుకూల్యంబుగ మెలంగు నవనివంటి
బరవసము బూను సాద్గుణ్య భవ్యమూర్తి
రామమాంబ దలిర్చె శ్రీరామ యగుచు, ౧౨౬

సీ. తనపేరు సేరిలందనరు ధాన్యంబుల
నర్థంబు ప్రముపిట్టునర్థితతికి

దన దివ్య సహకార తరువులలో గొన్ని
వృత్తముల్ విప్రుల కెలమి నిచ్చె
తన సమార్జిత విత్తమును వివాహోపన
యనముల కర్పించె వినయమెసఁగ
తన సమ్యగిష్టు సంజనిత శర్మ విప్ర
కృత సమారాధనా ర్పితము జేసె

సీ॥ సకల జనములకును దల్లి యగుచు దేవ
భూమి సురలకు వృత్తులు పూర్ణముగ నొ
సంగి తత్కరుణాశీర్వచనములంది
రామమాంబ దనర్చె సూత్రామ గరిమ. ౧౩

గీ. అమ్మహారాణి పిమ్మట నలరె జిన్న
రామమాంబిక స్వప్రియారామ యగుచు
దానధర్మ ప్రసంగ తత్పరతఁ దనరు
ప్రియుని కనుగుణ హృదయయై పృథ్విలోన. ౧౪

గీ. చెలఁగివారల పదపడి శ్రీ భవాని
దనరె సాధ్వీలలామయై ధరణిలోన
ధన కనక వస్తు వాహన ధాన్య దాన
దాసికా గోగణాది సంతతి దలిర్చ. ౧౫

గీ. అవని మద్యుత్తర శతత్రయంబులైన
సద్వ్రతము లాచరింపుచు సంతతంబు
రాజ రాజేశ్వరాంఘ్రినీ రేజ యుగము
నెమ్మనంబునఁ దలఁచుచు నిగుడుచుండె. ౧౬

సీ. ఘృతసూపదధి యుక్త కించి దన్నంబైన
యన్నంబె కాని శుష్కాన్న మిడదు
ఖాది శైలాదులు గల్గు వీడ్యమె కాని
వట్టి తాంబూలమి వ్వంగ లేదు

రమణీయ సూత్నాంబ • రంబులనేకాని
జరదంశుకంబులో • పంగ లేదు
సకల వస్తు విశేష • సదనంబులేకాని
శూన్య గేహంబులఁ • జూపలేదు

వసుధలో గల్గువార లె • వ్వారలైన
నర్థులైవచ్చి యాచించు • నంతలోన
తనయులను బ్రోచు తల్లి వి • ధంబు దోప
నెలమి రక్షించిన భవాని • నెన్న దరమె.　　　　　౧౮౧

సీ. స్వాధ్యాయ పరులను • సమ్మదంబలరించి
దాన ప్రసంగంబు • దలఁపుచుండు
శాస్త్రి సంఘంబును • సంభ్రమంబొనరించి
యత్యంత మధురోక్తు • లాడుచుండు
సకల పురాణజ్ఞు • లకు ముదంబొనరించి
దేవతాంతరములు • దెలియ నడుగు
నితిహాస వేదుల • నీప్సితంబొనయించి
సద్వ్రత స్థితిగోష్టి • సలుపుచుండు

నిత్య సజ్జన సహవాస • నియమమునను
దేవగురువిప్ర విశ్వాస • భావమునను
విశ్వ సంపత్సమృద్ధియు • వెలయుచుండు
నా భవానమ్మ నెన్నంగ • నలవి యగునె.　　　　　౧౮౨

సీ. శ్రీరాజరాజేశ్వ • రీసపర్య యొసర్చ
పుణ్య సీమంతినుల్ • జొగడుచుండ
రాజేశ్వరామేయ • పూజా విధి వహించు
విప్రోత్తములు మెచ్చి • వినుతిసేయ
సకల సంపద్వృద్ధి • జప ముఖ్యము వహించు
స్నాతక వ్యూహంబు సన్నుతింప
నిరతాన్నదాన ము • నీమచే వర్తించు
నా బాలగోపాల • మభినుతింప

హితపురోహిత బాంధవ హృదయ మంత్రి
మిత్ర భటదాస సఖులను బుత్రులనుచు
దలఁచి రక్షింపుచున్నట్టి ధర్మమూర్తి
యగు భవానమ్మ నెన్నంగ నలవియగునే. ౧౮౩

సీ. అధ్యాత్మ విద్యామహో పాధ్యాయులను నిల్పి
వేదవేదాంగముల్ వెలయఁజేసె
శ్రుతి శిరఃపరిచయా న్వితపండితుల నుంచి
స్థిర చతుశ్శాస్త్రముల్ దేటపరచె
నాత్మ నామాంకంబు లైన పేటలలోన
వృత్తి మాన్యంబులు వెలయఁజేసె
దనివోంద నన్నస త్రంబులు విధియించి
బహు దేశ విద్యార్థి పంక్తిఁ బ్రోచె

నగ్రజాతులు మొదలైన యఖిల జాతు
లందు దయయుంచి యన్నప స్త్రాదు లొసఁగి
శ్రీ భవానమ్మ విలసిల్లె శ్రీ భవాని
యనఁగ రాజన్న నృపు భార్య యవనియందు. ౧౮౪

సీ. ధన్యమాంగల్య మా త్ర ప్రసిద్ధి వహించి
జన మనోరమ వృత్తి సంతసించి
సకల కలాభిజ్ఞ చాతుర్యమునమించి
విదిత ప్రజావృద్ధి విభవమొంచి
ప్రకటీకృత ప్రభా పద్ధతి సవరించి
తరుచు నుద్దృఢ వ్రతంబు గాంచి
రూపలావణ్య [illegible] రూఢి విహరించి
హావభావవిలాస మనుసరించి

గీ. సతి మహాలక్ష్మి భారతి, శక్ర జనని
ప్రభు జనక జాత దమయంతి రతిఁదలంచి
కామి చేసి భవానమ్మ గారితోడ
సాటిసేయంగ వచ్చును సరసమతులు. ౧౮౫

సీ. ధైర్యంబు స్థైర్యమౌ • దార్యంబు గాంభీర్య
మలరుచు నుండు నీ • యవని పతికి
శమదమా ర్జవతితి • క్షాతప శ్రద్ధా స
మాధాన మిమ్మహా • మహుని జెందు
రాజ కార్యాకార్య • రచన పాత్రాపాత్ర
నిర్ణయం బెప్పుడీ • నృపతి నెనయు
దయయు సత్యము నీతి • ధర్మంబు శీలంబు
బొందుచు నుండు నీ • భూమి పతిని

గీ. ననుచు సకల కవీశ్వరు • లభినుతింప
నిపుణుడగుచును నాభవా • నీ సమేతుఁ
డగుచు రాజన్న. దేశాయి • స్వాన్వయాబ్ధ్యుఁ
దైన సత్పుత్రుని గనంగ • నాత్మ దలఁచి. ౧౮౬

సీ. వేద వేదాంగ ప్ర • వీణమై విలసిల్లు
విప్ర సందోహంబు • వెంబడింప
క్షాత్ర కర్మాది ప్ర • శస్తమై తగినట్టి
క్షత్రియ వ్యూహంబు • సందడింపఁ
గ్రయ విక్రయార్థ్యని • ర్ణయముచే గనుపట్టు
యూరవ్య సంఘంబు • చేరి కొలువ
స్వాధిక వర్ణ సే • వాన్వితమై యుండు
శూద్ర సమూహంబు • శోభిలంగ

గీ. వేద్య పంచ మహావాద్య • విభవ మలర
సౌమ్యరమ్య సువాసినుల్ • సరస రాగఁ
రాజరాజేశ్వరాంశ్వని • భ్రాజమాన
మైన వేములవాడ నె • య్యమునఁ జేరి. ౧౮౭

సీ. ధర్మకుండోదక • స్నాన కార్యంబుల
జెంది రాజేశ్వర • మందిరంబు
దర్శించి పర్వతి ది • వ్యమర్త్య రూపిణియైన
భ్రమరాంబికకు మ్రొక్కి • పసపు కుంకు

మంబులఁ జెన్నొంది • సంబరంబున రాజ
రాజేశ్వరుని ప్రేమ • రంజిలంగఁ
ఋషి విశిష్ట శత • రుద్రీయ ముఖ్య సం
స్తవములొనర్చి త • త్సవిధ సీమ

ఆ. నన్న పర్వతంబు • లాజ్యనదంబులు
విరివిగా విధించి • విప్ర ముఖులఁ
దృప్తిఁబొందఁజేసి • దివ్య షోడశ మహా
దానములఁ దదర్చి • తములఁజేసి. ౧౪౮

గీ. ఇవ్విధంబున నొనరించి • యేకవాస
రంబు నియమంబునను జాగ • రంబొనర్చ
నీశ్వరేశ్వరుఁడైన రా • జేశ్వరుండు
వరమొసంగిన తన్మహా • వరము కలిమి. ౧౪౯

గీ. భవ్య రాజేశ్వర వర ప్ర • భావమునను
సంతతా చరిత వ్రతా • చారమునను
తనదు నియత పతివ్రతా • ధర్మమునను
శ్రీ భవానమ్మదగె నర్ధి • సేవధియన. ౧౫౦

గీ. ఆ భవానమ్మకుదయించి • రమ్మహేశు
కరుణ నొకపుత్రుఁడొక • పుత్రికయు ప్రబుద్ధు
లగుచు రాజన్న రాజమ్మ • యనఁగ దనరి
చంద్రుడునులక్ష్మియు జనించు • చందమునను. ౧౫౧

గీ. నిత్యసత్య వ్రతాచార • నియతి వెలయు
రాజమాంబ ముఖోపమ • రాజ బింబ
ఆశ్రిత కదంబ విమల గు • ణావలంబ
భూనుత భ్రమరాంబాంశ • పూర్ణ బింబ. ౧౫౨

సీ. వైద్య శాస్త్రాభిజ్ఞ • వైద్య వర్యులచేత
బహులౌషధంబులే • ప్రభుఁడొనర్చె

వ్యాధి పీడిత జనుల్ • వచ్చి వేడినయంత
నౌషధంబులనే మ • హాత్ముఁడొసఁగె
బహు తటాకంబు లే • ర్పడగ నిర్మించుచు
వృత్తి మాన్యంబులే • విభుఁడు జేసెఁ
తగవు కోరిన వారి • ధర్మ మార్గమ్మున
భావించి మించెనే • పార్థివుండుఁ

గీ. నట్టి చెవ్వోల ముఖ్యాన్వ • యాబ్ధి చంద్రుఁ
డైన ధర్మ నృపాలుఁడు • వైద్యశుండు
రాజకార్య ధురంధర • ప్రాభవుండు
ధరణి పాలించె ధన ధాన్య • గరిమ మెరయ. ౧౩

గీ. అతని పుత్త్రుఁడు చొక్క భూ • పాగ్రగణ్యుఁ
డద్భుతైశ్వర్య ధుర్యుఁడ • హంయు శత్రు
హరణుఁడాశ్రిత రక్షణుం • డనుదినాగ్ర
జనకృత విశ్రుతా శీర్వ • చనము నొందె. ౧౪

౪ శ్రీ చొక్కనాథుఁడనఁదగిఁ యా చొక్క నృపాలుఁడలరె • నంచితకరుణా
లోచనుఁడు రాజకార్యాలోచనుఁడు ప్రభాప్తిలోక • లోచనుఁడనఁగ. ౧౫

గీ. చెలఁగి రాజన్న భూపాలు • చెలియలైన
రాజమాంబను బెండ్లాడి • రాజకాంతి
వొలిచియున్నట్టి యొక్క న • త్పుత్త్రు గనియె
నతఁడు రాజన్న చౌదరి • యనదలిర్చు. ౧౬

సీ. కలశ పారావార • గర్భ వీచికలందు
జనియించు సంపూర్ణ • చంద్రుఁడనఁగ
శ్రీ మహాలక్ష్మి ప్ర • సిద్ధోదరంబున
సంభవించిన పంచ • శరుఁడనంగఁ
స్థిర తరైశ్వర్య శ • చీదేవికుదయించి
సంతసించిన శ్రీ జ • యంతుఁడనఁగ

దివ్య ప్రభాపార్వ • తీ తనూజాతుఁడై
　　　ధరణి వెల్గిన శ క్తి • ధరుఁడనంగ
కామనేని భవాని ప్ర • కాశ గర్భ
శు క్తిముక్తా ఫలాయి • తస్ఫూ ర్తి దనరి
రాజరాజ మహారాజ • రాజ బిరుద
నదము రాజన్న నృపతి • యభ్యుదయ మొందె, ౧౯౭

క• ఆ బాల్యంబున నుండియుఁ బ్రాబల్య సమేత వంశ • పారంపర్యా
శ్రీ బంధుర ధర నైజము • హా బాహా పీఠిఁ నుంచి• యలరుచునుండెన్. ౧౯౮

సీ. సత్య సత్వ వచోయ • శస్సంస్థితుల ధర్మ
　　　బల గోపతి విహార • కలన నెంచి
త్యాగ జవానీక • యౌవన గరిమచే
　　　బలి సింహ విజయోత్మ • భవుల మీరి
త్విడ్బుద్ధి సహనత్వ • తేజస్సుఖంబుల
　　　చంద్రిక గోత్రేశ • సరణి నొంచి
విద్యానవజ్ఞాన • హృద్యత్వ లక్ష్మిఁగా
　　　వ్యఘున జనక హేమ • వసతిఁ గాంచి
గీ• తనరె విస్ఫూర్తి కీర్తి సం • తాన తరుఫ
లాయితాబ్జ భవాండ భాం • డాంతర స్థ
ధుర్యమాధుర్య గుణతోషి • తార్యకామి
నేని రాజన్న దేశాయి • నిపుణుఁ డలరే. ౧౯౯

సీ. ప్రాఘ్లురి విద్వత్స • భా శోభనామరీ
　　　వీజితా శాటికా • విలసనంబు
దక్షిణ దిక్పండి • త పరిషద్దేవతా
　　　కర సమన్వితవీటి • కా భరంబు
పశ్చిమాశోద్యద్వి • పశ్చిత్సమితి దివ్య
　　　కాంతా ఘటిత పత్ర • ద్గ్రాహకంబు
నుత్తరక కుబుద్వ్య • దురుధీర సందోహ
　　　హైవీ ప్రదాపిత • దర్పణంబు

గీ. వెలఁగి చెలువొందె నఘ్లూరి•సీమధామ
రత్నమయపేట శ్రీరామ•రడ్డి పేట
జన వినుత కామినేని రా•జన్న నృపతి
సదన ఘుమఘుమి వాగ్భటి•శారదాంబ. ౨౦౦

సీ. నాటక భారతీ•పాటల గంధి కు
చాలోల హారమై•యలరె నౌర
ప్రకటితాలంక్రియా•భాషా విలాసినీ
సీమంత రత్నమై•చెలఁగె నౌర
సంతత కావ్య వా•క్సార సాక్షీ నాసి
కాంచిత ముత్యమై•యలరె నౌర
సకల స్మృతీతి హా•స సరస్వతీ కర
దర్పణ శ్రేష్ఠమై•దనరె నౌర

నిఖిల జన సన్నుతంబైన • నీదు యశము
మహిత హృద్యాన పద్య సా • మ్రాజ్య పూజ్య
యనుచు విద్వత్సమూహంబు • లభినుతింప
నిలను పాలించె రాజన్న • నృపవరుండు. ౨౦౧

సీ. ఘోర ధారారట్టి•ఘోట్టాణములనెక్కి
హెచ్చరించుచు•సిఫాయీలు రాఁగ
దారుణ తరవారి•ధళధళ ద్యోతంబు
సర్క ప్రభలతో నెం•దుర్కొనంగ
పవమాన మానసో•జ్జవ తురంగము నెక్కి
ఘోయని పగవారి•గిట్టి ముట్టి
శిరములు కరము•లు చరణంబు లురములు
ఖరిలు ఖరిల్ ఖరి•క్కురి కనంగఁ

సెరకు కోలలు తెగ ద్రేయు • తెరువు దోఁప
సరికి తజ్జయలక్ష్మి సం•నాథుఁడగుచు

వంగరాంగణ గాండీవి • సదృశ శౌరి
నేని రాజన్న నృపమౌళి • యిలఁ దలిర్చె. ౨౦

సీ. ఖడ్గంబు బూనెనా • కరినారిశిరములు
కందుక క్రీడ సెం • పొంద వలయు
సాఁగుఁ జేబట్టెనా • చటుల రాహుత్త
రాట్పటు శిలాబ త్తరుల్ • పగులఁ బొడుచు
నే జాఘరించెనా? • నేటుగా వీరుల
గుదులుగా గను గ్రుచ్చు • మొదలకుండ
కోదండ మందెనా? • వేదండముల నైన
నొక్కొక్క కోలచే • నుక్కడంచు

నౌర సాహస విక్రమా • ర్కావతారుఁ
డనుపమాకారుఁ డాశ్రితా • వన విహారుఁ
డను దినోదారుఁ డఖిల • విద్యా విచారుఁ
డగుచు రాజన్న నృప మౌళి • యలరుచుండె.

సీ. హాటకాచల హారి • ద్ఘోటకా సల సుహా
నాటకా గళ కాల • కూటములను
నలిన మార్గణ చైత్ర • నలరాజ హరిపుత్ర
ధనదాత్మజ విచిత్ర • ఘనతనులను
ఖర కరాత్మజ శీత • కర విరోచన జాత
హరస ఛామర పూత • సురతరులను
కాండజాస గణేశ • కుండలీశ వ్యాస
చండీశ చిత్ర శి • ఖండిజులను

గీ. శౌర్య సౌందర్య దానవా • క్చతురి మములఁ
బరిహరింపుచు నిత్య నం • పదఁ దలిర్ప
నిరుపమిత తేజుఁడై శౌరి • నేని కులజ
నరవ రాజన్న శేఖాయి • చంద్రుఁడలరె.

సీ. దంతావళస్థితోద్ధత వాద్యమానోగ్ర
భేరికా ధణధణ • త్కార రవము
యోగ్యోష్ట్రి ఘటితము • వాస్తాస్యమాన ధ
క్కారూఢ ధమధమ • త్కారములును
సంభృతాజానేయ • సంయుక్త టెంకణ
దారుణ ఠమఠమ • త్కారములును
పటు జవోత్కట మహో • ద్భట సంతతాహత
పటహ ధాంధాంక్రియా • పాటవములు

కలయ సంగర జాంగలాం • గణకరాళ
కర్తరీముఖ సుశిలీ ము • ఖ దళితలుళిత
దరి గళగళద సృక్ఝరీ • తరణి ఖేల
దసి ధరుఁడు రాజ నృపమౌళి • యలరుచుండు. ౧౦౪

సీ. హస్తముల్ రాజేశ్వ • రార్చనా విధియందు
వీనులు శివకథా • వితతియందుఁ
జూపు మహాదేవు • దీపితాంగమునందు
జిహ్వ పంచాక్షరీ • స్థిరత యందుఁ
చిత్తంబు శాంభవ • శ్రీ పదాబ్జములందు
స్వాంతంబు ద్వాదశా • క్షరమునందుఁ
బుద్ధి యుమానాథు • పూర్ణ రూపము నందు
మనసు మహేశ్వర • మతమునందు
గీ. నునిచి కాల త్రయాబాధ్య • యోగమొంది
సంతత భ్రమరాంబికా • సామరస్య
సరస రాజేశ్వర వరప్ర • సాదలబ్ధ
జనన రాజన్న దేశాయి • చంద్రుఁడలరె. ౧౦౫

సీ. పలికెనా? సత్యోక్తిఁ • బలుకుటెంతియె కాని
తద్వ్యతిరిక్తంపు • తలఁపు లేదు
చూచెనా? దయఁజేయు • చూపులింతియె గాని
తదభావమగు చూపు • లొదవకుండు

నిచ్చెనా? ఫూర్తిగా • నిచ్చుటింతియెకాని
తొడువగా నిచ్చుట • నొదవకుండు
పట్టెనా? విడకచే • బట్టుటింతియె కాని
విడుచుట కెన్నడు • గడఁగ లేదు

గీ॰ భళిరె! యిటువంటు నృపుఁడేడి • యీఁదలంప
శాశ్వత స్థితి రాజ్యంబు • విశ్వమునను
జేయవలెనని కవులెన్న • జలఁగె నౌర
నిపుణుడైనట్టి రాజన్న • నృపవరుండు· ౧౦

శా. సామాన్యజ్ఞఁ గవీశ్వరుల్ సభకురా • షడ్దర్శనీ సీమ గో
ష్ఠీ మాధుర్య రసోక్తులంగరపి హా • ర్షింపన్ ప్రవర్తించుచున్
పో మార్కానల విద్యు దుద్ధిత కళా • స్ఫూర్తి స్వరూపంబు తా
నె మాహేశ్వర పాదపంకజ సప • ర్యన్ జెందునందంబుగా. ౧౦

క. పటు శబ్దార్థాలంకృతి • రటద విరళ తరగళత్త్ • రంగాయిత వా
ఘ్టుటనోల్లస పటన ప్ర • స్ఫుటన ప్రతిభా విశేష•పూజ్యుండగుచున్· ౧

సీ. అఖిల భూజన జీవ • నాధారత వహించి
యనుపమ స్థితి ఘనా • ఘనులమించు
దృఢతరా పయవసం • దీప్త తత్వము నొంది
కాఠిన్యమున ఘనా • ఘనుల నొంచు
భాసమాన ప్రతా • ప స్ఫూర్తి జెన్నొంది
మానుమట్టకా ఘనా • ఘనుల నొంచు

గీ॰ ప్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • పరతఁ జెంది
ధరణి పాలింప వలెనని • ధన్యులెన్న
నమిత జయసాంద్రు కామినే • న్యన్వయేంద్రుఁ
డైన రాజన్న నృపమౌళి • యలరుచుండె.

సీ. ఏ తాపస స్వామి • యిరవుగా నామ్నాయ
సారస్యము వచించె • సజ్జనులకు
నేతపస్వి వర్యుండు • హిత వరివస్యాది
సద్గ్రంధ కథమహా • శయము దెల్పె

ప్రథమోల్లాసము

నేపారి కాంక్షిస • మేధమూన మడధ్వ
జనితాశయంబు సాం • పునవిధించె
నేపద్రవాద్ధ్యం • డెంమిత్ దశద్విధై
క్యానుసంధానంబు • నందఁజేసె

గీ. నట్టి శ్రీరామ భద్రేంద్ర • యతివరుండు
నాత్మగురుఁడయి కరుణారసార్ద్రదృష్టి
లలర గనుఁగొనఁ దొరహా • స్వంబు గరప
వెలసె రాజన్న దేశాయి • విశ్వమునను. ౧౧౧

సీ. అసమాన బలశౌర్య లసమాన సౌందర్య
రసమాన గాంభీర్య • రభసమలర
ఋంఖాను పుంఖాజి • రింఖావిశృంఖలో
త్కంఖాణ సంఘముల్ • గడలుకొనఁగఁ
జండశుండాదండ • భండనోద్దండవే
దండతండంబులు • దతిఁ దలిర్ప
డోలికా హాటకాం • దోళికా పర్యంక
పాలికా శకటసం • పద వెలుంగ

గీ. నిగ్రహానుగ్రహోదగ్ర • జాగ్రదుగ్ర
విగ్రహవ్యగ్ర విక్రమా • వేశులైన
భటులు గొలువంగ • భూభార భరము బూని
నిపుణ రాజన్న దేశాయి • నృపతు లెన్న. ౧౧౨

గీ. అతని యర్ధాంగనాలక్ష్మి • యలరెరంగ
మాంబ యనఁగను సుగుణావ • లంబనుగుచు
సత్యశీల దయావ్రతా • చారదాన
ధర్మసాధ్వీగుణములచే • ధన్యలెన్న. ౧౧౩

కం. రంగనులోచనజితసా। రంగను గరుణాంచితాంత • రంగను గతిసా
రంగను చికురాంచితసా।రంగను వినుతింపసావ • రమణీయనదగున్. ౧

సీ. ధవళప్రభాధళ • ధళలు నవ్వులనుంచి
హంసయానాభిఖ్య • నలరుచుండి
చాంచల్య గుణము నే • త్రాంచలంబున నుంచి
కమలాను గుణవృత్తి • నలరుచుండి
నీలకాంతిచ్ఛటల • నెమ్మేన నొనరించి
యనుపమార్యాసమా • ఖ్యను వహించి
దృగ్గోచరము కాని • దీప్తిమధ్యము నెన్ని
యతను మోహనవిద్య • గతిజెలంగి

గీ. పలుకు చెలి కల్మి సకి సామి • పొలఁతి రతిని
కలవిలాసవ దవయవం • బుల నెదిర్చ
ధన్యరాజన్య నృపమాళి • ధర్మపత్ని
యైన రంగమ్మ నెన్నఁగ • నలవియగునే? ౨౧౫

సీ. వేనలి ఘననీల • విభవంబున మెలంగ
ఫాలంబు విధుకళా • లీలదనర
దనరు బొమ్మలు శార్ఙ్గ • ధర్మమార్గమునొంద
కన్నులిందీవర • గతిజెలంగ
వీనులు శ్రీధర • విఖ్యాతిని వహింప
నధరంబు మధుగర్వ • హారతబూన
గళము శ్రీమత్కంబు • కరసంస్థితిని జెంద
నడుము హరిస్ఫూర్తి • నడరుచుండ

గీ. గతులు కరివరదఖ్యాతి • నతిశయిల్లఁ
దనరు దివ్యాంగముల విష్ణు • తనువహించు
రాజశేఖరు నర్ధాంగి • రాజ్ఞియైన
రంగమాంబను బొగడఁత • రంబునౌనె. ౨౧౬

సీ. వ్యపమాన వేషంబు • నినుమంతయైనను
పరభామ కొసఁగని • సరసిజాస్య
తనువంచన నొనర్పఁ • దలఁచినవారలఁ

బుత్రులఁ గాంచేయు • పువ్వుఁబోఁడి
బహుళతపోనిధియైన • పతిమహావిద్యాను
భవము నొందఁగఁజేయు • పద్మగంధి
భర్తృనిమిత్తమై•పద్మినీబాంధవు
నుదయింపఁ జేయుని • యుత్పలాక్షి

గీ. కలిత రాచుళ్లగోత్రజ • కామినేని
కులజ రాజన్న దేశాయి • తిలకహృదయ
స్వాభిమతధామకులపాలి • కాభిరామ
రంగమాంబకు సాటినే • యంగవచ్చు. ౨౧౭

సీ. ఏమహాదేవి శా • మేశ్వరాంకౌనల్ప
తత్త్వంబునందుమో • దంబుఁజెంద
నేమహా శ్రీరాజ్ఞి • యింపుఁ బోడమ దధ్వ
తత్త్వవిద్విజ్ఞాన • ధాత్రియయ్యె
నేజగజ్జనని మ • హేశ్వరార్పితసప
ర్యావిశేషంబుల • నలరుచుండె
నేమహాలక్ష్మ్యంబ • హేమశాసనముఖ దివ్య
జీవికావార్తయై • వెలఁగుచుండె

గీ. నట్టి జగదంబ లలితాంబ • యధరబింబ
సైకతనితంబ భ్రమరాంబ • శారదాంబ
తనదు పూజావిధానత • త్పరతఁ జెంద
రంగమాంబ దలిర్చె శి • రంగయగుచు. ౨౧౮

సీ. సమ్యక్కృ చీపాక • శాసనుఁడవిధంబు
సరసప్రభాప్రభా • కరులమాడ్కి
సంభ్రమ ద్రోహిణీ • చంద్రులకైవడి
చంద్రమతీహరి • శ్చంద్రులగతి
స్థిరభీమ జావీర • సేనజులనఁదగి
కనదనసూయాత్రి • మునులరీతి

పావనాంచదరుంధ • తీవసిష్ఠులభంగి
భాసుర రతిమనో • భవులరీతి

గీ. శామినేన్యవ్వవాయసం • టితరంగ
మాంబరాజన్న దేశాయి • యానుగుణ్య
దంపతీ భావ మింపొంద • తతసమృద్ధి
వెలయ విలసిల్లి రానంద • మలరుచుండ. ౧౧౯

గీ. నమ్య గనపాయి పరశివ • శక్తులనగ
సకల సంపూర్ణ చంద్రచం • ద్రికలనంగ
భానురాఖండ దీపదీ • ప్రప్రభలన
లలిత రాజన్న రంగమ్మ • వెలసిరిలను. ౧౨౦

గీ. అమ్మహీపతి తోబుట్టు • వగుచు దనరి
రాజమాంబ ముఖోపమ • రాజబింబ
ఆశ్రిత కదంబ ఘనసుగు • ణావలంబ
భానుతభ్రమరాంబాంశ • పూర్ణబింబ. ౧౨౧

సీ. అన్నార్థులైవచ్చు • నన్యజాతులకైన
నన్నదానము జేయు • ననుదినంబు
బాంధవులందుసం • బంధంబు పాటించి
సేలుగా వారిబో • షించుచుండు
దనదర్శనమ్మును జే • సినయాచకులమునందుఁ
బుత్రభావనమెంచి • బ్రోచుచుండు
దనుఁగొల్చుఁ సేవక • దాసీజనమ్ములఁ
బనులెన్ని రక్షించు • వినయమలర

గీ. దనదు గ్రామంబుల వసించు • జనులకెల్లఁ
దల్లియై వారి కుశలంబు • దలపుచుండు
నిఖిల సుగుణాఢ్యయాసుకామి • నేనిరంగ
మాంబను నుతింప శక్యమే • యవనిలోన. ౧౨౨

శా. రారాజద్గుణశాలి శీలవిలస • ద్రాజన్న దేశాయిభా
ర్యారత్నంబగు రంగమాంబ గనియెన్ • రంజిల్లముల్ సద్గుణా
ధారుల్ ధీరులు దారులై తనరు పు • త్రశ్రేష్ఠులన్ సంతత
శ్రీరమ్యాకృతి వైభవంబుగల పు • త్రిన్ స్వర్ణవృత్తింబలెన్. ౧౧౩

క. ధీరోదాత్తుఁడు దారుఁడు। కారుణ్యాగణ్యపుణ్య • గణనీయశుభా
కారుఁడు పెదరాజన్నయు। హీరమణుఁడు నిత్యవృద్ధి • నెనయుచునుండెన్ ౧౧౪.

మ. తనగాంభీర్యము సుందరత్వమును దిగం • తఖ్యాత దాతృత్వమున్
వనధిన్ మన్మథు వారిజాప్త తనయున్ • వందారులం జేయ న
జ్జనతై కేప్సితదాయియై వెలసెనా • సౌజన్యజన్యప్రథన్
జినరాజన్న నృపాలమౌళి మదన • శ్రీరంజితాకారుఁడై ౧౧౫

సీ. పటుతర బ్రహ్మాండ • భాండోదరంబులు
బొమ్మరిండ్లయ్యెనే • పుణ్యవతికి
హరిహర బ్రహ్మాది • సురతతుల్ పాంచాలి
కాసంచయంబులే • కాంతకయ్యె
మేరుమందర ముఖ్య • భూమిపర్వతములు
చ్చనగిల్ల లేఘునా • ఘనచికురకు
మహిసహస్రస్తంభ • మంటపంబు య్యెల
శాలయై దనరెనే • చంద్రముఖికి

గీ. రమ్య నవవత్సరవయఁబి • రాజవాన
యైన యాబాల యీబాల • యురుచుఁబోగడ
జిన్న రాజమ్మ విలసిల్లెఁ • గన్నతల్లి
దండ్రులకు నేత్రములు చల్ల • దనముగాఁగ, ౧౧౬

క. సోమాంశంబున దనరుచు। సోమాభంబైన ముఖము • శోభిలుచుండన్
సోమావయవం బలరఁగ । సోమము సామాంతరమున • సుదతి చెలంగెన్. ౧౧౭

క. గోపాలరాయుడవనిన్ । గోపాలుడనంగదనరి • గోధనధాన్య
శ్రీపతియై వర్ధిల్లెను। భూపాలక సుతులలోన• పూజ్యుండగుచున్. ౨౨

గీ. దేవదేవుడు శ్రీరామ • దేవుడవని
శ్రోవవర్తించు గతి రాజ • పూజ్యుడగుచు
వాసుదేవుడు వర్ధిల్లు • వందనీయ
రాజ రాజేశ్వర కృపాభి • రాముడగుచు. ౨౨

వ. ఇవ్విధంబున వంశపరంపరాభివృద్ధిగా రాజశ్రీ రాజన్న దేశాయి వంశావతా
రంబు వర్ణించి. ౨౩

చ. నిరుపమితప్రయుక్తిజన • సీజనకాద్భుతసూక్తి, దేవ
సురగురు పాదభక్తిపరి • శుద్ధమనోవచ నానురక్తి శ్రీ
నిరతిశయప్రసక్తి, సువ, సీపకర్తృగుణశక్తి• యాదయా
పరుడగు కామినేని పెద• పాపనికే దగు ధీరులెన్నగన్. ౨౩

సీ. శ్రీసమృద్ధివహించి • చెలగెభరద్వాజ
గోత్రంబు తద్గోత్ర • పాత్రమగుచు
గమనీయ బాగునేల • కంట్యాన్వయాంబునరం
జిల్లె దద్వంశ ప్ర • సిద్ధిజెంది
ఋగ్యజుస్సామామ్నాయ • యోగ్యసిద్ధాంతధా
ర్ధారణధుర్యుడై • దార్యశీలు
డగుచు కర్తుమకర్తు • మన్యథాకర్తుము
ద్యచ్ఛక్తి పెద్దరా • జన్నయనెడు

గీ• భూసురాధ్యుడు నన్న • పూర్ణాసమేతు
డగుచు శ్రీకామినేనిరా • జన్న నృపతి
కీహితప్రద రాజపు • రోహితుండు
ధరణి వర్ధిల్లె దద్భాగ్య • సరణిజెంది. ౨౩

సీ. శ్రీమహాలక్ష్మీ • ప్రసిద్ధిగోదావరీ
• వలశంబు భావి సద్భా•వంబునొందె

ంలో శరభన్న • యనెడు మంత్రీంద్రుడు
దవరెనా ధన్యుని • ధర్మపత్ని
వెంకమాంబకు • నాత్రిమూర్త్యంశంబు
లను సంభవించిరి • వినయమతులు
న్న లింగన్న • రమణీయ గాత్రుండౌ
చంద్రన్న వారలు • సాంద్రయశులు
ధార్మికముతోడదదష్టప్ర • ధానహృదయ
బహుళ మంత్రాంగ కృజ్ఞయో • పాయగేయ
శేఖనీ గ్రాహ్యచాతురీ • లీలదనరి
ధరణి వర్ధిల్లె రాచంద్ర • తారకముగా.   ౧౩౩

ర మహాసురతుణసక్న • త్కాదంబ కాదంబ కాం
సతీపురోనటనసం • ధానాప ధానావట
న విలాససాత్వికమున • స్వంచార సంచారణా
స్థితి నీతకష్టతమరో • గాధార గాధారతా.   ౧౩౪

కోలాహల హేలావళి హాళికహారణ • హితవిద్యకృపా
ల జటాలని టాలతటాలసితనాన • టచ్ఛిఖి యనా.   ౧౩౫

ఉత్సాహము.

రుణ ప్రతాపదీప • దండభృన్ని కారణా
రధీ నివాసదాస • దివ్యముక్తి కారణా
కారకా సురాధిపత్య • ధైర్య శౌర్య వారణా
హరిమండ లాగ్రవర్య • హన్యమాన వారణా.   ౧౩౬

ధ్వజ కాండకాండకకటా • హప్రాంచదుద్యద్యశో
క్రమ దక్షదక్షసవన • ధ్వంసక్రియా మాంక్రియా
భవచిత్త చిత్తజమహా • గర్వాభ్ర జంఝానిలో
స్య విహారహార శరద • భ్రస్ఫురద్విగ్రహా.   ౧౩౭

శి ధరశరాసన • నరసాధిత పావన త్రిభువనజనక్రద్భా
త శరధిరత • శరధీకృత శరధివిష్ణు • శరభూమిరథీ.   ౧౩౮

పృథ్వీవృత్తము. నియుద్ధసమయోద్భ్రమ • నిజభుజార్గళాస్త్రత్రుటి
ద్విషత్ప్రభువధావత • ద్విషతతుండ చండోత్తమా
భయభ్రమదహస్కరా • భయంకరభ్రచక్రభవ
త్స్వయోదయ శరాసనంతత సమాజ్ఞితైకోత్సవా. ౨౩

మ. ఇది శ్రీరామన్నపాలుపేట నగరో • ర్వీశాఢ్య రాచుల్లగో
త్రదిగంత శ్రుతకామినేని కులజ • ప్రఖ్యాత లక్ష్మీప్రసమ
గ్రదయాసంయుత రాజశేఖరహిత • ప్రఖ్యాత భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమున నా • ద్యోల్లాసమింపై తగున్. ౨౪

గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ
ప్రసాద ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్య పూజ్య రా
చుల్లగోత్ర పాత్ర కామినేని వంశపయః పారావా
ర రాకాసుధాకర రాజన్న దేశాయి సార్వ
భౌమ జ్ఞాపితాంధ్ర గీర్వాణకవిత్వ
చాతుర్యధురీణ పరాశరగోత్ర
రాపాక లింగనార్యపుత్ర
లక్ష్మీపతిప్రణీతంబైన
భద్రాయురభ్యుదయం
బను మహాప్రబంధం
బునందు ప్రథ
మోల్లాసము
శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు

# భ ద్రా ద్రి యు ర భ్యు ద య ము

## ద్వి తీ యో ల్లా స ము



శ్రీ మణిసౌధాసీన
శ్రీమత్సింహాసనేశ్వ ♦ రీకారుణ్యో
ద్ధామధనధాన్యసంప
ద్రామనృప పురాధిరాజ ♦ రాజమహేశా. ౧

### ష ష్ఠ్యం త ము లు

క. ఈదృగిదమియత్తావాచ్ఛేదకర హితగుణమణివి ♦ శేషాంబుధికిన్
వేదాది వర్ణతత్త్వ ప్రాదుర్భావోపలబ్ధి ♦ వరధీరునకున్. ౨

క. ప్రపదప్రపత్త్రిపదా న్యపదిక్ప్రవిపద్ధ్రదతివి ♦ హారునకు సరీ
సృపహారికి భవదారికి గ్లపితారికి నిత్యసత్య ♦ కల్యాకృతికిన్. ౩

క. మిత్రత్ర్యక్షస్త్రీగపురు పద్మనికట నివసదాది ♦ పత్యునకు మహా
క్రాంధ్రాంధక పూర్వద్యుష ద్విభినాస్తగితశూల ♦ హస్తాబ్జునకున్. ౪

క. ఏకానేకాకారా! టీకునకు గటీతటీప • టీసంరాజ
శ్రీకరకృత్తికి సహసా! ద్యాకలిత మనఃప్రబోధ • కాకృతిధృతికిన్. ౫

క. శరణాగత చరణామృత! చరణానత కరుణభక్త • సంవరణా త్రై
పురనాయక దరదాయక! మురహాయక మిత్రునకును • భుస్తోత్రునకున్. ౬

క. శబల శరశరాసకటీ! ప్రబలావృత బర్హిబర్హ • భాసురకుహనా
శబరీవరక బరీభర నిబిరీసరచిత సుమోప • నీతాత్మునకున్. ౭

క. సత్యచిదానందునకున్! నిత్యునకును శ్రుతిశిరఃఫ • ణితినిర్ణీత
ప్రత్యయరూపునకు జగ! త్ప్రత్యాహారోపపన్న • పరభాగునకున్. ౮

క. శ్రీరమ్యపరాశక్తిప! రీరంభవిజృంభితావ • కిచ్ఛిన్నసుఖా
ధారోదార మనోధా! రారామా రెడ్డిపేట • రాజేశునకున్. ౯

వ. నిరంతరాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన భద్రాయురభ్యుద
యంబను మహాప్రబంధంబునకు గథావిధానం బెట్టిదనిన. ౧౦

సీ. ప్రతిదినాధ్వరహవి • ర్భాగాగతామరా
నూన పరస్పరా • హ్వానములును
ప్రచురసమిద్దర్భ • ఫలపత్ర హరణార్థ
మునికుమారాన్యోన్య • నినదములును
సతతావభృథశుచి • స్నానోత్సవాయాత
తాపస జనతాను • లాపములును
సమ్యగ్జ్ఞవిభవత్సవ • మానిసంసదు
క్త్యాశీర్వచనపూర్వ • కారవములు

గీ. సత్రకృతకృత్య యజమాన • జంపతీవి
రాజినీరాజనవిధాన • రతసువాసి
నీమిధోవిభ్రమానుగ • నిస్వనములు
నలర శ్రీనైమిశారణ్య • మవని వెలసె.

సీ. బద్ధపద్మాసన • ప్రస్ఫురత్ఖేచరీ
   లక్ష్యపశ్యన్మనస్క • లంకృతంబు
సిద్ధాసన స్థిరప్ర • సిద్ధిమద్గోచరీ
   వీక్షణోత్సుకమౌని • విలసితంబు
సింహాసనవిధాన • సేవ్యమాననిరంజ
   నావిలోకనభిక్షు • జీవితంబు
ముక్తాసనప్రదా • వ్యక్తిమధ్యాచరీ
   సంయుక్త సంయమి • సంచయంబు

గీ. నగుచు వీరాసనస్వస్తి • కాసనాఢ్య
రమ్యహఠయోగ, లయయోగ • రాజయోగ
మోహితలక్ష్మీకరగ్రాహ • ముదితులైన
యోగులు వసించుచుండు • రింపొంద నచట. ౧౨

వ. మఱియు నిరంతరాంకురిత పల్లవిత సుమితఫలిత లలితసవిధ వివిధమహామహీరుహ వ్యూహశాఖోపశాఖా శిఖర ముఖర కలర కలకంఠ నీలకంఠ కీరశారికాది పత్రిపత్రభవనవనచలిత గళితసుమసముదయ సంతతవికస్వర వాసంతికాసేవంతికా మల్లికా మాలత్యాది లతావితానస్యంద మానామంద మరంద బిందుసందోహాస్వాదనానంద మిళింద ఝంకారంబును, సదేశస్థితస్థల నలినీఫుల్లహల్లక కమల కుముద శాలినీలోత్పల దళగళత్పరాగ పరిమళ పరిమిళిత విశదశశభృదుపలశకలకీలితసోపానసంఘ సంఘట్టనోచ్చైర్ఘుళంఘుళ స్వనద భంగతరంగసంగతరథాంగాది పతంగారావ ఘుమఘుమిత సరోవరంబును శాలాతపసేవనోత్సుక జలమానుషీ పరిమృదితమృదులసికతామయసంగత పానీయపానార్థసమాగతనిమజ్జనోన్మజ్జన సజీవభవన్మదభర వనగజనాదధారాస్తబకితోదదనంబును నవనవభవత్సవనభవనభూమహోమధూమశ్యామీభూతదిశాకాశావకాశంబును ప్రవర్ధమానాధ్వరసముత్సవ సమాగత శతముఖముఖ నిఖిలసురవర పరిషదభిరామంబును కుసుమవిసరసమిత్కుశ విలసత్కంద మూలఫలాహరణార్థముహుర్ముహుర్భ్రమమాణ మౌనిసంత్రాసకలకల నినాదమేదురంబును విశ్రుతశ్రుతిస్మృతీతిహాసపురాణకథాకథన చతురయతివరవిరాజితంబును కౌండిన్య కణ్వమార్కండేయ కపిల శాండిల్య వత్సమాంజాయన వ్యాసపుండరీకాగస్త్యపులహమతంగ మాండవ్యశౌనక మైత్రేయ చిత్తే

జజహ్ను గాలవ గౌశిక గౌతమ మందపాల జాబాలిమౌద్గల్య వరతంతుకస్య
ప వామదేవ శమీకముఖమహామునిసేవితంబై వెలయుచుండె. ౧౩

కం. ఆనైమిశమున వరివసి। తానూనజ్ఞానశౌన । కాదిమునీంద్రుల్
నానావిధావధానవ। చోనిఖిలకథాశతాంగ । సూతుఁ సూతున్. ౧౪

ఉ. చూచి మునీంద్రచంద్రు లతి । శుద్ధభవన్ముఖోక్తి భాక్సుధా
సేచనవృద్ధి మద్విమల । చిత్తులు సాంబశివాంఘ్రిపద్మదా
స్యోచిత వృత్తులై వెలయు । చుండుదు గాన యగణ్యపుణ్యసం
సూచకమైన తచ్చరిత । సొంపలరన్ వచియింపవే దయన్. ౧౫

వ. అని ప్రార్థించిన నమ్మహాత్ముండు నానందావిర్భవంబున బులకితావయవుం
డు స్మయమానముఖుండునై శివభక్తినిష్ఠాగరిష్ఠుల వర్తనంబులఁ జెప్పఁదలఁ
చి మునులారా, సర్వజ్ఞనిత్యతృప్త సనసముభయగానాది బోధస్వతంత్రనిత్యా
లుప్తాత్మశక్తి నిరుపమచరితానంత కల్యాణగుణ పరిపూర్ణుండైన యమ్మహా
దేవు చరణారవింద ధ్యానంబుజేసి బ్రహ్మేంద్రాదులు కృతార్థులైరి. మఱి
యు నప్పరశివాభిధాన పరబ్రహ్మంబు సచ్చిదానంద స్వరూపుండు, నిరంజ
నుండు, నిర్వికల్పుండు, నద్వితీయుండు, "అద్వితీయో నాస్తి కశ్చి"త్తని పలికిన
శ్రుతిన్యాయంబున స్వవిలాస క్రీడావిశేషంబున "స్వేచ్ఛామాత్రం ప్రభోస్సృ
ష్టి" యను శ్రుతిప్రమాణంబునఁ బ్రకృతి పురుషులఁ గల్పించి తత్ప్రకారుం
డై అవ్యక్తమహదహంకార పృథివ్యప్తేజోవాయ్వాకాశాది పంచమహా
తంబులఁ గల్పించి, తత్తత్స్వరూపుండై తద్భూతకార్యంబులైన దేహేంద్రి
యమనఃప్రాణాదికంబులనుత్పాదించి తత్తద్విశేషంబుల స్థూలసూక్ష్మాది శరీ
రంబులం జేసి తద్రూపంబులు నహించి తత్తదుపాధులైన పిండాండ బ్రహ్మాం
డంబులందు స్వాంశభూతంబులైన జీవేశ్వర రూపంబులఁ బ్రవేశించి యందు
నీశ్వరోపాధివహించి సర్వజ్ఞత్వ సర్వకారణత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్ట
త్వ సర్వపాలయితృత్వ సర్వసంహర్తృత్వాది లక్షణంబులు గలిగియుండు మఱి
యు భూతకార్యంబైన పిండాండంబునందు స్వాంశభూతంబైన జీవరూపంబు
న బ్రవేశించి బద్ధముక్తాది రూపంబుల నటించుచుండు.

ఇవ్విధంబున బిండ బ్రహ్మాండ రూపుండై జీవేశ్వర రూపంబులఁ దనుపా
ధులఁ బ్రవేశించి స్రష్టృసృజ్యపాల్యపాలక సంహర్తృసంహార్య సర్వజ్ఞ కించిజ్జ

కార్య కారణ భోక్తృభోగ్య నియంతృనియామ్యవ్యాప్యవ్యాపకజ్ఞాతృజ్ఞేయస్వా
మి భృత్యధార్య ధారక రక్ష్యరక్షకత్వాది విశేషంబులఁ జేతనాచేతన బద్ధ
ముక్తాదికృత నానావిధ నటనములు లీలావిభూతిం జేయుచు నుత్పత్తిస్థితిల ను
జ్ఞానాజ్ఞాన బంధమోక్షంబు లెఱుంగకుండు మఱియు "యథోర్ణ నాభిస్సృజతే
గృహ్ణాతిచ" అని యూ యూర్ణనాభి శరీర ప్రధానోపాదాన కారణంబునఁ దన
యందుఁ దంతువర్గంబు సృజియించి, బుద్ధిప్రధాన కారణంబున నాతంతువ
ర్గంబుగూర్చి తత్తంతుగ్రసనంబు జేసినగతి, నప్పరశివుండుపాదాననిమిత్త కా
రణద్వయ భూతుండై జగదుత్పత్త్యాదికంబు లీలావిభూతి చేసి చేయునివానిచం
దంబున నుండు, మృత్తిక పిండరూపంబై యనంతరంబున జలాహరణాది క్రి
యలకు ఘటరూపంబున యోగ్యంబై తద్వికారంబులు కార్యరూప ఘటభా
వంబున వికారాద్యవస్థా రహితంబై మృత్తిక యొక్కటైన ప్రకారంబున "పృ
థివ్యాపస్తథా తేజోవాయురాకాశ ఏవచ। సర్వేంద్రియాంతఃకరణం పురుషా
ఖ్యం హియజ్జగత్। సఏవసర్వభూతాత్మా విశ్వరూపోయతోవ్యయః" అన్న
న్యాయంబున నానావిధోపాధుల సర్వేశ్వరుండు నలరుచుండు, సూర్యుండు
జలదర్పణాదుల స్వప్రకాశ భూతప్రతిబింబమై జలాద్యుపాధివిషయమైన చల
నాది వికారంబులఁ బ్రతిబింబ మార్గంబునఁ దత్తద్వికృతులఁ జెందని తెఱంగు
న శ్రీమత్పరమశివుండు నానావిధ ప్రపంచంబు తత్తద్రూపంబులు దాల్చి భో
క్తృభోగ్యాది విశేషంబులఁ బ్రకాశింపుచుండి స్వావినాభావ సామర్థ్యంబున
వసించునని బోధించి శివభక్తుల మాహాత్మ్యంబు జెప్పెద నాకర్ణింపుడని
యిట్లనియె. ౧౬

## మందరుండను బ్రాహ్మణుని చరిత్రము.

గీ. సకల ధనధాన్య రత్నన • స్త్రీప్రశస్త
విప్రముఖవర్ణ వేగవ • ద్వీతిసమద
సామజస్యందన పదాతి • సహితమగుచు
నవనివెలయు నవంతిరా • జ్యంబుకడిమి. ౧౭

క. ఆదివ్యనగరముననొక। భూదేవుఁడు బహుపదార్థ • పూరితగేహా
మోదంబున దగిసకలజ। నాదరణీయుఁడయి మంద • రాఖ్యుఁ దనరెఁ. ౧౮

క. ఘంకారయుక్తుఁడై పఁ । క్యంకారకు నీడబహుళ • మాగతవిత్తా
లంకార వైభవంబున । శంకారహితుఁడయి తిరుగు • సత్యేతరుఁడై. ౯

క. ఆరమ్య పురమునందొక । వారాంగన సారవార • వనితాజనతా
సారస్యము లలిపింగళ । నారూఢాఖ్యనువహించి • నైపుణి దనరెన్. ౧౦

వ. అది యొక్కనాఁడు సకలాభరణ భూషితయగు చు రాజమార్గంబున నరుదెంచు నెడ. ౧౧

క. చూచి తలయూచి మందరుఁ । డాచతురతయావిలాస • మాత్మనిడుచుమున్
నీచాతినీచుఁడై త । ద్వాచ్యవిక్రంసానుమతిని • వర్తిలఁ దలఁచెన్. ౧౨

క. ఆ కాంతామణి పూర్వను । నైకాంతిక మతియునయ్యె • నావిప్రునియం
దాకలిత చిత్తయయ్యెఁబు । రాకృత విధివశతఁదాట • రాదెవ్వరికిన్. ౧౩

వ. ఇవ్విధంబున నాపింగళయను వారాంగన మందరుండును ధరామరుని రతి కేళీ మందిరంబున నునిచి తత్సంపదాకర్షణశీలయై యిభబంధ, ధేనుబంధవ్యాన త కరణాదిబంధ విశేషంబుల వలనను అంగుష్ఠపదగుల్ఫజానుజంఘనాభివక్షస్స్తన కంఠకపోల దంతాధర కర్ణనాసికామస్తక స్థలంబులు కళాస్పదంబులని యెఱింగించి యుత్పలపత్ర మయూరపతగాదినఖక్షత విశేషంబులను రతికళలను ప్రౌఢమార్గంబు నొందించి నక్తందివంబులు విషయాసక్తుంజేసి సంగీత నాట్య విద్యా నైపుణ్యంబుల సంతుష్టాంత రంగునిజేసి స్వాధీనుంగా నొన రించిన. ౧౪

గీ. ఇటుల నాతండు దానింట । నిష్టగోష్ఠి
వెలయుచుండఁ దపోధర్మ • విశ్రుతుండు
ఋషభుఁడను శివయోగీంద్రుఁ • డేగుదెంచె
విప్రుపుణ్యంబు మూర్తిగ • వించినటుల. ౧౫

శా. ఈరీతిన్ ఋషభాఖ్య నొందు శివయో • గీంద్రుండు రాఁజూచియా
వారస్త్రీమణి బ్రాహ్మణుండు గురుభా • వంబేర్పడన్ జిత్తప
ర్యారూఢింపగు కంబళాంబర వృతం • బైనట్టి పీఠంబుపై
గారంబేయుచు భక్తిపూర్వకమొఁదం • జిత్తంబు రంజిల్లగాన్. ౧౬

క. అమ్మహనీయుని పాదా। బ్జమ్ముల శీతమ్ములైన • జలములచే నా
దమ్మున గడుగుచు నైజశి। రమ్ముల పై జల్లుకొనితి • రమ్మగు మతిచే. ౨౭

గీ. కుశలము వచించి యా యోగి • కుంజరునకు
గంధ పుష్పాక్షతాదిస • త్కారవిధుల
బూజలొనరించి హృద్యమౌ • భోజనంబు
పొసఁగ నొసఁగినఁ జేవార్చి, పొలిచియున్న. ౨౮

సీ. చీనిచీనాంబరా • చీర్ణమౌ పాన్పుపై
నింపుగా మునుబవ్వ • ళింపజేసి
యమగులొత్తుచు సప • ర్యావిశేషంబుల
నలరింపుచుండగ • నమ్మహాత్ముఁ
డత్యంత ముదితుఁడై • యా రాత్రి నివసించి
స్వస్థానమున కిచ్చ • జనినపిదప
సమయమవ్విధమున • జరిగిన నవ్వైశ్య
కర్మార్జితంబైన • గతివహించి

గీ. దేహమొడలిన నంతభూ • దేవుఁడటుల
నంతమొంది దశార్ణదే • శాధినాథు
వజ్రబాహుని భార్యయై • వసుధ బరగు
సుమతి యనుదాని గర్భంబు • జొచ్చి పొలిచె. ౨౯

—: సుందరుఁడు దశార్ణదేశాధీశు భార్యయం దుద్భవించుట :—

గీ. ఆసుమతి గర్భమున పూర్వ • మున్మదుక్తుఁ
డందరుండను విప్రుండ • యుందవిషయ
పర్వనుండయి కవ్వారోగ • వశతనొంది
నిధన మొందుచు జాలయు • నిలచెనపుడు. ౩౦

చ. ఎనసిన గర్భభారమున • నేచిన యాచిగురాకుఁబోడి మే
నననుగొని తత్సపత్నులు మ • నంబుల గోపము దోప తన్మహం
సన మొనరింపఁ జాలినవి • షంబు మెసంగఁగఁ జేయ నామెయు
వ్వనట నెఱుంగకట్టి రుచిర • వస్తువటంచును గ్రోలనయ్యెడన్. ౩౧

క. ఆపాద మస్తకంబుల। నాపాలతికి దానికడుపు • నందుండినయా
పాపనికి నిండబర్వెన। యాపదజనియించె మేను • లలమటనొందన్. ౩౩

ఉ. ఆసతి దైవయోగమున • నవ్విషమానియు జావకన్ మహా
యాసము నొందికుంది మర • ణాగతికంటె దురంతదుస్సహం
బైసుడి బెట్టుక్లేశభర • మందుచుఁ బుత్రునిగాచి యార్తిచే
గాసిలెఁ బూర్వజన్మకృత • కర్మము దెట్టిదియో తలంపఁగన్. ౩౪

చ. స్ఫురదురు మాతృగర్భమున • బుట్టిన తత్తనయుండు భూనభో
ంతరమదరంగ నేడ్చెనను, తజ్జనయిత్రియు తద్వ్యథంబున
న్నొమ్మరయిడ వజ్రశాపాంచుద స • ముద్ధతినంతయు నాలకించి వా
రిటువురి రోదనంబులకుఁ • నెంతయు విస్మితుఁ డైరయంబునన్. ౩౫

చ. జగదత్యద్భుత సత్యమార్గవిదిత • స్వర్వైద్యులైనట్టియ
య్యగదంకారుల నెల్లరాబనిచి జా• యాపుత్రు లున్నట్టినె
జ్జగృహాభ్యంతర సీమఁజేర్చి తగుబై • షజ్యంబు లిప్పించినా
రిగరిష్ఠామయ మేమి పోకనికినా • క్రింజెంది మోహంబునన్. ౩౬

చ. ప్రతిదినమీగతిన్ జపత • పంబుల శాంతుల మంత్రతంత్రసం
గతుల విభాకరార్చనల • గైకొనుచోఁ దదుపాధి వేదనా
ప్రతిహతి కృత్రయోగముల • పారములై తనరంగఁ జేసిత
త్ప్రతికృతిఁ గానఁడయ్యె తొలి • బాముననేసిన చెవ్వులెట్టివో. ౩

స. మఱియును. ౩

సీ. ఆరాజ మౌళిదై • వారాధనాదిప్ర
సిద్ధసిద్ధక్రియా • సిద్ధులెన్ని
మంత్రించ గరళప • న్నగర్ధదుర్గమములౌ
రోగంబు లడగక • రూఢినొంద
రాత్రినిద్రయు లేక • రాజపత్నిదలంకి
పుత్రు బాధకు చాల • నొగిలిపొగిలి

# ద్వితీయోల్లాసము

కృశియించి దుర్దశా • వశతచే నొకకొన్ని
నెలలునుగడువనా • నృపవరుండు

గీ. వీరి రోగము మాన్పనె • వ్వారి తరము
సతిసుతులు జీవమొందియుఁ • జచ్చువార
లంచు మదిలోవిచారించి • యంతకంత
వంతనొందినవారికై • చింతనొందె. ౩౯

క. ఈగృహిణీతనయులు నర। కాగతులే కానిచో మ • హారోగములన్
జోగుచు నేడ్చుచునిద్రా। త్యాగము నొందింతుగాని • తాంతవ్యథచే. ౪౦

వ. అదియునుంగాక,

క. మృతిఁబొందక జీవించుట। కతిశక్తులు గారువీరు • హతభోగులుగా
సతలంచెద నొక్కటి మది। నితరము దలపోయవలవ • దిట్టిపనికినై. ౪౧

ఆ. అనుచు దత్సుపత్ని • యందు తదాత్మజు
నందుఁ సక్తుఁడగుచు • గుందునృపుడు
దారపుత్రులనుర • థంబుపై నిడుకొని
యడవిఁజేర్చు సూత • యనుచు బలుక. ౪౨

క. ఆసారథి వేసారక। యాసారసముఖిని సుతుఁ • హాదుర్గపథా
వాసుల నత్రాసులదు॥ ర్వ్యాసులఁగావించి మరల • వచ్చెన్పురికిన్. ౪౩

సీ. ప్రస్ఫురత్ఖస్థల • ప్రస్ఫుటశ్రీద్రుక్రమ
ధ్వస్త జీర్ణచ్ఛద • స్థానమగుచు
నిర్ఘరవ్యధ్వని • రన్ధ్రగత్యధ్వనీ
నాధ్వజాతాయన • హారిణమగుచు
గ్రావకగ్రస్తదు • గ్రపస్తకోద్ఘట్టనో
త్సైప్వననిర్ఝర • స్థగితమగుచుఁ
గుటకోటరరటత్క • రట్పముఖాండజపత్ర
పటపటత్కార సం • భరితమగుచు

గీ. నడరు బహుయోజనాద్వార • హార్వతిప్ర
భానభిజ్ఞమహా మృగ • స్థానమగుచు
భూతభేతాళరావ ప్ర • భూతదురవ
గావ గహనంబు నారాజ • కాంతజొచ్చె. ౪౪

వ. అదియునేలా, లవంగ, తక్కోల, గంధసార, ఘనసార, కాక,తుండ, కాంచనా, లికుచ, కంటకీ, ఫల: బిజ్జుల, పాటల, ఫలినీ, జటిల, గాుకా, కురంటా, క,కోవిదార, బంధుజీవిక, దాడిమా, శ్వకర్ణ,హస్తికర్ణ, చాంపేయ, తాలపరిలాంగళి; సదాఫల, తమాల, నారికేళ, హింతాల; ఖర్జూర, కర్బుర, క్షీరికా, శ్లేష్మాత్మకీ, విభీతకీ, హరీతకీ, భల్లాతకీ,వాక్పుష్పికా, ఖదిర, శాకోట, కాలాగరు, కాలస్కంధ, చించా, దుంబ, రచలదళ, శమీరుచక, కుటజాది వృక్షభేదంబులు గలిగి సంతతాభంగ రంగత్తరంగిణీ రోధప్రరూఢపు వేతసీకుహార విహర దపరిమిత గండభేరుండ సింహశరభ శార్దూల భల్లూక వానరసృగాల వృకాదిమృగ వ్యాపారంబును బహువిహగ నాదమేదురంబవగునచ్చట. ౪౫

మ. బహుధాధావదనేక భీకరమృగ • బ్రహ్మణ్య వర్ధిష్ణునా
వహుతాశావృత తార్ణభూ చిటచిట • స్వానంబుచే నుల్కుచున్
జహిహిత్వాత్స్వత మస్మదభ్యవహృతి • స్థానంజవాదంచుబై
నహహేత్యుక్తుల దానవుల్ గదియదుః • ఖార్థిన్ వడిన్ బోవుచున్. ౪౬

చ. అతివనితాంతచింత నుతుం•ధాతతత్తృష్ణలచేత భీతయై
సుతునివహించి యించుకయు • సోలుచుప్రాలుచు కాలకున్ ధరా
పతనము నొందఁజేయుచు న • పారపుఖేదము నూనుచు న్బ్రరా
కృతమగు కర్మమెన్ని తమ • కింపుచు నూర్పులు నందడింపగన్. ౪౭

మ. పదరుక్కృత్కఠినోగ్ర కంటకశిలా • ప్రాయంపు ట్రోవన్ మహా
పదఁ జెందున్ బ్రపదప్రముక్త కనమై • ప్రత్యగ్రజాగ్రద్వ్యలో
న్మదవద్బంధుర గంధసింధుర మిళ • న్మార్గంబు గన్గొంచున
న్మద మొందున్ దరి మేరలేని పదవి • న్మల్లాడుచున్ బోవుచున్. ౪౮

వ. మఱియు.

శా. భూతప్రేత పిశాచ ఢాకినులచే • భూరివ్యథల్ జెందుచున్
యాతాయాత విలేశయంబులకు భీ • వ్యాప్తి బెంపొంది భూ
జాతస్ఫీత నికుంజ పుంజను లలో • సంచారముల్ జేయుచున్
భూతాధూత కృశాంగి యావనములో • దూరంబుగా నేగగన్. ౪౯

క. ఘోరథవాజినగస్తం • బేరమయుత వైశ్యపదము • ప్రేమంగనిజా
వారంభ యత్నమునన౯ • భోరుహలోచనయు బోవ • బోవన్ మొలన్. ౫౦

సీ. ధనకనకవస్తువాహనో • దంచితంబు
నమిత మణిగణ విపణినూ • ర్ధాన్వితంబు
విప్ర నృపవైశ్య శూద్రవ • పీఠమైన
నొక్క వైశ్యపురింబును • నవివదాఁడు.

క. ఆపురమునఁ గాపురమై • చూపట్టెను పద్మకరుడు • సుహితనానా
భూపశ్రీపతికరుణన్ • రైపతియై వైశ్యకులజ • రత్నంబగుచున్. ౫౧

వజ్రనాభ రాజభార్యయైన సుమతిపద్మకరుఁడను వైశ్యునియింటికి జనుట.

సీ. పూబోఁడి తత్పురం • బునకు సపుత్రయై
చనియొఁ గృశీభూత • తనువుదాల్చి
చనిన తజ్జనపాలు • సదనంబున వసించు
నొకదాసి యారాజ • యువతివార్త
నెఱిఁగి యువ్వైశ్యాధ్యు • నెదుటను గొనిపోవ
నతఁడు రుజాపీడి • తాంగియైన
నృపపత్ని వీక్షించి • నిపుణుఁడై యేకాంత
ములర తద్వృత్తాంత • మంత యరసి

గీ. యహహ కష్టంబఁటంచు మది • నబ్బురంబు
నొంది నిట్టూర్పు నిగుడించి • యోగ్యమైన
తనదు గేహంబులోనన • తన్వినుంచి
గౌరవంబెనయించుచు • గరుణతోడ. ౫౩

మ. మణిమంత్రౌషధ యంత్రతంత్ర ముఖ • సన్మానాద్య హృద్యద్భిష
స్మణముల్ బిల్చి యనేకవిత్తముల సం • భావించి తత్తత్కృతా
గణనీయౌషధ జాతిఁదత్తనుగ • రోమాంచాంత యున్సోప్రతి
క్షణమేమారక సంగఁజేయుచుఁ దగన్ • గారుణ్య సంయుక్తుఁడై. ౧౮

వ. ఇవ్విధంబున బహువిధోపచారంబులు సేయింపుచుఁ బథ్యపానీయంబుల వల
నను జికిత్సకోపదిష్ట విశిష్టమార్గంబుల రక్షింపుచుండ. ౧౯

క. ఆరాజపత్ని ప్రణయా తన్మాయాధార్తి తనుశాంతి • నందకయుండెన్
సారంబగు రోగమునఁగు మారుఁడు మృతుఁడయ్యె దైవ • మాయావశుఁడై.

సుమతి తనయుఁడు మృతినొందుట.

చ. ఇటువలె బుత్రుఁడీల్గిన స • హింపక చంపక గంధిశోకము
త్కటముగ మూర్ఛనొందె మద • దంతిక రాహత వల్లికైవడిన్
దిటముగ నంతలోపలను • దెల్వివహింపుచు బాష్పధారమి
క్కుటమయి తత్పయోధరన • కాశమునందొరుగంగ నిట్లనున్. ౧౨

ఉ. హాయను, మన్మనోరథ సుధార్ణవ • పూర్ణశశాంకరుచ్యదే
హాయను, సర్వధూర్వహవి • హారమహారమణాంకపాళివా
హాయను, సత్ప్రతాపతప • నాభిహతారి మహాన్తమస్సమూ
హాయను, ధర్మకీర్తినివ • హాయను నస్మద భీష్టహాయనున్. ౧౩

సీ. నాథధిక్కృత ధీస • నాథమై తగునన్ను
నూరార్చఁగా నెవ్వ • రోకుమార
పత్మనీ హితనన • పత్మనై తగునన్ను
ననునయింపఁగ నెవ్వ • రాత్మజాత
కాంతనిష్కాసితై • కాంతనై తగునన్ను
గడఁదేర్చ నెవ్వరు • గలరుపుత్ర
ప్రియనిరాకృతపథా • ప్రియమైతగిననన్ను
సలరింప నెవ్వరో • యనుఁగుతనయ

గీ. యనుచు విలపించు మూర్ఛిల్లు నావణిగ్జ
నములు వలదంచు సాంత్వవాక్యములు బలుక
పుత్ర మోహంబుచే భూమిఁ బొరలి పొరలి
బహుళ దుఃఖాబ్ధిలోఁ గ్రుంకి వలవరించె. ౫౯

—పద్మాకరు గృహంబునకు శివయోగి యరుదెంచుట.—

క. ఈరీతినుండు తఱిని న్నారీమణి దుఃఖరోగ నాశకుఁడు మహో
దారుఁడు ఋషభాఖ్యశివా కారుఁడు శివయోగి వచ్చెఁ గరుణాన్వితుఁడై. ౬౦

గీ. ఇటుల వచ్చిన నవ్వైశ్యుఁ డెదురుకొనుచు
నర పాద్యాది విధులచే నలరఁజేయ
పూజితుండయి యాయోగి పుంగవుండు
తద్గృహంబున దుఃఖించు తరుణిఁ గాంచి. ౬౧

ఉ. ఊరక యేడ్వనేటికి తల్లోదరి యాదరిలేనిశోకదుః
ఖారతిఁ నొందనీకుఁదగునా, మగువా జగతీతలంబులో
నేరుపుతోడ నెవ్వరు, జనింపరో యెవ్వరుజావరో వ్యథా
ధారత జెందనేల, వని తాజనితార్తి వహింపనేటికిఁ. ౬౨

సీ. తెలియంగ నిమిషమిట్టి దేహభావంబులు
వారిదాభంబులే వనజగంధి
యొకచోట జనియించు నొకచోట కేగు వే
రొకచోట జనియించు నుంకు వలన
నదిగాన లోకంబు నందు ఫేనాభమై
యుంగంబు పంచత్వ మందుచుండు
సతతంబు శోకావ సానంబు గానక
శోకింపఁ దలవరు సూరిజనులు

గీ. మునుగుణంబులచే భూతములు జనించు
లలిఁజరించుచు నిజకర్మములఁ దలిర్చి

కాలమునఁ గార్శ్యము వహించి • కడఁగిపోవ
నావశత నిర్ధరించు వి • న్నాణెముగను. ౬౩

క. వినుసత్త్వాదిగుణంబులు । ఘనమాయాజన్యమాన • గతినివహించున్
దనువులు తద్గుణములచే । జనియించును దద్గుణప్ర • సక్తము లగుచున్. ౬౪

గీ. సత్త్వగుణమున దేవత్వ • సంజ్ఞఁ జెందు
నలరజోగుణమునమను • ష్యత్వ మొందు
నతితమోగుణమునను తి • ర్యక్త్వ మొనయు
వసుధజంతువు వాసనా • వశతఁ జేసి ౬౫

గీ. జంతువు వివర్తమానసం • సారమునను
ముందుఁ గర్మానుబంధనం • బునఁ దలిర్చి
దృష్టసుఖదుఃఖ మయమునై • దుర్విభావ్య
మైన గతిని వహించునా • నద్భుతముగా. ౬౬

సీ. కల్పాయువును దగ • గలదేవతలకైనఁ
గలదపాయము మహా • కల్పమునను
వరకర్మ బద్ధులౌ • నరదేహులకు సిద్ధ
మౌ నపాయంబిందు • కరుడ లేదు;
తెలియక కొందఱు • దేహంబునకుఁ గాల
మే హేతువేయని • రిందువదన;
యొలమిఁ గొందఱుకర్మ • మేయంద్రు కొందఱు
గుణముల నెంచిరి • గణుతిఁ జేసి

గీ. కాలకర్మగుణ ధార • గతినిఁ బూని
పంచభూతాత్మకంబయి • పరఁగుతనువు
పుట్టుటయుఁ జచ్చుటయుఁ జూచి • మోహశోక
ములవహింపరు పండితుల్ • జలరుహాక్షి ౬౭

క. అవ్యక్తమున జనించుచు । నవ్యక్తంబున నశింపు • చవ్యక్తమునన్
సువ్యక్తమగుచు జంతువు । భవ్యజలంబునను బుగ్గ • దగిది దలంపన్. ౬౮

గీ. ఎప్పుడు గర్భస్థుఁడో దేహి • యప్పుడె నాశ
నంబు కల్పితమయ్యెసి • కష్టంబు గాఁగ
దైవ వశతను జీవించు • దైవవశత
మరణమొందును జంతువీ • ధరణిలోన. ౬౭

సీ. ఉదరస్థుఁడై కొంద • ఱుదయించి కొందఱు
ముదియక కొందఱు • ముదిసి కొంద
ఱంతంబు నొందుచు • నలపురాతనకర్మ
గతి యట్టిదో యట్టి • గతి వహించు
దేహంబుఁ బొందిత • ద్దేహానురూపంబు
లగు సుఖదుఃఖాదు • లనుభవించు
మాయానుభావప్ర • మాణంబుచే స్త్రీలు
పురుషులు సుగతాను • భూతిఁ జెంది

కలసియుండిన దైవయో • గమున జంతు
వుదయమొందుచు సమ్యగా • యువును సుఖము
దుఃఖమును పుణ్యపాపంబు • దొడర శాస్త్ర
ధనములను బొందుచుండును • ధాత్రిలోన. ౬౮

గీ. వనజభవుఁడు లలాటంబు • లను లిఖింప
తదనురూపంబుగా దేహి • దనరుచుండు
కాలకర్మంబు లవిలంఘ్య • గతి వహింప
భావముల నిత్యములు దుఃఖ • పడఁగ నేలా. ౬౯

గీ. స్వప్నమున సౌఖ్యమెక్కడ • సమ్యగింద్ర
జాలమున సౌఖ్యమెక్కడ • శారదాభ్ర
మునకు నిత్యత్వమెక్కడ • తనువులకును
నిలుక డెక్కడ లేదని • నిశ్చయింపు. ౭౦

క. *శతకోట్యాయుతసంఖ్యా। మితజన్మంబుల నతిక్ర • మింపఁగ నాశా
శ్వతపరతత్త్వం బెఱుఁగమి। సతినీకిఁ భ్రమ జనించె • సాధ్వీ వినఁగదే.

* శతకోట్యాయుత మని అచ్చుప్రతి.

## — శివయోగి సుమతికి మహాదేవుప్రభావంబు బోధించుట —

సీ. సకల జగత్సాక్షి • సర్వేశ్వరుఁడుపరా
త్పరుఁడు సాక్షాత్పర • బ్రహ్మతత్ప
రుండే కపవరు [ ద్రోనద్వితీయోస్తి
తస్మాత్త నందగు • ధన్యమూర్తి
బ్రహ్మాధి పతియని • బ్రహ్మణోధిపతిశ్చ
యని శ్రుతుల్ బలుకునె • య్యాముదలిర్ప
మతి శంభురాకాశ • మధ్యేయనుచువిశ్వ
తశ్చక్షువని శ్రుతుల్ • దవిలిచాట
గీ. యఃపరస్స మహేశ్వర • యనుచు నజుఁడు
నిత్యుఁడును శాశ్వతుండును • నిర్గుణుండు
ననుచు బహువిధముల శ్రుతుల్ • మునువచింప
నతఁడు నిత్యస్వరూపుఁడై • యలరుచుండు. ౭౫

సీ. సర్వవిద్యలకు నీ • శానుండె యధిపతి
సర్వభూతములకీ • శ్వరుఁడెకర్త
యాధివిశ్వాధికో • రుద్రయంచూర్ధ్వరే
తంవిరూపాక్షమం ( తన్నుఁడైన
యాత్ముఁడు నద్వితీ • యస్వరూపుఁడుశివ
మద్వైత మనుచు వే • దాంతనికర
మెప్పుడు వచియింప • నీశుఁడు సర్వోత్త
ముత్తముండని శ్రుతు • లొనరబల్కు
• సర్వలోకంబులకుఁ బత్తి • సర్వభూత
ములకుఁ బతియును [illegible] • [illegible]
[illegible] • [illegible]
నతఁడుగాక తదన్యుఁడీ • యువనిఁగలఁడే. ౭౬

సీ. ఉర్వీఁగాలాగ్నిరు • ద్రోపనిషచ్ఛత
రుద్రీయములు మఱిందు • రుద్రుఁదెలుపు
శ్వేతాశ్వతరమును • స్కాతసంహితయుమ
హాదేవుఁడే దేవుఁ • డనుచుఁబల్కు

గైవల్య మును లస • త్కఠవల్లియునుబర
శివుఁడె బ్రహ్మంబని ! చెప్పుచుండు
ఘనబృహ దారణ్య • కంబునారాయణ
ప్రశ్నంబు నభవుండు • బ్రహ్మమనుచు

గీ. వేదపాదస్తవంబును • విశదవృత్తి
శింశుమార స్తవంబును • చెప్పుచుండు
వామదేవుని శిరమధ • ర్వస్థశిరము
శంకరుండవరుండని • చాటుచుండు. ౮౦

క. యోగీశ్వరేశ్వరుండని। యోగతివాయువ్యసలహి • తాష్టావింశ
త్యాగమము లెవ్వనిమహా। భాగుండని వినుతిసేయుఁ • బరమప్రీతిన్. ౮౧

క. గాయత్రియు జాబాలము। నాయత వేదాంతములుని• రాకారశివ
స్వాయత్తత్వము దెలుపున్। వేయననేటికి శివుండు • విశ్వమయుండగున్. ౮౨

ఆ. పురుషసూక్తమెవని • బోధించు బ్రహ్మాది
దివిజులెల్ల నతని • దివ్యపాద
కమలములను గొలఁచి , తనుతము నెలవులఁ
జెలఁగుచుందు రదియు ! జెప్పనేలా. ౮౩

సీ. అవ్యయ నిర్వ్యిక • ల్పాద్వితీయబ్రహ్మ
మును ధ్యాన మొనరింప • దనరుననుచు
దత్స్వరూపావస్థ • తత్వంబు జెన్నొంది
సగుణుండై విలసిల్లు • శంకరుండు
దేవుండుగాన త • ద్దేవుని కిష్టమై
ధన్యమౌ రుద్రాక్ష • ధారణంబు
రవ్యవిభూతిధా • రణమును దగియుతం
డధిపతిగానన • య్యధిపుఁడలరఁ

గీ. దాల్చులక్షణములను త • ద్భక్తులైన
జనులు ధరియింపవలయునీ • జగతిలోన

విప్రముఖజాతులకు భక్తి • విభవములర
దాల్ప వలయునటంచు వే • దములు బలికె. ౭౪

చ. అతని విభూతి వేదములు • నర్థముల్ గ్రతువుల్ వ్రతంబులున్
శతధృతియున్ బ్రభాకరుఁడు • చంద్రుఁడు పేంద్రుఁడు నింద్రముఖ్యాది
క్రతులును సిద్ధసాధ్యులును • పర్వులు దారకలున్ గ్రహంబులున్
యతులును యక్షరాక్షసులు • నంతయుఁ దద్విభవంబు నందగున్. ౭౫

క. సతత చతుర్ముఖ ముఖదే। వతలు పసులుగాఁగ నతఁడు ! పశుపతిగాఁగన్
మతిఁదలఁపనిది పశూనాం। పతియే సమ యనుచు శ్రుతులుఁబలుకఁగవినవే. ౭౬

క. అదిగాన నీవు భ్రాంతిని। వదలి మహేశ్వరుని భక్త • వత్సలుని శివున్
ముదమున నెమ్మదిలోపలఁ। జెదరక యారాధనంబు • జేయుము భక్తిన్. ౭౭

క. అని యివ్విధమున శివయో। గి నిబోధితయగుచు రాజ్ఞి • కేల్మోగిచి తదు
క్తి నిబద్ధబుద్ధిఁ దత్పద। వనజంబుల మీఁద వ్రాలి • పలికె వినతిచే. ౭౮

క. స్వామీ! మృతపుత్రత్వం। బామయము సదేహ బాంధ • వాభిభవమునన్
వేమరు గలిగింపకనికనా। మరణమె కానితనకు • నన్యమెఱుంగన్. ౮౦

గీ. కాననీ తనయుని తోడ ! మేను దొరగి
నినుభజించి కృతార్థత • నెగడుననుచు
దవిలి మారణోన్ముఖత్వంబు • దాల్చునతివఁ
గనుచు శివయోగి నెమ్మది కరుణ దోప. ౮౧

సీ. పుర్లోఁ్వ కారంబు • పురణించి మృతుఁడైన
బాలుని కడఁజేరి • భవ్యమైన
భస్మంబు శివమంత్ర ; భావితంబుగఁజేసి
వివృతమా తద్వక్త్ర • వివరమునను
ప్రసరించ మృతుఁడైన • బాలుఁడప్పటియట్లు
కన్నులు తెరచి త • త్కారణముచేత
*సర్వేంద్రియ పరత • జరుఁగగస్తన్యంబు
నకు రోదనము సల్పి • నంత వేగ

* ప్రాప్త సర్వేంద్రియ పరతజెందుచు స్తన్యమునకు రోదనము సల్పినంతవేగ తాత్పర్య

గీ. మృతుఁడగుచుఁ బునరుద్ధాన + మొసఁగెననుచు
వైశ్యపురమున నివసించు వారలెల్ల
విస్మిత స్వాంతులై వచ్చి వెరగునొంది
మించు నమోన్మాదమున నివ సించియుండె. ౬౨

గీ. అప్పుడానంద రసవిహ్వ లాంగియగుచు
దనయునిఁ గ్రహించి బాష్పసం తానసేత్ర
యగుచు నాలింగనముచేసి యతిముదాత్మ
నలరి తన్ను నొరునెరుంగ దయ్యెనంత. ౬౩

వ. మఱియు నావృషభ శివయోగీంద్రుఁడు నారాజపత్నీ తత్పుత్రుల విమ్రవ ణావృతంబులైన శరీరంబులఁ దద్విభూతి స్పృశించిన నయ్యిద్దఱు దివ్యతనువుల ధరించి బహుపుణ్యకర్మంబుల యేదేవతైశ్వర్యసుఖంబు గలదో దానికంటె శతగుణంబుగల సుఖంబునొంది యమ్మహాత్ముని పాదపద్మంబులపై వ్రాలి నస తుండెత్తి! యోరాజపత్నీ; నీవు బహుసంవత్సరంబులు జీవింపుచుఁ దాపంబు నొందక జయంబు జెందఁగలవు. నీకుమారుఁడు భద్రాయువను నామంబు ధరి యించి నిజరాజ్యంబు పాలింపుచు ఖ్యాతినొందగలఁడి వైశ్య గృహంబున సక ల విద్యలు గ్రహించి యవ్వనాభిరాముండగు పర్యంతంబు నిల్వఁదగునని వచిం చి యా యోగీంద్రుఁ డఱిఁగెనని సూతుండిట్లనియే- ౬౪

క. పూర్వంబునఁ జెప్పిన నాపింగళ కృష్ణపింగ ళాఖ్యశివార్చ
దీపితమై తొలుతను ని ర్యాపణమొందంగఁ బుణ్య పరతఁదలిర్పఁగ. ౬౫

—:సుమతియొక్కయు దత్పుత్రునియొక్కయుఁ బూర్వజన్మ వృత్తాంతము:—

సీ. చంద్రాంగదుండను జనవల్లభుని భార్య
యైన సీమంతిని యనెడుసాధ్వి
కుదయించి ప్రతిదినా భ్యుదయరూపౌదార్య
సుగుణ గణోపేత సురుచిరాంగి
యై కీర్తిమాలిని యనునామమున భూమి
వృద్ధిబొందెను గుణ వృద్ధులెన్న
భద్రాయువును వైశ్య పతితనూజుండు న
య్యంబుజ ప్ర, నిప్రతి బింబములన

+ మొనమెననుచు తా. ప్ర

గీ. సొంపుజనియింగా వైశ్య • సూనుఁడెలమి
సునయుఁడను పేరఁ దగుఁ రాజ • సుతునితోడ
జెలిమిఁ గావించి రత్నభూ • షలధరించి
క్రీడసల్పుచునుండిరి • వేడుకలర. ౯౬

క. ఆవైశ్యాగ్రణి ఘనభూ। దేవగ్రామణులచేత • దీర్ఘప్రతిభా
భావిభవ గాత్ముతనయున । కావిధి సంస్కారములను • గడగనొనరించెన్.

క. ధనధాన్యాంబర మణిగణ ఘనుఁడై తగు వైశ్యవిభుఁడు • కడు వేడుకరా
త్తనయుని నిజపుత్రాగ్రణి। నునుగురుశిక్షామలంబ • ముఖ్యుల జేసెన్. ౯౭

వ. మఱియు సర్వజ్ఞులైన దేశికులవలన యక్షర లక్షణ గణిత గంధర్వాలంకారేతి
హాస న్యాయమీమాంస నీతిశాస్త్ర పురాణాగమ జ్యోతిశ్శాస్త్ర స్త్రీలక్షణ
పురుషలక్షణ కన్యావాద వేదవాద రసవాద ధాతువాద మాయావాద క్షేత్ర
కర్మాశ్వవైద్య గజవైద్య యింద్రజాల మహేంద్రజాల గజకర్ణ గోకర్ణ తృణా
వధాన శస్త్రావధాన ఘంటావధాన భ్రమణ మోహనోచ్చాటన ద్వేషణా
కర్షణాంజనాదృశ్య కరణి భృగుమత భేతాళమత కావ్యలక్షణ వాస్తుశాస్త్ర నీ
తిశాస్త్ర ధనుర్వేద రథారోహణ శిబికారోహణ యోగశాస్త్ర భరతశా
స్త్ర మోహనస్తంభన ఖడ్గస్తంభన ఆపస్తంభన ఘుటికాసిద్ధి మంత్రసిద్ధి ఖే
చరగమన పరకాయ ప్రవేశంబులను విద్యలనెఱిగించి అసిముసల కంపణకా
య భల్లభిండివాల కోదండ శరచక్ర కుంతకుఠార పరశుపట్టిశ గదా ప్రాస
తోమర ముద్గర లాంగల త్రిశూల ఛురికాంకుశాద్యాయుధ విశేషంబు లభ్య
సింపఁజేసి యున్నంత. ౯౯

సీ. తలముళ్లు మెడనూళ్లు • * దండచే కడియముల్
బిగువాళ్ళు రుల్లతాళ్ళు • బిరుసందనము

---

* దండకపిండుల్ — అష్టపతి — 9 ఘనశిఖి శుక్తిప్రకాండజముల నతుల వరాహ దంష్ట్రాంత రోద్భవముల మానిత బహువిధమౌక్తికముల గరములపూని నిండు ప్రాగాహ్యములుగ జెందు వాంఛ్రడు మదం బెదమిం మద౦డ - గాట్పుతాతాళ్ళ లాలవోల్లాస మమర నేగుదెంచి తదాజ్ఞచె నెమటనిలచె.

గండపెండేరముల్ • కటిసంపు గొలుసుల
దగిలిన కనకముల్ • జిగురుగండె
లలరెడు తడకలు • నడ్డంపు పందివా
టులు వలలునుసురి • యలునువంక
కత్తులు శూలముల్ • ఖడ్గముల్ పట్టిన
ములుకుంతములు భల్ల • ములు తెలంగ

గీ. కటుకుమీసాలు కండెన • సరకుసేయ
గాత్రములు శోణనేత్రముల్ • కప్పువలువ
కాసెలును గండ్ర గొడ్డండ్లు • గలిగిచెంచు
వాండ్రు జనుదెంచి రయ్యెడ • దీండ్రముగను. ౧౦౦

సీ. వరరక్త సితవర్ణ • వంశోద్భవంబుల
బీతవక్షేత్రసం • జాతములను
గురుకర్బురద్యోత • కుంభి కుంభస్థల
నీలవర్ణాహిఫ • టాలయముల
జ్యోతీరుగంబుము • గ్ధాతసంభవముల
శ్యావద్యుతివరాహ • జన్యములను
ఖర్జూరదీప్తికం • ఖసముద్రితంబుల
మహితగౌరప్రభా • మత్స్యజముల

గీ. కలితదీధితి శుక్తి • ప్రకాండజముల
కరములనుబూని ముందు • పగ్రాహ్యములుగ
రాజదర్శన లాలసోల్లాస • మలర
నేగుదెంచి తదాజ్ఞచే • నెదుటనిల్చి. ౧౦౧

క. నతికి జోహారొనరించిరి। పతికి వితరణగుణునకు • భాస్వన్మతిగి
మ్మతికి ఘన తేజోహా। కృతికి సతతాభియాతి • రాజవినుతికి. ౧౦౨

వ. ఇట్లు ప్రమొక్కి నిలిచి. ౧౦౩

క. జేజేజేజేసామీ। యాజేజేరేనివలెనొ • యారంబలరం
గాజినముల బాలింపుము। మా జీవములీవసుమ్ము • మానవనాథా. ౧౦౪

చించిన. ౧౦౫

గీ. వాఁడఁగన్గొని మన్నించి • మీరిచటికి
నేమికోరికవచ్చితి • రెచటనుండు
వారు మీపేరు పెంపు నే • ర్పాటుగావ
చించుడనఁ బల్కె • నందొక్క • చెంచుఱేఁడు. ౧౦౬

సీ. చెలువగుబ్బలిని ని • చ్చలువసింపుచునుండి
తలిగొండమీదని • త్తలిఁజరించి
చుట్టుగొండ మెకాలఁ • జుట్టుకొంచు మెలంగి
జాళువాతిప్పపై • జాలువారి
వెండి మెట్టనుజుట్టి • వెండియు విహరించి
సిరిగండపుంగట్టు • సిరిహరించి
ప్రొద్దుపొడ్పుమలనే • ప్రొద్దుసంబరమంది
గ్రుంకురా పైనీటఁ • గ్రుంకుచలమి

గీ. ఇంపుగల సొంపుటడవిని • ద్దంపునడక
లడర నాడాడ దిరుఁగుచు • నవనినాథ
నిన్నుఁ బొడఁగని పెనుమెకా • లున్నచోటు
దెలియ వచియింపవచ్చితి • మలవుమీర. ౧౦౭

గీ. అయ్య వైవస్వతకులంబు • నందుఁబుట్టి
శ్యామ శబలంబు లగు మను; • ద్దామబలము
గలుగు శునకంబులిగంచు • తులకు రాక
దక్కినప్పు దిక్కునవసించె • నుక్కుదక్కి ౧౦౮

గీ. దేవరా, క్షేత్రపాలక • దేవుఁడొక్క
భవక మీగంగ గన్గొని • పారిపోయి
యెచటనుండెనో కానిమా • కెర్గుక లేదు
తెలియఁజెప్పెద వీసిఁ స • త్తులనుజగతి. ౧౦౯

క. * బూసులరాయఁడు తొలిమా। వేసాలదరించినాల్గు • వేపులగాఁగం
జేసెఁదొలిపలుకులనుచూ। వాసిగలుగు పిచ్చిబోడ • వశిబోరంగన్. ౧౨౦

ఆ. సామి కొలనిచుట్టు • చక్కని యడవిలో
చెంచువేసమూని • సిరిమగండు
దిరిగెఁ దానిచుట్టు • దెగలేవి వేమవే
మెకము లలరుచుండ • మేకొనుండు. ౧౨౧

క. • ఈమృగయాకుశలము నా। నామృగములఁ జంపజూచి • నలినశరహరున్
సోముని సమాశ్రయించుచుఁ నామృగములు బ్రతికియుండె • నటదలపోయన్.

క. అనిపల్క నొక్కశబరుం। డనుమోదముతోడ దేవ • రా చూచితెయీ
వనమృగ గండరబిరుదాం। కనమునఁదగు కురుక్కరమును • గౌతుక మలరన్.

గీ. దేవ యీశైశవుఁడు మించి • సాహసమున
బొమ్మదేవర మెరగుల • పుట్టబట్టె
దేవతలు గీవతలు గడ • దైరలేరు
మానవులు గీనవులు నెంత • మానవేశా. ౧౨౪

సీ. ఈమృగదంశకం • బేచిన గండశే
రుండంబు నైనను • బెండుపరచు
నీసారమేయంబ • నేకంబు లైనట్టి
బొల్లినోటి మెకాలఁ • బొలియజేయు
నీకురుక్కరంబు వ • న్యేభంబులను గిట్టి
కుంభస్థలాగ్రసంబు • గోలివచ్చు
నీభషకంబుల • ద్వీపిప్రజంబులఁ
మున్కలుగా జేసి • తొంగలించె

గీ. నిదియుఁగాచెవ్వఁ డనుపేరఁ • బొదలుచుండు
నిదియు పోలమరాజన • ముదమునొందు

---

* బూసులరాయెడు తొలిమా। వేసాలకరించినాల్గు, వేపులచేవ। న్యాపంచరుఁ డయ్యెనుమా తొపాటికిరాక కొండ కొనలో డాగెన్. తా. ప్ర-

• క. ఈమృగదంశకముల అచ్చుప్రతి.

నిదియు నాపోతు లింగడట • పనవినొందు
నిదియు మనుబోతులకు మిత్తి • యిలదలంప. ౧౧౫

క. అరవదిమోముల వేలుపు । టూరవు జిరాదాద్రిపైన • యొడయడవగునీ
సరియేరిక మాసెంచుల । పరిసైతము గాగరమ్మొ • పార్థివముఖ్యా ౧౧౬

సీ. తడ్కవేటకుబంటు • తగినయీ పావడు
నలులకు దిట్టయీ • చిఱుతవాడు
బోనులు చేబట్టి • పొదలుకీ బుడుతండు
వలవేయ నేర్పరి • కెలనిపట్టి
పందివాటుకునేరు • పరియయ్యె నీకందు
చిల్లమ్ము బలితుండీ • చెంతకూన
బొట్టకోలలమొకం • బులఁగొట్టు నీబొట్టె
జంజాలి దాల్చియీ • జంటకుఱ్ఱ
గీ. మొదలకుండంగ తెఱనోటి • మొకము నైన
పట్టిపల్లార్చు నీచిన్న • వాఁడు సామి
మాకులంబునఁ బుట్టిన • మగతనంబు
గల్గువారెల్ల మనువేట • కాండ్రుదలఁప. ౧౧౭

క. అనిపల్కిన వినయోక్తుల । మనమున హర్షించివారి • మన్నించిప్రభా
పనిరూఢి వేట తమకము । జనియించిన రాట్పుతుండు • చయ్యనలేచెన్. ౧౧౮

క. గరికెజిగినీ డగినజిరా । నరుపుసధరియించి • తత్త • దౌచిత్యగతి
స్ఫురణంబున సొంగుకయి । స్మేరయగ సొంగుమని శబర • నికరముపొగడన్.

ఉ. భూపగులెల్ల నుల్లసిల • చూడ్కికివేడ్క దలంకపంకజో
ద్దీపిత వామపాదముధ్ప • తిన్దపనీయ పుటంకవన్నెపై
స్థాపనజేసి సవ్యకర • సంస్థితినాయము లుల్లసిల్లగా
జ్యాపరమేశ్వరాయనుచుఁ • జంగననెక్కెదుతంగపుంగమున్. ౧౨౦

క. వినయజ్ఞుఁడైన నునయుఁడు । దనకు సహాయతవహించి • ధౌరాశ్వమునన్
దనరిచను దేరఖాద్యా । దినివహామ్బలరంగ దివ్య • తేజుండగుచున్. ౧౨౧

వ. ఇటుల వాహ్యాళి సముత్సవంబునకో హటించి, చటులభాసురచంద్రహాస ప్రాసశరాసన భిండివాల కరవాలతోమర పరశుపట్టసకుంతశూల ముద్గరగదాది సాధనంబులడర, తద్బలసహితుండై, గిరిసరిదుపవన జనపద దుర్గంబుల నిర్గమింపుచుఁ దత్పుళింద సైన్యకలకల నినాదాకర్ణ నేతస్తతః కుంజపుంజంబుల నరయుచుం జని ముందట. ౧౨౨

సీ. ఉడుపథోత్కషణశా • ఖోపశాఖాశిఖో
త్కటజటాపటలవ • త్కుటసమూహ
ముభయ తీరప్రపా • తోల్లలత్కల్లోల
గుంభశుంభత్సరో • జృంభణంబు
ననోక్స్య జన్యకృ • ద్ధర్యక్ష వీక్షణ
తురదద్భ్వ తతరక్షు • సంచయంబు
సమిత శుండాదండ • హతదండ సంతాన
ధానదుద్దండవే • దండనికర

గీ. మమిత సంప్రౌఢ కుటజకు • సుమసముదయ
మత్యుదార తరుజమనో • హరఫలంబు
లమరవర్యులకున్జోర • నలవిగాని
గహనమయ్యెడఁ గనుగొని • మహివిభుండు. ౧౨౩

సీ. హారాయితోభయ • ద్వారసిలాసమా
సక్తముక్తాలోక • సమద సింహ
మతివేల మదపూరి • తాశేష నిర్ఝర
బింబితాత్మోరుకుం • భిప్రకాండ
మనుగళద్ఘోరదం • ష్ట్రానీల నఖముఖ
దారితముస్తాత • టోరుకోల
మగణిత నగభేద • నాభంగ తరశృంగ
సంఘటితాటవీ • సైరిభచయ

గీ. మనుపమాభ్రాభనఖరపం • చనఖఖడ్గ
గంధ గంధర్వశంబర • బంధురతల
మగుచు నగభేది సానువై • వెగడి నిగుడు
విపిన మార్గంబు గనుగొని • నృపవరుండు ౧౨౪

ద్వితీయోల్లాసము

లయగ్రాహి

నింగిదవులం జివురు • లంగదరు మూషలవ
యింగదియు భృ • గములభంగ రతుల౯ నా
రంగములుముంగల మె • లంగెడులవంగముల
చెంగట వొరంగునన • లంగొమరుమై గొ
జ్జంగుల జెలంగెడు వి • హంగముల భంగుల న
సంగొనుచు నానృపతి • పుంగవుఁడు రాశీ
వ్యంగులు కురంగులు కు • ళుంగములు శింగములు
చెంగున నలుంగడల • కుంగదలిపోవ౯.

౨౨౫

వ. మఱియు నాగరాజస్థితి యనందగి యనంతమూలాధారమై కల్పవేళ యనంద
గియేకకాలోదితానేకార్కవిరాజితమై సుధర్మ యనందగి స్వచ్ఛంద కౌశిక
ప్రయూధార్జునమై, సజ్జనసంపద యనందగి వికసితాశోక పున్నాగసరళమై, శి
శుజన లీలయనందగి ధాత్రీకలాపమై రాఘవ చిత్తవృత్తి యనందగి వైదేహి
ప్రమోదమై క్షీరసముద్ర మథనవేళ యనందగివిజృంభమాణామృతమై, లం
కాపురియనందగి బహుపలాశ సేవితమై, సుగ్రీవ సేన యనందగి పనసనల శు
ముదభాసురమై, సువాసిని యనందగి సింధూరతిలక ప్రవాళాభరణ భూషిత
మై, కురు సేన యనందగి ధార్తరాష్ట్రోలూక శకుని సనాథమై, భీమకలహ
భూమి యనందగి కీచక నికరోపశోభితమైన• వింధ్యాటవిం గనుంగొని నల,
నలద, నళిన, నిచుళ విమలబిల్వ, చిరిబిల్వ, బహుళంబును, ప్రచురపిచ్ఛల రం
భాభిరామంబును వివిధోట జకుట జరుద్ధోప కంఠంబును వితత చూతప్రతతి
వాతావరుణ తరుషండ సన్నద్ధ భృంగగేయంబును, గోలాంగూల భగ్నక
శన్మధుఫలీమాధురసా సారసిక్త తరుతలంబును నారికేళ కంకేళి తాళీ సాలహిం
తాల తమాలలవలీ వకుళపూగ పున్నాగ నాగకేసర ఘనసార గంధసార
కోవిదార ఖర్జూర మందార బీజపూర జంబీర మల్లికా కేతకీ కుందబృందంబు
•ను దాత్యూహ వ్యూహ కుహూకుహూరావ భరిత నదీతట నికట నికుంజంబును
బుంజితోత్కంఠ కలకంఠాధ్యాసిత సహకార పల్లవంబును పరాగపుంజ పింజర
సింధువారమంజరీరజ్యమాన మధుకరమంజుశింజిత జనితముదంబునులవంగలుం
గ చంపకమధూక లోధ్ర కర్ణికారకదంబ కదంబకంబును జటకసంచార్యమా•

ణ చటులవాచాట చాటుకైరక్రియ మాణచాటుసహాచరిత వంచుచరణ చతుర చకోరకంబులను కిరాతహూణావక నిర్దిష్టముష్ట జలాకా కుటుంబినీ నిరీక్ష్యమాణస్థ విరళబర కుంజాంతరంబులను శైలేయవాసిత సుగంధి సిలాతలసుఖశాయిత శశకంబులను, సవిధగిరినితంబ నిర్ఝర నినదశ్రవణ నిద్రాణానంద మందాయమాన కిరకులంబులను, తదాసన్న కిన్నరీగీతాకర్ణనరమమాణరురునికరంబులను కులిశఖర నఖరప్రకర ప్రచండ పరిపాటిత మత్తమతంగ మదచ్ఛటాచ్ఛత చారుకేసరభర భాసుర కేసరి విసరంబును అగు తద్వనంబుఁ బ్రవేశించి మహాభుజంగమంబు చందంబునఁ బ్రవేశించి సదా గత్యభిముఖంబై సరిత్పతి యనందగి శుక్తిశోభితంబైన వింధ్యవనంబున వెలసి శ్రీవృక్షలాంఛితంబై హంసంబనఁదగి మానసగమనంబై హరిత్తురంగంబనఁదగి చిత్రభానూర్జితంబై తనరు తరయుత్తమ తురంగంబును నాస్కందిత ధారితకరేచిత వల్గిత ప్లుతాదిగతుల నడిపించుచు. ౧.౨౫

సీ. తొనలరాయుడికొని • తొలుసోఁకుసోఁకని
చిగురుటాకులవింత , చెలువుజూప
దెలివాక బోకల • లలిడాలు పోఁకల
నలరారు నిసుకదిన్నెలు మెలంగ
నొకటిపై నొకటియుం • టుకయున్న సన్నంపు
కొమ్మల దొమ్మలు • నెమ్మిఁజూప
నప్పటప్పటికొర్లి • దిప్పరంబుగవచ్చు
కప్పురంబుల పొదు • లొప్పఁజూప

గీ. సుమసమూహంబులను జొమ్మ • జుమ్మనుచును
జమిల ముక్కోలు చాలుపుల్ • సందడింప
బొదలఁ బొదలుచు నిద్దుర • నొదిగియున్న
మిన్నమెకములఁ గనితదా • సన్నఁడగుచు. ౧.౨౬

సీ. శింజినీరవముచేఁ • జెవులు చింపర రేగ
కొండలంబందెడు • కోలములును
తురగఖురోత్పన్న • ధూళికన్నులఁగప్ప
దల్లడింపుచునుండు • భల్లుకములు
తరవారిదీప్తులు • మిరిమిట్లు గొలుపంగ

గజిబిజి నొందెడు • గజచయంబు
శరపాత నధ్వసుల్ • తరుచుగాఁదోచిన
పరపరలై పోవు • హరిణములును

గీ. చప్పుచప్పున వడినార • సములుఁగాఁగ
దప్పుదప్పున జనుమృగా • దనగణంబు
క్రో[illegible]రీముఖ సుశిలీను • ఖములు గడఁగ
నార్తినొందున వార్యహా • ర్యతతులును. ౧౨౭

చ. కెలఁకులఁజేరిచేరి శర • కీలిత గాత్రతఁ బారిపారి ప
ల్వలములఁ దూరి తూరిబలు • వత్తను వైఖరిఁ గేరి కేరి పె
న్మలకల మీరిమీరి చల • నంబాగిలేకనుఁ దేరి తేరి పె
బ్బులులు నృపాలు బారిఁబడి • పోవకచావక యున్కిచిత్రమే. ౧౨౮

ఉ. సందులఁ బొంచి డెక్కతుది • చప్పుల నర్థిగించి పూఁబొదల్
ముందరఁగాంచి తత్కుహర • ముద్రితమూలము లన్గొంచి శ్రీ
చందనముల్ హరించి మును • సత్త్వము లేమిదలంచి మొక్కడా
పందులు మించిపోకనని • పైబడుటల్ వివరింపశక్యమే. ౧౨౯

చ. ప్రదరోత్పాటిత కుంభసంభవమణి • ప్రచ్ఛాదితాస్యంబు పై
మదమాతంగము లొక్కపెట్టున మహా • మందారబృందోల్లస
త్ప్రదనాంతఃప్రతితో గసత్త్వములని • స్సారత్వ మొందింపుచున్
బొదలంగన్గొని భూభుజుండ డలిసం • పూర్ణప్రతాపంబునన్. ౧౩౦

సీ. కరవాలములదుండ • చరణముల్ నరికినఁ
గుంభినీస్థలిఁబడు • కుంభిచయము
మండలాగ్రంబు • గుండియలవియింప
ధారిణినొఱగు కం • ఠీరవములు
నారాచముల మొదల్ • నఱికిన భూమిపైఁ
బొరలాడుచుండెడు • హరిణములును

క్రూరమార్గణములఁ • దూరు పెట్టినఁ దన్ను
కొని నేలఁ బ్రేఁబడు • కోలములును

గీ. సాయకంబులఁ బడుచిత్ర • కాయములును
కాండములఁ దెగుగండభే • రుండములును
గలిగి యారీతి రక్తసి • క్తంబులైన
భూతలంబులు గావించి • భూభుజుండు. ౧౩౧

గీ. వేటచాలించి యవ్వన • వాటిలోన
నొక్క యెలమావిగుంపులోఁ • జిక్కఁ దేని
మానికంబుల తిన్నెపై • సూనశయ్య
యలరియుండుట • గన్గొని • నెలవుఁ జేసి. ౧౩౨

వ. ఇటుల విశ్రమించి పోటుమానసులగు వేటకాండ్ర వేటాడ నియమింప వార
లుక్కుమిగిలి నగటిమిసెగ పొగలెగయ వెలుంగ బెగడని మృగంబులఁ దగిలి
మిగుల వగల నొగిలించి పోరియలు మరువులుగ నొరుగు మెకముల మొరగుల
వఱలు శరములసరికినఁ దిరుగుడువడు కరులను కరభంబులఁ బాపి తోలుగక
మొలగుజిలుపులుల పులులఁ గరపించి చంగుచంగున నింగిచెంగట నెగసి మగు
డి యంగముల రంగుతెసంగ నుప్పొంగు సింగములను భంగంబు నొందించి
మాటిమాటికి వనవాటిదాటఁగల పాటిగలిగి నేటగు లేటిదాటుల నేటుపోటుల
నాటించి యల్లకడలఁ గొల్లలగు జొల్లినోరు మెకంబులఁ జిల్లలనడంచి మించు
వారును, గొలుసులుడిపి విశ్వక్రమువులనుసికొల్పి బలుమృగంబుల నడగించు
వారును, వలలొడ్డి బలుపులుగులఁ బట్టెడువారును దడులడరించి వాగురులఁ
బసరింపఁ జేసి కృష్ణసారంబుల విదళింపజేయువారునై యుండి రాజయోగ్యంబు
లగు కొన్ని మృగంబుల వంతంగంబుల నా భద్రాయువు ముంగలనిడి జోహా
రొనరించిన సంతసించి వైశ్యుండగు సునయుండు దాను తద్బలంబులతోఁ వ
చ్చి నిజపద సమీపంబున నాలుబ్ధక బలంబున కాజ్ఞనొసంగి తన్నగరంబు ప్ర
వేశించి యతనికి నమస్కరించి వైశ్యాగ్రణికి సమ్మదం బలరించి యున్నంత.

సీ. హంసరూపుండనై • నసివసించినరీతి
• భసితలిప్తాంగంబు • బరగుచుండ

లలితాంతరస్థకుం • డలిబహిర్గతమైన
విధమున యజ్ఞోప • వీతములర
మస్తకస్థితచంద్ర • మధ్యస్థ పటమూల
ములుమించె నన శ్మశ్రు • వులు వెలుంగ
ఫాలంపుటజుని వ్రాల్పు కటంబులగునన్న
వృత్తినొసలిభూతి • రేఖలలర

గీ. నలువరాదులచేజగం • బుల వసించు
వర్ణరూపిణి నావశం • వదయటంచు
దెలుపుగతి నక్షమాలిక • చెలగుచుండ
ఋషభ యోగీంద్రుడే తెంచె • బ్రీతి మెలర్ప. ౧౩౪

అంతట. ౧౩౫

సీ. పరశివధ్యానసం • భవపరామృతపాన
మత్తత నన్యంబు • మరచువాడు
నాదానుసంధాన • మోదాత్ముడై లోక
నినదంబుల వినంగ • జననివాడు
సతత ప్రచారుకీ • జపదల ప్రసన్నుడై
పరగోష్ఠి పలుపంగ • జొరనివాడు
ప్రత్యగాత్మస్వరూప • స్వానుభూతిమై
యితర మెఱుంగక • యేగువాడు

గీ. సగుణ నిర్గుణరూపుడై • స్వప్రభావి
భవము నొందిన యల్లమా • ప్రభువనంగ
బహుళ జన్మాంతర తపః ప్ర • భావమొందు
సనయు భద్రాయు దర్శింప • నరభసమున. ౧౩౬

చనుదెంచిన శివయోగిని । ఘనుడగు నారాజసుతుడు • గని ప్రియమెసగన్
దనిపిన సత్కారాదుల । మునిపమ్మదమొంది పలికె • భూవిభుసుతుతో. ౧౩౭
ఓ తండ్రి నీకు కుశలమొ । నీతల్లికి లెస్సయగునె. నీవు సమస్త
ఖ్యాత శ్రుతి సంశయములు । చాతుర్యమెసంగ నెల్ల • జదివితొ చెపుమా. ౧౩౮

క. గురువులకు సపర్యాత। త్పరత వహించితివె నీకుఁ • బ్రాణసఖుఁడనై
వరవిలయు నన్నుఁ దలఁతువె। పరగున బల్కుమన నతని • జననికడంకన్. ౧౩౯

ఉ. అతివేగంబున వచ్చి యయ్యతివసా • ష్టాంగప్రణామంబులూ
ర్జితభక్తిన్ దగసల్పితచ్చరణరా • జీవంబులంబ్రతునా
నతునింగానొనరించి సమ్ముఖముగా • నప్రూనన త్వాదిసం
యుతమై దేనెలు జిల్కుపల్కులను న • య్యోగీంద్రుతోనిట్లనున్, ౧౪౦

గీ. ఇతనిగురుఁడ వయిననీకు • సుతుఁడు నగుని। తనికి బ్రాణంబొసంగిన • తండ్రివీవు
గాన నితనిని శిష్యుని • గాభరింపు। సరసకరుణామయాత్మ యో • గురువరేణ్య.

క. జ్ఞాతిజనబంధువర్జితుఁ। డీతనయుఁడనాథుఁడగుట • నితనికిన శ్వ
జ్ఞ్నతిప్రద సన్మార్గము। నాతతమతి దెల్పుమీరె • యర్హులుదలఁపన్. ౧౪౧

క. అని యిబ్బిధమునరా। జ్వని తాముణివిన్నవింప • వాత్సల్యమునన్
యామునిరాజసుతునక। ర్థినిసద్ధర్మంబు తెఱఁగు • దెల్పన్దొడఁగెన్. ౧౪౨

క. శ్రుతులయఁందును స్మృతులందు, హితపురాణ। తతులయందు సనాతన • ధర్మమెలమి
బరగవర్ణాశ్రమానురూ, పముననర్వ। భూజనంబులు సేవింపఁ • దగుదలంప ౧౪౩

క. చాలగుతత్సన్మార్గము। వాలాయంబుగను మాణ ; వక ; భజియింపన్
మేలగుగావున నీవిపు। డీలీల జరించు దేని • హితమగు దెలుపన్. ౧౪౪

మ. తెలియన్ నీకవియులంఘ్యమై తనరుమ • ద్దివ్యాప్తి నీవెప్పుడా
విలమార్గంబున దేవహేళనముగా • వింపన్దలంచేవు స
త్ఫలదాతృస్థితినొంద దేవగురువి • ప్రశ్రేష్ఠులందెల్లనిఁ
శ్చలభక్తిన్ జరియింపు సంతతమిలన్ • సత్యప్రధానుండవై. ౧౪౫

మ. ఎపుడున్ దుర్లభవస్తుజాతములయం • దిచ్ఛన్ విచారించకా
శ్వపచుండై తగునేని మన్నతిథియై • నంప్రాప్తుఁడైనన్ గలా
పపరిగ్రాహత నొందబోవకను నం • భావించి యన్నంబు న
త్కృపతోఁ బెట్టినఁ బుణ్యముల్లసిలునీ • పృథ్వీస్థలిన్ బుత్రకా. ౧౪౬

సీ. ప్రాణసంకటము సం • ప్రాప్తమై యుండినన్
సత్యంబు విడనాడ • జనదు తలఁప
రమణిగోబ్రాహ్మణ • రక్షణార్థంబుగాఁ
బడబిలో నొకవేళఁ • బొంకవచ్చు
పరభామినులయందుఁ • బరవిత్తములయందు
భువి దేవవిప్రవ • స్తువులయందు
దృష్ణనువిడువుము • త్కృష్ట బాహుబలాఢ్య
దంభంబు సర్వదా • తలఁపవలదు

గీ. సత్కథలయందు సద్వ్రతా • చారవిధుల
సత్పథములందు ధర్మాది • సంగ్రహముల
నిత్యమును తృష్ణనుంచుము • నిరుపమాన
హృదయ వచింపుంతుఁ గొన్నిటి • సదయమతిని. ౧౪౭

సీ. స్వాధ్యాయమునస్నాన • జపహోమపితృ తర్ప
ణాతిథిగోబ్రాహ్మ • ణార్చలందు
నలసత్వమువహింప • నర్హమార్గము గాదు
ముందుఁ గ్రోధము ద్వేష • మును భయంబు
నలజాడ్యపైశూన్య • మనదాగ్రహంబు కౌ
టిల్యంబు మోహంబు • తీవితోడ
నుద్వేగమునువీడు • టొప్పు క్షత్రియధర్మ
మెనసియు వృద్ధుల • హింసవలదు.

గీ. శుష్కవైరంబు కూడదు • సొంపనుచుమృ
షానులాపంబు పరనిందలఁ • బూనఁదగదు
గాన నీవింక బహుధర్మ • గతులు గలుగు
పథమును మనంబులో దల • పంగవలయు. ౧౪౮

క. సఖులందు మైత్రియుంచుము। సుఖులందు దయానువృత్తి • జూపందగు నో
సఖ; పుణ్యవంతులందును। నఖిలము మెచ్చంగ మోద • మలరింపఁదగున్.

క. వాసి కుబుద్ధులయందౌ। దాసీన్యము నుంచి తిరుగఁ • దలఁపుము సద్గ్రం

ధాసక్తిగలిగి గురునే। నాసక్తుం డయ్యెనేని • హర్షముదలఁపన్.

క. అత్యాహారమతిశ్రమ। మత్యాలాపంబు మఱియు • నతికోపంబౌ
ద్ధత్యంబతి వీర్యముభువి। నిత్యమతిక్రీడసలుప • నీకుదగదొగిన్. ౧౫౧

క. అతివిద్య యతిశ్రద్ధయు। నతిపుణ్య మతి స్మృతియును • నత్యుత్సాహం
బతిధైర్యంబతికీర్తియు। సతతము గడియింపవలయు • సౌజన్యనిధీ ౧౫౨

సీ. మోహాకృన్నిజవరా రోహాసమభిలష
త్స్వాంతంబుతో నున్కి • జనుదలంప
సత్యాహితపరిద్రత్యవస్థాత్తుని
స్వర్థాణంబొనరింపఁ • దగుదలంప
గణ్యంబులైనట్టి • పుణ్యంబులందు లో
భస్థితి వర్తింపఁ • దగుదలంప
పశ్యేతరాధర్మి • కేభ్యసంఘమునందు
సాభ్యసూయుండౌట • సర్వాయుక్తి

గీ. చండమతి హిండితాత్మసా • షండగణము
నందు విద్వేషుఁడగుటపెం • పొందుఁదలఁప
సజ్జనులమీఁద ననురాగ • సహితుఁడగుట
యుక్తమగుచుండు వివరింప • నుర్విలోన. ౧౫౩

సీ. తెలివిమీరఁగఁబ్రకృ • తిప్రత్యయంబుల
ననురక్తి గుణవృద్ధు • లరసియరసి
ప్రబలపరాదేశ • పదవిభక్తులసంధి
విగ్రహంబులచక్కి • వెలసివెలసి
పటుపరరూపని • పాతంబుల రసిత
ద్ధితవాక్యములమేలు • దెలసి తెలసి
సురుచిరాగమముఖ • సూత్రావ్యయార్థవృ
త్తులనమ్ముదంబున • నలరియలరి

గీ. గురునమంచదహీన • వాగ్గుంభనముల
నలరు చలజాతినిగ్రహ • ములవితర్క

గతులుగల రాజనీతిప్ర • కారమరయ
వలయు భూపాలతనయు యీ • వసుధలోన. ౧౫౪

క. కాపాలికలోకాయతి। కాపత్యత్యాగతదర్శ • యాతికులంబుల్
దీపించి తత్పథముదా। రాపాతన మొందఁజేయ ( నగుదలపోయన్. ౧౫౫

క. నిర్మర్యాదాభిజ్ఞులు! దుర్మంత్రులు బోధఁజేయు • దుర్బోధముచే
ధర్మంబు దప్పఁగూడదు। ధార్మికమార్గానువర్తి • తతనత్కీర్తి ౧౫౬

క. వర్ణవ్యావృత్తిస్థితి। గర్ణేజపనిర్ణయప్ర • కారోక్తులనా
కర్ణించునెడలబధిరో। దీర్ణత్వము నొందవలయు • దీననిధానా ౧౫౭

క. క్రూరశఠదంభ ధూర్త వి। హారకితవచపలపతిత • నాస్తికజిహ్మా
త్యాయూధులఁ గన్నంతనె। దూరముగాఁ దొలఁగవలయు • దూషితకలుషా.

సీ. సంతతాత్మప్రశంస • సారక్తుఁడవుగాక
విజితేంద్రియుఁడవుగా • విశదమతిని
పుత్రమిత్రకుటుంబ • ములనొక స్ఫటికిన
త్యాగసక్తుఁడవుగాక • యలరవలయు
సాధ్వీత్వ మొందిన • జాయవాక్యములందుఁ
బిత్రుభాషితములందుఁ • బ్రీతివెలయు
సద్గురూక్తులయందు • సర్వదా విశ్వాస
ముంచంగవలయు నో • యురుగుణాఢ్య

గీ. యాత్మరక్షాపరత్వంబు • ప్రమత్త
తయు దృఢప్రత బుద్ధియుఁ • దగఁజరింపు
మాత్మజులమీఁద నైననో • కప్పుడైన
వలదు విశ్వాసముంచంగ • వర్ణనీయ. ౧౫౮

గీ. అవని దారకోల సన్యాసి • యైనవిశ్వ
సించ నేనియు వాని హిం • సింపఁ దాఁడు

మాయలేక చరించిన • మనుజునందు
శంక జేయఁగవలవదో • జనవరేణ్యా. ౧౫౯

సీ. స్త్రీల బాలురవృద్ధ • కృపణాళ్యనాథుల
నపరాధ రహితుల • నవనిలోన
బుద్ధిబలప్రాణ • ములశక్తిబలమున
నరసిరక్షించుచు • యతిముదమున
సత్యంబు వలననుఁ • జలియింపఁగూడదు
హనన యోగ్యుండైన • యతివరుండు
శరణాగతుండైనఁ • జంపంగవలవదు
పాత్రుఁడైనను మఱన్న • పాత్రుఁడైన.

గీ. నీచుఁడగునేని మఱి. మహనీయుఁడేని
యెవ్వఁడైనను యాచించె • నేనివాని
[illegible] నొసఁగుచు • గురుయశంబు
నొందు [illegible] సదా • యుర్విలోన ౧౬౦

క. నరపతులకుఁ గోవిదులకు। ధరఁగీర్తియె భూషణంబు • తత్కీర్తియె ప్ర
స్ఫురితమగులక్ష్మి తత్క। ర్తిరతింబుణ్యంబుగలుగు • ధీరవిచారా. ౧౬౨

క. అవనీశతనయః సంతత। కవిసన్నుత చంద్రచంద్రి • కలకెటువలెనో
యవినాభావంబటువలె। నవనిజనము కీర్తిచేత • నలరుచునుండుర్. ౧౬౩

క. రాజాశ్వహేమనవమణి। రాజని గుప్తక్రియలను• రక్షింపమహా
రాజః యకీర్తి నిపతితో। త్తేజితసర్వఁబువిడుము • తృణగణముబలెర్. ౧౬౪

ఆ. మాతృకోపంబు జనకున • మర్షణముగు
ర్నృపతిఘ్నరైవ్యయంబు పు • త్రులవలనను
బ్రాప్తమగు నపరాధంబు • బ్రాహ్మణాప
రాధముసహింపవలయునో • రాట్కుమారా. ౧౬౫

ఎటువలెనైన విప్రతతు • లెంత ప్రపన్నత నొందుచుందురో
యటువలె వారికీప్సితప • దార్థము సంగపొసంగు రాజు సం
కటపడుచున్న వారల నొ : కానొక వేళఁ గడంగి యుద్ధరిం
చుట నిజమై చెలంగుఁ బరి • శుద్ధగురూదిత బోధసంయుతా. ౧౬౬

శా. ఆయుఃకీర్తిబలంబు సౌఖ్యధనపు • త్రస్త్రీప్రజల్ పూర్వక
ర్మాయత్తంబులు గాన నేదిజనితంబై • ప్రాప్తమౌ దాని ని
చ్ఛాయుక్తిన్ భజియింపు కాలమును దే • శంబున్ బ్రసక్తిన్ సదా
స్థ్యాయత్తైకతుక కార్యములన్ జనము మె • చ్చం జేయుచే మేలగున్. ౧౬౭

గీ. ఎవ్వనికి బాధ జేయరా • దెంచిచూడ
బరుని బాధ నివారింపఁ • బడదలంపు
శాత్రవులఁ జోరులన్ దుష్ట • సంచయముల
శక్తిఁ గొలఁదిని బాధింపు • జనవరేణ్యా. ౧౬౮

గీ. వెలయు పితృకర్మ జపహోమ • ములను స్నాన
ములనుఁ జేయుతఱిన్ వేగ • ముడుగవలయు
భోజనము జేయుచో నిద్ర • బోవునెడను
సత్వరస్థితి నొందంగఁ • జనుఁదలంప ౧౬౯

సీ. దాక్షిణ్యయుక్తమై • తనరి యక్రూరమై
జనమనోహరమునై • సత్యమగుచు
సల్పాక్షరం బనం • తార్థమౌ వాక్యంబు
బలుకు మెప్పుడు గురు • భక్తిసహిత
క్షితిపార్థివులయందు • భయ మొందకుము గురు
శాసనద్విజపాప • చయములందు
భయ మొందుమా జ్ఞాతి • బంధుమిత్రులయెడ
జామాతృజులయందు • సమతచేత

గీ. సంచరింపుము పంక్తిభో • జనమునందు
నటుల వర్తింప నగువిద్య • దభిహితోక్తి

శాస్త్రిగోష్ఠుల పుణ్యప్ర • సంగములను
ధార్మికులపై బరాజ్యమ్ము • ఖ్యాతిం బలదు. ౧౭౦

క. పరిశుద్ధ పుణ్యమానస పరణిక్ విఖ్యాతివిప్ర • సభయందుఁబరా
త్పరు శివుని మందిరంబున! స్థిరత: వసియింపవలయు • ధీరవిచారా ౧౭౧

క. కాముక కులటాగణికా! స్త్రీముఖనీచార్త దుష్ట • దేశమునను ము
న్నేమరి పాటున నైనను! నేమరి వసియింపరాదు • విహితవివేకా. ౧౭౨

గీ. త్రిభువనేశ్వరుఁడగు మహా • దేవుభక్తి
నేదినంబున భజియింతు • వాదినమున
సకల దేవతలను మది • సంస్మరించి
పూజసేయంగ వలయునో • భూపతనయా. ౧౭౩

క. నిరతము శుచివై చిద్వి! స్తరబుద్ధిని నిర్జితారి • షడ్వర్గుఁడవై
స్థిరశాంత చతురతలుమదిఁ! బొరయఁగ నేకాంతవాసముసదగుము నృపా. ౧౭౪

సీ. మునుత్రయీధర్మాబ్ధి • ముఖ్యాస్యవిప్రుల
శాంతులై నియమిత • స్వాంతులైన
యతులఁ బుణ్యాత్ములఁ • నతివృత్తులనుబుణ్య
నదుల నదంబులఁ • బొదలుచున్న
బుణ్యతీర్థంబులఁ • బుణ్యసరస్సుల
వితతమణీరత్న • వృషభములును
సత్య పతివ్రతా • సముదాయముల నాత్మ
గృహదైవములఁ గూర్చి - కేవలంపు

గీ. భక్తిచేఁ బ్రణమిల్లుచు • బ్రహ్మసమయ
ములను మేల్కొని స్వచ్ఛాంబు • వులను గ్రుంకి
యాచమన మొనరింపుచు • నాత్మగురుని
కలరవందన మొనరింపఁ • నగుదలంప. ౧౭౫

వ. ఇవ్విధంబుల్ప్రవర్తింపుచుఁ శ్రీమదుమా మహేశ్వరుల ధ్యానంబు సేయుమని
యమ్మహాత్మ్యుని ప్రభావంబు మందర శ్రీకవచ పూర్వకంబుగా వివరించెను

నిప్పుడు సగుణనిర్గుణ ప్రకారంబుల దన్మాహాత్మ్యంబుల వివరించెద నాకర్ణింపు
మని మఱియిట్లనియె. ౧౭౬

క. శ్రీసుఖదశుద్ధసత్త్వా। వాసము శివపార్వతీని • వాసము సుమహా
భాసమనా భాసముకై। లాసముదనరారుచిద్వి • లాసం బగుచున్. ౧౭౭

వ. అద్ధియు నాదిమధ్యాంత రహితంబును సజాతీయ విజాతీయ స్వగతభేద శూ
న్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశాపహసితానంతకోటిసూర్య చంద్రానల
లలోకంబును, వేదశాస్త్ర పురాణేతిహాసాగమాగమ్యంబును బహువిధ క
ర్మధర్మ గుణనామ రూపవికార శక్తి విహీనంబు బ్రహ్మేంద్రాద్యమరాసురో
రగ గరుడగంధర్వ కిన్నర కింపురుషసిద్ధ సాధ్యవిద్యాధర చారణాప్సరోయక్ష
గుహ్యక ఖేచరభూచర దేవర్షిబ్రహ్మర్షీశ్వర యోగీశ్వర మునీశ్వర వాగీశ్వరా
ద్యుపాస్యంబును, నిత్యనిర్గుణ నిర్వికల్ప నిరాకార నిరంజననిర్విషయ్యాతీంద్రి
యావాఙ్మానస గోచరాప్రమేయ శుద్ధబుద్ధ ముక్త కేవలాఖండ సచ్చిదానం
ద మయంబైన తురీయాతీత పరతత్త్వ కైలాసంబున నవ్యక్త మహాదాది స
ప్తావరణ వేష్టితంబును. చతుర్దశలోకకందర సుందరంబును సార్వభౌమాది
హిరణ్య గర్భానంతానంద గండశైల భాసురంబును, భానుసోమనక్షత్రగ్ర
హతారకా పావకసౌదామన్యాది వివిధరత్న శర్కరిలంబును, ప్రవిమల వైరా
గ్యోపత్య కాత్యంతము ముముక్షుతాధిత్యకా కలితఫలిత నిష్కామ కర్మోపాసన
యాగయోగజపతపశ్శౌచ సత్యదయాశీల వ్రతదానాది నానావిధానోకహో
ద్యాన విరాజితంబును' ఋషిత నిగమాగమాంత కల్పలతా విలసితంబును ష
డధ్వసమాధి సౌధవిభ్రాజితంబును పరమాధ్యాత్మ విద్యానంద జలాభిషిక్త ని
ర్మల చిత్తవృత్త్యంగణమును? తితిక్షాశ్రద్ధా సమాధాన మానిత్వారంభిత్వాది
కల్యాణ గుణమణిగణ రంగవల్లి ప్రకాశితంబును నిరతిశయ కైవల్యభాండా
గార శోభితంబును ఫలకామానాభావ స్వభావ నియత కర్మాచరణ చిత్తశు
ద్ధి సర్వకర్మ పరిత్యాగ గురుభక్తి శ్రవణమనన నిధిధ్యాసనాది సోపాన సమన్వి
త విజ్ఞాన రాజమార్గ లలితంబును పంచాక్షరీ మహామంత్రి మాణిక్య తోర
ణాలంకృతంబును ప్రణవనాద మంగళవాద్య రవపూరితంబు నగు తదాస్థాన
మంటపాంతరంబున సర్వోప నిషత్సార భూతబ్రహ్మాత్మైకత్వరూపోంకార సిం
హాసనాసీనుండై శుద్ధసత్త్వ ప్రధాన మాయామయదివ్య శోభన దివ్యవిగ్ర
హుండును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వ
రక్షకత్వ సర్వసంహారకత్వాద్య గణిత సమగ్రసుగుణ పరిగ్రహుండును సత్య

జ్ఞానానంద స్వరూపుండునగు శ్రీమహాదేవుండు శ్రీమూర్తి మంత్రంబులైన ష
ట్త్రింశత్తత్త్వంబులు ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, వ్యాపికేశ్వర వాగీశ్వర సురే
శ్వర నందికేశ్వర విఘ్నేశ్వర కుమారాది ప్రమథగణాధీశ్వరులును, బ్రహ్మ
మహేశ్వర్యాది సప్తమాతృకలు స్వసాన్నిధ్యంబున నిజకరుణా కటాక్షంబు
నపేక్షించి కొలువ స్వస్వరూపావలోకనంబు సేయుచు నాత్మారాముండై
యుండఁ దదీయ వామార్ధ శరీరిణియుఁ బరాపర ప్రకృతిస్వరూపిణియు, నిఖిల
జగదుపాదాన కారణభూతయు, నిఖిల లోకైకమాతయుఁ, త్రిభువన గేహిని
యు విశ్వమోహినియు, ధీముఖ జ్ఞానవిజ్ఞాన లోచనయు, విషయ విరక్త్యధర
యు, విచార మందస్మితయు, ప్రేమామృతానిరహంతాహస్తయు, యోగపీఠస్తని
యు, సందేహమధ్యయు, సంసార చక్రనాభియు, రాగద్వేష జఘనయుగా
మలోభోరుయుగళయు సంకల్ప వికల్పచరణయు, కాలానుగత కర్మయాన
యు, వేదాంతవిద్యావ్యసన వసనోపరతి కంచుకధారిణియు, రజస్సత్త్వతమో
గుణగ్రంధియు నీవిబంధ వేణుబంధసురుచిరయు, ఫలత్యాగపూ
ర్వక వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాద్యుపాసనేంద్రియాత్మ
యు, నిగమస్థిర ప్రజ్ఞత్వాది సాత్త్విక గుణభూషణాలంకారిణియు, శుద్ధవా
సనావాసితయు, నిత్యానపాయినియునగు నమ్మహాదేవి వామభాగంబున వ
సియింప. జెలువొందు నా యుమామహేశ్వరుల ధ్యానంబు. సేయుమని మ
ఱియు నిట్లనియె. ౧౭౫

క. నారాయణ మూర్తిం దలఁచి హారంబు వచింతు. దాని నాకర్ణింపన్
ఘోరతర పాతకంబులు దూరముగాఁ బోలఁగుముక్తి దొరకొనుదలంపన్.

క. అనివచియించిన ఋషభునిఁ గనికండము బెట్టినీవు గరుణదలిర్పన్
ననురక్షింపుము శ్రీహరి ఘనతర సుగుణానుభవము గరపిముదమునన్.

వ. అనిన నయ్యోగీంద్రుం డిట్లనియె శ్రీమన్నారాయణ చరణారవింద భక్తియుఁ
దదితర విరక్తియు. నీకు సంభవించు నిందుకు సాధనంబు వినుము. సర్వా
త్మలకు క్షేమహేతువగు స్వస్వరూప జ్ఞానంబు, తద్వ్యతిరిక్త వైరాగ్యంబు
ని నిశ్చయింపఁబడియె, నదియెట్లనిన. నాత్మశుద్ధుండును. జ్ఞానానందస్వరూపుం
డును భగవచ్ఛేషభూతుండును శిరఃపాణ్యాది లక్షణంబు పిండంబు, నాత్మవ్య
తిరిక్తంబు గాని యాత్మ గాదు. యుపచయాపచయాత్మకంబగు దేహంబునకుఁ
[illegible]కంబు నగిది నాశస్వభావంబు. ఆత్మనిత్యుండని చెప్పి మఱియు నిట్లనియె.

సీ. అసహాయమర్థంబైన • యంగంబునందభి
మానంబుచేతన • జ్ఞానియైన
జనుఁడు తత్తత్ప్రకృత • సత్త్వాదిక క్రియా
మాణంబులైనక • ర్మములఁగర్త
ననుచు బద్ధుండగు • ననయంబు తద్గుణం
బులు స్వకార్యంబులఁ • బొందలుకతనఁ
దానకర్త నటంచుఁ • దత్త్వజ్ఞుఁడగువాఁడు
దలఁచు నిస్సంగవ • ర్తనముచేత

గీ. వాత్మకీదృశకర్తృత్వ • మరసిచూడఁ
లలిపురాకృత కర్మము • లగుణయోగ
కృతముగాని విచారింప • గేవలస్వ
రూపకృతమనదగదవ • నీపతిలకా. ౧౮౨

ఉ. కావున నాత్మయందురతి • గల్గితదన్యము లందరక్తుఁడై
పావనమూర్తి శ్రీయువతి • భర్తృసమర్పణ బుద్ధిఁజేసి క
ర్మావళి నాచరింపుచు ని • రంతర తత్త్వల సంగకర్తృతల్
భావమునందుఁ జేర్పకవి • భాసిలునాత్మహితాభిలాషియై. ౧౮౩

సీ. అధ్యాత్మయోగని • ష్ఠాతిశయంబు వి
జ్ఞానంబు శ్రీశు భ • సరససత్క
థానులాపంబుత • దాకర్ణనంబును
పరమయోగీశ్వర • ప్రాప్తి యంచి
తార్థేంద్రియారామ • లగువారి విడుచుట
యును వారి కిష్టము • దనరునగ్ని
కామంబులందున • కాంక్షశీతోష్ణాది
సహనతాహింస • శమదమాది

గీ. కంబు విజనస్థలస్థితి • గలిగి శౌరి
కీర్తనామృతపానవి • స్ఫూర్తి దక్క
దతితర పదార్థవైరాగ్య • దశదలిర్చి
యుండు యమనియమాదిసం • యుక్తుఁడగుచు. ౧౮౪

వ. ఇట్టి పురుషునికి జ్ఞానవైరాగ్య యోగంబున భక్తియోగాగ్ని జనించి హృదయగ్రంధి విదాహకంబగు నిట్లు దగ్ధహృదయగ్రంధియైన పురుషుఁడు బాల్యాదిబాహ్యధర్మంబులు,సుఖదుఃఖాద్యాంతరధర్మంబులు, రాజభృత్యాద్యుచ్చ భేదంబులు, నాత్మైకారాముం డగుటం జేసి, నిరీక్షింపకుండు ద్రష్టయైనయాత్మకు, దృశ్యంబులైనయింద్రియార్థంబులకు నంతఃకరణంబు బంధుహేతువగుటం జేసి యయ్యంతఃకరణంబు నాత్మకధీనంబైన కతంబున దదితర దృశ్యభేదంబులు గనకుండు నిట్లుగాకుండిన విషయాకృష్టత్వంబులైనయింద్రియంబులచేత మనంబాకృష్టంబులైన నింద్రియంబులచేత మనంబాకృష్టంబై విషయాసక్తిం దగిలియంతంబైనవిచారశక్తి నపహరించుదానివలనఁ బూర్వాపరానుమేయసంధాన రూపస్మృతి దొలంగు నట్లయిన నాత్మవిషయక జ్ఞానంబు దూరంబగు నదియే యాత్మాపహ్నంబనదగు నదియుంగాక ౧౮౬

సీ. మహినాత్మ నోసుకా • మాయసర్వంప్రియం
భవలియఁ వైదిక , భాషణమున
నఖిలంబు ప్రియతమం , బగునాత్మ కేయాత్మ
స్వాపహ్నవంబున • నలరుకంటె
నధికతరంబైన • నాత్మనాశంబెద్ది
గలుఁగు జర్చింపలో • కంబునందు
మఱియు సంసృతిఁదాట • మతిగల పురుషుండు
దొలిపురుషార్థచ • తుష్టయములఁ

గీ. త్రితయమతి భీకరంబని • తెలసినాలు
గవది ముఖ్యార్థ మనిజనుల్ • గణుతిసేతు
రనుచు సద్భక్తియుక్తుఁడై • యనుపమాన
మైన మోక్షమపేక్షించు , ననఘచరితా. ౧౮౭

వ. అదియునుంగాక స్థావర జంగమాత్మకంబైన ప్రపంచంబునంగు భగవంతుండైన శ్రీహరి వ్యాపకుండయి యంతర్యామిత్వంబు నొంది వెలుంగుచుండు నమ్మహాత్మునియందుఁ గార్యకారణావస్థాద్వయంబుగల జగంబు సదసచ్ఛబ్దవాచ్యంబై ప్రవర్తిల్లు "యస్యాత్మా శరీరం యస్యప్రకృతిశ్శరీర" ఇత్యాది వేదాంత వచనములచే చిదచిదాత్మకంబైన ప్రపంచంబంతయు నచ్ఛబ్దవాచ్యండగు నతనికి శరీరభూతంబు స్వాత్మదశావన్న చిదచిచ్ఛరీరుండగు నతం

డు కారణభూతుండై "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనంబడు పురుషోత్తమునికి శరీరిశరీర భావంబుచేతగాని నిర్వికారంబైన స్వరూపంబునం గాదు. ఏకవిజ్ఞానంబున సర్వవిజ్ఞానంబగునను వేదాంతోదితార్థంబున సూక్ష్మచిదచిచ్ఛరీరక బ్రహ్మవిజ్ఞానంబున స్థూలచిదచిచ్ఛరీర విజ్ఞానంబగునని దేహగతంబులైన కౌమారాగాదికంబులు దేహియందు జెందని తెరంగున, హృద్గతంబులైన వికారంబులు అపహతపాపాది గుణకుండైన జగచ్ఛరీయందు దవులకుండునట్టి సర్వేశ్వరుండు స్వసంకల్ప కృతజగదుద్భవ విభవలయ లీనుండును పాపకానుగ్రహార్థంబు హృత్కమలకర్ణికాంతరంబున వసించి సర్వనియామకుండు సర్వవిలక్షణుండు దివ్యమహిషీ రమారమణుండు బ్రహ్మకర్మోభయ భావనాత్రయాతీతుండు ననంత కల్యాణగుణ పరిపూర్ణుండునై వర్తించునని యిట్లనియె. ౧౮౭

మ. కమలాభర్తల నత్స్వరూపగుణయో • గధ్యానమాధ్వీక పా
నమునం జేతన్గడు మత్తుండై చెలంగి య • న్యంబించుకం తైన చి
త్తమునం దెంచక ధన్యుండై ప్రకృతిబం • ధంబుల్ దెగంగోసి యు
త్తమయోగీశ్వర గమ్యముక్తిపదమం • దంబూను సర్వేశ్వరా. ౧౮౮

ఉ. ప్రీనులవిందుగాంగ వర • విందదళాయత నేత్రసత్కథా
గానము సేకమేను బుల • కల్ బచరించి ప్రమోద బాష్పసం
తానము మేయ మయ్యుగను • దమ్ముల్ జార గళంబు గద్గద
స్వానము చేజెలంగం దగు • వానిది జన్మము నూతలంబున౯. ౧౮౯

సీ. ధరలోన నెవ్వని • చరణాబ్జభక్తి సం
స్మరణంబున౯ సుధీ • సంచయంబు
లధికకర్మగ్రంథ • తాహంక్రియాహృద
యగ్రంథి నడచిన • యమితులనిర్వి
షయ నిరుద్ధేంద్రియ • సరణిమానసులుబోధ
శ్రేయలేరదియేమి • చెప్పవచ్చు
నట్టియాశ్వరునిశ్రీ • యఃపతి వాసుదేవు
నిజగత్పావను ననఘచరితు
గీ. నర్థిశరణంబుగాంద త్ప • దాబ్జయుగళి
భక్తి భజియించు నదిమేలు • పరమయోగి

సమ్మతంబైన పదము ని • స్సంశయముగ
రమ్యసుగుణవిహార యో • గాత్మకుమార. ౧౯౦

శా. కామక్రోధముఖద్విషద్భయదన • క్రవ్యాహ సంకీర్ణని
స్సీమాగాధ భవాంబురాశిగడవన్ • శ్రీనాథ పాదారవిం
దామందస్మరణప్లవంబు తదుపా • యంబన్య మేదన్నను
ద్దామప్రీతి దయాశ్రయుండ వగుమీ • ధాత్రిన్ నృపాలాత్మజా. ౧౯౧

వ• ఇవ్విధంబున శ్రీమన్నారాయణు ప్రభావంబు జెప్పితి నతని భజియింపుమని వచించి తదనంతరంబున బ్రహ్మదేవుని, విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, మహాలక్ష్మిని, సరస్వతిని సేవింపుమని దేవీ మహాత్మ్యంబు వినుమని యిట్లనియె.

—ఋషభయోగి రాజకుమారునకు దేవీమహాత్మ్యంబు చెప్పుట—

మ. అనయంబున్మనినై నవావరణము • ఖ్యప్రోల్లసద్రత్నకాం
చన సింహాసన దేదివత్సరశివాం • చద్ధాను వామాంకవా
సిని, సామర్థ్యకరాబ్జవీజిత కస • చ్చేలానిలస్పర్శసం
జనితానందినియైన శ్రీత్రిపురవా • సన్ సంస్మరింపందగున్. ౧౯౩

చ. సరసమహాత్వతత్వ నవ • చక్రరథాధినివాసయయ్యు వి
స్తరతరగేయచక్రగిరి • చక్రధరస్థితు లీప్సితార్థమం
త్రరతిని దండనీతిని య • థావిధిఁ దెల్పుచు నుండనొప్పునా
సురుచిరమూర్తి యాత్రిపుర • సుందరిఁ గొల్వుము నెమ్మనమ్మునన్• ౧౯౪

సీ. సదసదాత్మకజగ • జ్జన్మాది హేతుత్వ
మొందుచు సచ్చిదా • నందయగుచు
దీపితస్వస్వరూ • పాపరిత్యాగస్వ
రూపాంతరాదర్శ • రూఢిదనరి
సర్వోపనిషదర్థ • సారభూతస్థితి
కాదిహాది మనుప్ర • కారమొంది
సమ్యగేకోనవిం • శద్దళా వరణాంత
రస్థకోణత్రయా • రమ్యబిందు

గీ. పీఠగద్యాన శాంభవి • స్ఫీతకమల
ధామ కామేశ్వరాంకోప • ధాన మైన
మీనలోచన కాహిత్య • మిశ్రమైన
చరణ కమలంబు దలంచుము • స్వాంతమునను.

సీ. శ్రీనిజా రుణసితాం • ఘ్రిన్యాసముల జగ
ద్భాసకా భాసక • ప్రతిభ జెంది
పరశివ స్వాత్మనా • భావసంబంధసా
మర్థ్యమై సృష్ట్యాది • మహిమ గాంచి
దివ్యసద్గురుమంత్ర • దేవతాత్మమనోని
తైక్యవేది జనప్ర • హర్షమంది
జ్వలనాశ్రయాధార • జలజబాంధవపాత్ర
సంభృతైందవ సుధా • స్వాదమంది

గీ. సుందరేశ్వర హృదయసా • నందసరసి
సరస హంసీవతంసమై • సంభ్రమించి
బ్రహ్మ విద్యామృతాదన • పరమహంస
మీనమీనాక్షిఁ దలఁచుమీ • మానసమున.

మఱియు నమ్మహాత్రిపురసుందరీ స్వరూపం బభివర్ణించెద. మృదులపద్మరాగ సదృశ చరణాంబుజ నఖర నికరయు, యావకరస నిరసేక చరణకాంతి [illegible] హినియు, మారతూణీరదర్పహర జంఘికయుఁ, గరికరకదళీస్తంభ నిభోరు యుగళయు, సూక్ష్మారుణ దుకూలాలంకృత నితంబఘనాభోగయు, నవ్య [illegible] క గ్రంధిముద్రకాంతి విరాజితయు, నతనాభిమహావర్త త్రివళీ [illegible] ప్రభా ఝరియుస్తనకుట్మలలోల ముక్తాదామ శతావృతయు, నతిపీవర వక్షోజభార భంగురమధ్యయు, శిరీషదామ పేశల చతుర్భుజయుఁ బరిసంమృష్టశంఖసుందర కంధరయు, సువృత్త ముకురాభ వదనయు, బింబికా పాటలాధరయు, బంక్తి పరిశుద్ధ శుచివిద్యా రూపభాస్వత్కుందముకుళతుచ్ఛాయ దంతదర్పణ చంద్రికయు, స్థూలముక్తాఫల సన్నద్ధనాసాభరణ భాసురయుఁ, గైరిక కాంతికర్ణద్రోణి దీర్ఘలోచనయు, నష్టేందు తులితఫాలతల సహ్యక్లప్త కచ్ఛచ్ఛటయుఁ దాళీవ

తంస మణికుండల మండిత గండభాగద్యుతియు నవఘనసార కస్తూరికాది న మామోదిత వీటికయు, జ్వలచ్చారు చైందవమండల మధురాననయుఁ జింతా మణి సారకహితసరీటయు, దరోన్మీలద్రక్తాబ్జ ఫాలనేత్ర విరాజితయు, గాఢాం ధకార నిబిడశ్యామల [illegible] సంహతియు, సీమంత వీథీవిన్యస్త సింధూర రే ఖా [illegible] స్ఫురద్వక్షోజ [illegible] ంసయు, [illegible] విలోచనయు సర్వశృం గార విశేషాఢ్యయు, నగు నమ్మహాదేవి సేవింపుమని యిట్లనియె. ౧౯౬

గీ. హరిహయానల యమకోణ • పాంబుధీశ
పవనయక్షాధి పేశ్వర • ప్రభృతిదిక్ప
తులను బుణ్యాత్ములగుమునీం • ద్రులనుగూర్చి
ధ్యాన మొనరింపవలయు ని • త్యంబు మదిని. ౧౯౭

సీ. సముదయత్పద్మినీ • రమణునకు నిరంత
రంబు నమస్కార • ణంబానర్ప
పుష్ప సుగంధతాం • బూలశాకంబుల
ఫలపత్రముల శివా • ర్పణముఁ జేసి
భుజియింపవలె భక్ష్య • భోజ్యాదు లన్నిఁటి
నటువలె నేయంగ • నగుఁదలంప
నేది దత్తంబగు • నేది కృతంబగు
నేది స్నానముజపం • బేదిస్మృతము

గీ. నేది తపమగు నదియంత • యీశ్వరునికి
నర్పితముగాఁ దలంచుట • యర్హమగును
అమ్మహేశ్వరు కృపచేత • నఖిలపదవు
లనుభవింపంగ వచ్చునీ • యవనిలోన. ౧౯౮

సీ. రుద్రాక్ష వలయుసం • యూథోజ్వలత్కర
దండయుగ్మంబునఁ • దనరుచుండి
ఫాలభాగాంతర • ప్రస్ఫురత్సితభస్మ
యుక్తత్రిపుండ్రంబున • నొప్పుచుండి
త్రరాజమహా • పంచాక్షరి జపించి
సావధానంబైన • శాంతమునను

సతతంబుశివపదా • బ్జధ్యానమొనరించి
యింపుగాఁ గనుభూజి • యించునెడను

గీ. పల్కునెడ, జూచునెడ, నిల్వఁ • బడినయెడ, ది
రంగునెడ, గూర్కునెడ, విహా • రంబొనర్చు
నెడను, వినునెడ, గ్రహియించు • నెడను, శివుని
చింతసేయంగఁ దగుబుద్ధి • మంతులకును. ౨౦౦

క. ఈవిధమున సంక్షేపముగా వచియింపఁదగె ధర్మ • గతిసంగ్రహమిా
భూవలయమున బహుపురాఁ ణావిష్కృతమయ్యెఁ బ్రకటితాంచితవృత్తిన్. ౨౦౧

చ. ప్రకలపురాణ గుహ్యమగు • సంహరణంబు పవిత్రపూజయు
ప్రకట సుఖప్రదంబటివి • పత్రి, వి మోచన మైతలిర్చు శై
వకవచమేను నీకుహిత • వర్తన మొప్ప వచింతుతాల్కుమా
గక పరిశుద్ధ మానసము • రంజిలఁజేయుము సమ్మదంబునన్. ౨౦౨

వ. అని శివకవచంబు సాంగంబుగా నతనికి నుపదేశించి యావృషభ యోగీం
ద్రుఁ డిట్లనియె. ౨౦౩

సీ. అవనిపరప్రదం • బగు శైవకవచంబు
చెలఁగ నాచేముందు • జెప్పఁబడియె
సకలబాధాప్రశాం • తికరంబు సర్వదే
హాలకు రహస్యమై • యొప్పుచుండు
నేమానవుండైన • నీయుత్తమంబైన
శివకవచంబు పా • సించెనేని
యామర్త్యునకు శాంభ • వానుగ్రహంబున
భయమునించుకేని పం • భవమునొందు

గీ. దరసిచూడంగ • క్షీణాయు • వైనప్రాప్త
మృత్యువైన మహారోగ • మిళితుఁడైన
నతుల సంపత్సుఖంబుదీ • ర్ఘాయువెలమిఁ
జెందు సంశయమొక్కింత • జెందవలదు. ౨౦౪

గీ. సర్వదారిద్ర్య శమనంబు • సర్వమంగ
ళప్రదంబైన శివకవ • చప్రభావ
మెవ్వఁడేని వహించువాఁ • డివ్యసుమతి
దేవతలచేతఁ బూజ్యుఁడై • తిరుగుచుండు. ౨౦౫

క. ధరణి వివరించిచూచితె। పరమ మహాపాతకోప • పాతకములచేఁ
బరివర్జితుఁడై శివకవ। చరతిన్ దేహాంతమున నను • * సద్గతిఁజెందున్ • ౨౦౬

క. నీవును శ్రద్ధాయుక్తుఁడ। వైవర్ణితశైవకవచ • మత్యుత్తమమి
చ్ఛావిధి ధరియింపుము శ్రీ। రోవంతుఁడవగుము మామ • కోక్తి వశమునన్.

క. అని యివ్విధమున ఋషభుండనుపమ శివకవచమున్న • పాత్మజునకొనె
ర్పున నుపదేశింపుచుఁ జే। మనుతనుపరసత్కృపాస • మగ్రతదోష౯. ౨౦౮

శా. గర్వాఖర్వ విపక్షశిక్షణచణా • గ్రశ్రీకనచ్చక్రమున్
సర్వద్వేషణ హృత్ప్రుటస్ఫుట నక్ష • చ్ఛంఖంబు మున్నిచ్చి శ్రీ
సర్వేష్టంబయి మంత్రపూతమగు భ • స్మంబున్దదంగంబులన్
వేర్వేరన్ స్పృశియింపుచున్ మఱియునా • విఖ్యాత మోదంబునన్. ౨౦౯

చ. ద్విగుణిత మద్సహస్రగజ • దీప్తబలంబు నొసంగనప్పుడ
య్యగణితశక్తి భూతిమహి • మాతిశయంబలరన్ ధృతిన్స్మృతి
స్వగురువిభుత్వమొంద జన • శాసనసూనుఁడు • శారదేందుఁడై
సొగసువహించి కేల్మొగిచి • చూడ్కికి వేడ్క నొసంగుచుండఁగన్. ౨౧౦

వ. అయ్యెడ వమ్మహాత్ముండు. ౨౧౧

మ. మనుజాధీశతనూజ; ఖడ్గముతపో • మంత్రానుభావంబుచే
తననీకిచ్చితి దీనిఁజూచి పరుఁడం • తంబొందు వైరుల్నిరా
సనమున్ జెందుటఁ జెప్పనేల మఱియా • శంఖంబు ప్రమోయంగము
స్వనసన్ శత్రులుమూర్ఛనొందుదురునిర్వీర్యాత్ములై భూమిలో. ౨౧౨

---

* తేజరిల్లు-అచ్చుప్రతి సద్గతినొందు అ. ప్ర.

సీ. జననాథ సుత; దివ్య • శంఖఖడ్గంబులు
పరసైన్యనాశన • ప్రతిభ జెందు
నాత్మసైన్యంబుల • నలరించు నిత్యంబు
భవ్యమౌనేతత్త్వ • భావమునను
జటులద్విషట్సహ • స్రన్వీప బలముచే
బ్రస్ఫుట భస్మధా • రణముచేత
నిఖిలశాత్రవసేన • నిర్జించి పిత్ర్యసం
తంబైన సింహాస • నంబునొంది

గీ. భూమి పాలించఁగలవని • బుద్ధిఁ దెలిపి
జననిచేఁ దత్సుతునిచేత • సరసపూజ
నంబులను దృప్తిఁనొంది • యానందమున ను
ఋషభ యోగీంద్రుఁ డఱిగె య • థేచ్ఛమీర. ౧౦౩

వ. అని యివ్విధంబున సూతుండు శౌనకాదులకుం జెప్పిన నటమీఁద కథ యె
ట్టిదనిన. ౧౦౪

మ. వర నైజస్ఫురణోర్ధ్వ వర్వభువనో • పాదాన పాదానత
స్వరధీశాజ మునీంద్రనిత్య విలస • ద్వామాంగ వామాంగనా
కరుణారక్షిత శాస్త్ర సత్వబలవ • ద్గాంగేయ గాంగేయ భూ
ధర బాణాసవిలాస సత్యవదక్ష • ద్వ్యాహార వ్యాహారకా. ౧౦౫

క. హార్దస్తుతికృజ్జనహా! హార్దసకాపర్దముక్తి ద్వాపగయభ్యా
మర్దన సమ్మర్దబలీ! వర్ధరవవి పాట్యమాన • వనజభవాండా. ౧౦౬

భుజంగప్రయాతము

ప్రమాణప్రమేయ • ప్రమాతృస్వరూపా
అమేయావ్యయాత్యద్భు • తైశ్వర్యదీపా
రమానాథ హాణేశ • రమ్యానులాపా
నమోంశాను వాకాభి • నంద్యా ప్రతీపా. ౧౦౭

మ. ఇది శ్రీమత్ప్రతి పాద్యవేద్య కవితా • హేవాకభావాదిక
ప్రదశయ్యాధ్వనివృత్తి రీతిరసపుం॰ భావ ప్రభావప్రబం
ధదయాసంభృతి రాజశేఖరహిత • శ్రీరమ్య భద్రాయుర
భ్యుదయాభిఖ్య మహాప్రబంధము ద్వితీయోల్లాసమై పెంపగుఁ. ౨౧౫

—•గద్య•—

ఇది శ్రీరామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రామళ్లగోత్ర పాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజ
ద్రాజన్న దేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణ
కవిత్వతత్త్వ చాతుర్యధుర్య పరాశరగోత్ర
రాపాకలింనామాత్యపుత్రలక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయు
రభ్యుదయంబునందు
ద్వితీయోల్లాసము





శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము



## తృతీయోల్లాసము

---



శ్రీరం కరుణారస
ధారాప్లుత హృదయ సదయ తత్త్వవధూరా
ధారేయ సుఖకరవిహా
రా రామారెడ్డిపేట . ధామ మహేశా

వ. అవధరింపుము. శౌనకాది మునీంద్రులకు సూతుం డవలికథ నిట్లు చెప్పఁదొడంగెను. ౧

గీ. అధికబలుఁడు దశార్ణదే . శాధినాథుఁ
డై తగినవజ్రనాభురా . జ్యాంబు గొనఁగ
మగధ దేశాధి పతిమహా . మహుఁడు హేమ
రథుఁ డనెడు రా జనబలాఢి . గావుఁ డవుడు. 3

క. ధనబలవంతుండా హో! ధనబలరథగజతురగప్ర . దాత్యసి ముఖసా
ధనవలయిత ఖరుఁడరిసా! ధనవిలయాంతకుఁడగుచును . వ్యగ్రతదోర్వ; ౪

వ. అతండొక్కనాఁడు హితులు మంత్రులు పురోహితులు సేనాధిపతులు సామం
తులు ప్రధానులు సంధివిగ్రహాది విచారులు, దండనాయకులు కాయభార క
ర్తలు సైనధికులు రథికులు హస్తిపకులు వీరలు భటులుగొలువఁ గొలువుదీ
ర్చి యుండఁ గలయుంగని యందు రాజకార్య ఖడ్గప్రవీణులగు ప్రధాన పు
రుషులం జూచి యిట్లనియె.

మ. విమతవ్యూహ విభేదనోద్యమమునా । విఖ్యాత విశ్వాసపూ
ర్వమునీతిప్రముదాత్మ రక్షణవిధి । ప్రారంభమిష్టార్థలా
భము విద్వన్నికరస్తుతంబు శమనం । ప్రాప్తంబు నౌమంత్రకా
ర్యము గోప్యంబగుగాన మీమదిని ని । త్యంబిచ్ఛయింపన్ దగున్. ౬

గీ. కాన నామదిలోనొక్క । కార్యసరణి
యుప్పుడుద్భవమయ్యె న । దెట్టులనిన
సకలదేశాధిపతులు లం । చమువిధాన
మొనఁగి రౌకవ్రజ జాహులందు । నొనఁగడయ్యె. ౭

క. ఆతఁడు మదోన్మత్తుండై । ధృతిధనబలవిక్రమములఁ । దనరును యుద్ధో
ద్ధతిఁ గెలచి యతనిసంపద । లతిరయమునఁ గొనగవలయు । పార్థింపఁదగున్. ౮

గీ. అనినవిని తత్ప్రధానవీ । రాగ్రగణ్య
ముఖ్యులిది దండనీతిన । ముజ్వలంబౌ
నీదువచనంబు మామది । నిరుపమాన
మోగమొనరించె నీయెడ । మేదినీశా. ౯

క. అనివార కియ్యకొనన । జ్జనపతి సాగ సైనకొలువు । జాలించి జయాం
కనబిరుదధ్వజకీలిత । కనకరథంబెక్కి కాతు । కంబిసరొత్తన్. ౧౦

—। హేమరథుఁడు వజ్రనాభునిపై దండెత్తుట ।—

గ. సంధుత్సాహ షడ్విధబల । బంధురుఁడై వెడలెనపుడు । బధిరీకృతది
క్సింధుర బంధుర దుందుభి । ధంధాంధాంకరణములను । ధరణి వడంకన్. ౧౧

వ. ఇవ్విధంబున వెడలిన: ౧౨

సీ. సాధిత దుష్పృథజన • ప్రథితావితథమనో
రథశాస్త్ర శస్త్రభృ • ద్రథములలర
బంధురావయవగ • ర్వాంధదానస్రవ
ద్గంధ సింధుర ఘటల్ • గడలుకొనఁగ
ఘోరబాహ్లీకధా • రాట్టతుఖారకర
ఘోట్టాణధట్టికా • కోటులెనయ
చటులారి ధీరహృ • త్స్ఫుటపరిస్ఫుటనార
భటిసముద్భటవీర • భటులు గొలువ

గీ. భూరి భేరీమృదంగధ • క్కారవములు
పటహ గోముఖవాద్య శ • బ్దములు భద్ర
కాహళీ కుహళీరవ • వ్యూహములును.
నొక్క మొగి మ్రోయ మాగధుల్ • పిక్కటిల్ల. ౧౩

వ: పఁ: జేయు• ౧౪

సీ. అధికృతై తగినట్టి • రథికులు దుష్టవై
వధికులు దవిలి కీ • వలఁ జెలంగఁ
బ్రాసికుల్ కార్ముకా • భ్యాసికుల్ ముద్గర
న్యాసికుల్ దగుహళా • హళియొనర్ప
తాళికుల్ వందిపై • శాళికుల్ నిశితార
శాలికుల్ సాటోపు • లగుచు నడప
హేతికుల్ ముసలవి • ఖ్యాతికుల్ ముష్టిపం
ఘాతికుల్ మెండుగా • గ్రందుకొనఁగ

గీ. శాంఖికులు ఘాంటికులఁ గూడి • చాంక్రికులును
ఖాడ్గికులయాష్టికులమించి • కౌంతికులును
దారసోత్సాహ సన్నాహు • లగుచునపుడు
పగరనిర్జించు వేడ్కచే • బలసిరాగ. ౧౫

సీ. స్వవిషయానంతర • స్థానుండు శత్రుండు
తదనంతరుండు మి • త్రత్వమొందు

తత్పరతరరాజు • జాస్తీను దగుచుండు
దనవెన [illegible] • [illegible]
[illegible] • [illegible]
విధిమంత్రరంబున • వలయుచుండ
సాధుసహాయంబు • సాధనోపాయంబు
పరదేశకాలవి • భాగమరసి

గీ. ఘనవిపత్తికి మున్ను బతీ • కారవృత్తి
కార్యసిద్ధియు నసనైదు • గతులుగలుగు
నరస పంచాంగ మరయుచు • మడ్విధంబు
బలము నడపింపఁ దొడగె • నబ్బలితు డప్పుడు. ౧౭

సీ. కాంతిర విశభయం • కరనినాదంబులు
శారథికస్వాన • జారభటులు
పౌండరీకి ఘోర • భాంకార రావముల్
సైరిభిక పరిస్ఫు • టారవములు
వారాహికోద్ఘటి • తోరుపం రావముల్
ఖైరుండి కోగ్రశ • బృవజంబు
ఖాడ్గిక సందర్భ • కఠిన స్వనంబులు
కాశిక హుంక్రియా • కలుమరుతులు

గీ. సాహసాగత సైన్యకో • లాహలములు
గల్పిసి యేకీభవింప ను • త్కంఠతోడ
ఛీకరారణ్య గవ్యద • ర్వీకకోగ్ర
మార్గముల నిర్గమించుచు • మహివిభుండు; ౧౮

వ. మఱియు.

సీ. పరదేశములకు సం • బాధంబు రాకుండ
వ్యూహంబు నొనరింప • నూహచేయు
దుష్టసత్వంబులఁ • దూలింప నియమించు
వితత దృష్టాదృష్ట • విధముఁ దెలియు
దవిషాండ్రప్షికో • దర్కంబు గార్తాంత్రి

కులుదెల్ప సంతోష కలనఁ జెందు
నింపుమీఱంగ శ్యేన • సంపాతకీర్తిప్ర
స్థానంబనుచుఁ బల్కు • బూనఁ జేయు

గీ. నస్త్రముల బాడ్ల సవరణ • లలరుచుండ
శార్కరిలసికతిలమహా • శాద్వలముల
ప్రకటపంకిల నద్యల • పద్ధతులను
గడచి చతురంగ బలములు • తక్కలికతోడ. ౧౯

శా. భీమాదర్గళ నిర్గళత్పరబలా • భేద్యంబు • ధాన్యాదిక
స్తోమస్థేమ మనేకపార్శ్వరథవి • స్ఫూర్జద్భటప్రక్రమో
ద్దామంబద్భుత నూత్నరత్నవిలస • త్స్థానంబజస్రైకస
ద్ధైమచ్ఛత్రిగ వజ్రబాహునృపురా • ష్ట్రంబాక్రమించెన్ వడిన్. ౨౦

— భద్రాయువు దశార్ణదేశనగరాదుల నాక్రమించుట —

చ. కలుషిత ధూళితో నెదురు • గాడ్పులు డాయ, వరఘ్లుగూయ, ను
ల్కలుబడ, రక్తమేఘములు • గర్జిలి నెత్తురు నింప, మించుచు
క్కలు భయదంబుగా దివిని • గన్పడ, దుష్టములైన శాకునం
బులు గనుపించ, మాగధ పే • మూహము బెగ్గిల కర్గలంబుగన్. ౨౧

వ. ఇవ్విధంబున సముద్రతరంగంబులచందంబున, వర్షబిందువుల విధంబున చిలుకపరిగలి, మిడుతగమివడువున నుసిళ్లగుంపురీతి, నేల యీనిన పగిది తండోప తండంబులై, లక్షోపలక్షలై, కోటానకోటులై, పెక్కగతుల నెక్కడం గన నక్కడగనుపట్టు శతాక్షౌహిణీ మాగధబలంబు వజ్రబాహు పరిపాలిత దశార్ణదేశనగర గ్రామజనపదంబుల నాక్రమించె. ౨౨

ఉ. కొందఱు రత్నరాసులను • కొందఱు స్వర్ణచయంబులన్ మఱిం
గొందఱు దివ్యవస్త్రములఁ • గొందఱు గోవృషసంచయంబుల
న్గొందఱు సుందరీమణుల • గొందఱు బాలుర గొందఱింపుగా
నొందిన ధాన్యసంఘముల • నుద్భటవృత్తిని సంగ్రహింపుచున్. ౨౩

సీ. సౌభాగ్యకాపోతమా • యూరశౌకాదిసు
టోద్యాన వనముల • నాక్కడంచి
జాలపాదర థాంగ • జాలమేధాభంగ
విమలాంబు పద్మాక • రములగలంచి
సుఖభోగ శాలికా • ముఖయుక్త సస్యంబు
ఘోటకంబులు మెక్క • గోసివైచి
ముక్తాఫలాసక్త • ముఖ్యేక్షు వనములు
విటతాటనంబుగా • వించి మించి

గీ. కమ్ర కేళీరథంబుల • గాసిజేసి
ధనపదాగారములుజొచ్చి • తస్కరించి
సకల వస్త్రవజంబును • త్సుకతం గొనుచు
రిపుబలంబులు తద్రాజ్య • రిపులనొంచి. ౧౪

చ. అలరులత్రుంచి, తివియల • నన్నిటి మున్నిరసించి పెంపుడుం
బులుగుల గాంచి, వానిఁజోరిఁ • బుచ్చదలంచి • రహస్యకూటముల్
తొలుతనడంచి, రథ్యముల • తోరణముల్ విదళించి స్త్రీలసాం
పుల నడగించి, వారిదవగు • భూషణముల్ హరియించి మించగాన్. ౧౫

క. అనదలగుచు ద్విషదపహృతి। ధనకనకకళత్ర పుత్ర • ధాన్యాంబరగో
ధనులై నిర్బంధనులై। చనుదెంచి నిజాధిపతికి • సాగిలిభీతిన్. ౧౬

సీ. ఓమహారాజ, నీ • యుర్వీలోపల ముందు
సుఖసమృద్ధిని జెంది • సుతులు మేము
సకల సంపదలచే • సతతంబు చరియించు
వారమైయుండు నీ • వారమయ్య
వలసిన యప్పుడే • వారిదంబులు నిల్చి
వర్షంబు గురియున • వ్యారగాంగ
ముక్కారుపంటలు • నెక్కడ గనుగొన్న
తరగకుండును ధాన్య • తతిదలిర్చి

గీ. కామధేనువులన ధేను • కామకొనంగ

క్షీరవారిధి నింపునీ • సీమ నెపుడు
బ్రాహ్మణ క్షత్రియార్యశూ • ద్రవ్రజంబు
సత్యవృత్తి జరియించు నై • శ్వర్య మొంది. ౨౮

గీ. అట్టి మాపాటు వినుమిప్పు • డవనినాథ
యరివరులు నీదు రాజ్యంబు • నాక్రమింప
భంగపాటున సంకట • పాటుదుఃఖ
పాటుగల్గెనయ్యా, యేమి • పలుకవచ్చు. ౨౯

—* ప్రజలు వజ్రనాభునితోఁ దమ సంకటములఁ జెప్పికొనుట *—

క. నిగుడింపునీదు మగటిమి। సెగపొగలెగయంగ శత్రు • సేనాటవులన్
దగులుకొనఁగ లేకునికిని। వగలు మగుచెనిన్ను గొల్చు • వారల మదిలోన్. ౨౯

వ. అని విన్నవించిన. ౩౦

మ. వినియా భూపతి క్రోధఘూర్ణితరసా • వేశాత్ముఁడై మంత్రికా
ర్య నిరూఢాంతరులైన వారి, ఘనశౌ • ర్యస్ఫూర్తిఁ జెన్నొందువా
రిని బిల్వన్నియమించి శాత్రవులగా • ంచంగ నెన్నాళ్లకో
మనకు ద్యోగముగల్గె సర్వబలసం • మర్దంబుగాఁ బోదగున్. ౩౧

మ. అనిమీసాల్ వడివేసి యీసున నుబా • కోదండ పాండిత్యమే
ననిలోఁ జూపెద నాసమానులటె ము • న్నామాగధుల్ గీగధుల్
ననుఁ బోటిం దొడరంగ వచ్చినను నే • నానావిధాస్త్రాళిఁ
త్తనువుల్ నెత్తుట జొత్తిలన్ బరపెదం • దథ్యంబుగా నెంచినన్. ౩౨

వ. అని కోపాటోపంబున వీరాలాపంబులు పలికి. ౩౩

సీ. సమరసన్నాహము • స్పహాబలబంధురంగ
రథము దెమ్మనిన సా • రథి కడంగి
వివిధాస్త్రశస్త్ర ప్ర • వేశదివ్యంబైన
తేరు సమ్ముఖమునఁ • దెచ్చి నిలుపఁ

గని తద్రథంబెక్కి • కదనంబొనర్పనా
ప్తవరాధి నీపతుల్ • దరిసినదువ
నాగరాశేషమా • నవమోదమువహించి
చతురంగవాహినీ • సహితుఁడగుచు

గీ. స్వీయదేశప్రజార్తి కృ • చ్ఛ్రీలఖేల
బహుళమాగధసైన్య సం • బాధనంబు
కొఱకు రౌద్రరసవిశేష • ఘూర్ణమాన
మానసంబున వెడలెన • మ్మహి వడంక. ౩౪

స్రగ్విణీవృత్తము. భూరుఘ్భవర్భార కృ దుర్భరి భేరీనినా
దార్భటుల్ ఢాక్కనాదార్భటుల్ మ్రోసెనా
విర్భవత్సామిత ద్వేషి ధ్రాగ్గర్భిణీ
గర్భనిర్భేదనో త్కంఠదీపింపఁగన్. ౩౫

క. తనరాజ్యవర్తులై తగు। మనుజులలో గల్గుపోటు • మానవులెల్లన్
వెనువెంట నంటిరాన। జ్జనపతి సంగరముసేయ • సరభసవృత్తిన్. ౩౬

వ. ఇవ్విధంబున బలసమన్వితుండై నొక్క దినమాత్రంబున శత్రుసైన్యంబు గదిసి. ౩౭

క. అరదంబులు నరదంబులు। కరులుకరుల్ హరులుహరులు • కౌతుకమలరన్
నరపతులును నరపతులును। దురమొనరించంగనపుడు • తుములంబయ్యెన్.

సీ. కుండాంచితాయసో • ద్దండ దండములచే
నెత్తులు బగులంగ • మొత్తిమొత్తి
కఠినోగ్రతరదంత • ఘట్టనంబులచేత
రొమ్ములు బగులంగఁ గ్రుమ్మి గ్రుమ్మి
పటుభయంకరకాల • పాశవజ్రములచే
వీపులు జెదరంగ • వేసివేసి
దృఢదృషత్సంకాశ • దీప్తదేహోద్ధతి
మేనులు నలియంగ • మెదపి మెదపి

# తృతీయోల్లాసము

గీ. మాలయమాళవ చోళసిం • హళసముద్ర
[illegible] • [illegible]
[illegible]ంబుగను హస్తి [illegible] సమా • లంబనంబు
దోఁచెదదధిష్ఠత వ్రజం • బేదిపోరె.

సీ. ఫాలస్థలాయఃవ్ర • భాలీన మకుటముల్
ఖడ్గధారలఖంగు • ఖంగుమనఁగ
కవచరూపంబులో • ఘనశిలాబత్తరుల్
కరవాలగతి ఘల్లు • ఘల్లనంగ
గూర్పర గుప్త్యయః • కోశముల్ మండలా
గ్రంబులచే ఖణేల్ • ఖణేలనంగ
బంధూర తరములో • స్కంధదేశంబులు
తరవారు లనుఖరీల్ • ఖరిలనంగ

గీ. హత్తుకొని మత్తులైనరా • హుత్తులడరి
సింధుకాంభోజ కురుపార • శీకవనాయు
యవనభవనసవీనవా • హములు బరపి
తుముల మొనరించి రన్యోన్య • సమతదనర

సీ. రథముల బరపిత • తృప్రథుల ఘట్టనముల
నెదురించు భటులము • జ్జదిపి చదిపి
రయముమీరగ సాంప • రాయికంబున మోహ
రింపుపాదాతంబు • జంపిచంపి
ఖురుగెలంకులనిల్చి • మర మొనర్చినవారి
సిరముల నందందఁ • జిదిమిచిదిమి
వెనువెంట నంటవ • చ్చిన శూరబలముల
మించి తచ్ఛదములఁ • ద్రుంచిత్రుంచి

గీ. యద్భుతాన్యోన్య సైన్యగ • హనము నడుమ
జొచ్చి ఘంటాపథంబుగాఁ • జొచ్చి పెరిగి
రథికు లత్యంతరణ మనో • రథికులగుచు
బవర మొనరించి రమితమ్మా • బరవసమున.

వ. ఇవ్విధంబున నుభయసైన్యంబులు దలపడి పరిఘ గదా ప్రాస తోమర భిండి
వాలాసి ముసల కణయ కంపణ భల్లాంగ చ్ఛురికా కుంతముద్గర శర చక్ర క్రకచ
పాలలాంగూలాంకుశ కుఠార శూలాది సాధనంబులం బ్రయోగింపుచుండఁ బడి

లయవిభాతి॥ పుడమి గడగడవడఁక • నెడ తేగక నిగుడఁబడి, పిడుల
నుదెగడుకడు • బెడిదమగు దంతుల్
తొడరు జడివిడి వడిన • వడువునను మిడుగురులు
గడలుకొను నలుగడలఁ • బడుకడిదిఁ దూపుల్
తడబడేక గడుసులగు నొడలనడుములఁదొడల
నడుగిడులను వెడలిబుడి • బుడివదియురక్తం
బడర తొడఁబాడుమనెడు • నుడువులను నుడువులను నుడువుచును
విడనికడిమిని జడఁ • వడబడ నేసెల్ - ౭౨

సీ. ప్రబల ముష్టాముష్టిఁ • ఘటించికొందఱు
శిరములు పరియలై • తొరుగఁ జేసి
ప్రకటఖడ్గాఖడ్గి • బచరించి కొందఱు
కరచరణంబుల • నురుమఁ జేసి
భీమ బాహాబాహిఁ • బెనఁగొని కొందఱు
కాయంబు లనుదును • కలుగఁ జేసి
చటులదండాదండిఁ • జర్చించికొందఱు
బిరుసైన విపులఁ • బెటిల మోది

గీ. పటునఖానఖి ఘనపదాపదిఁ గచాక
చిని రదారదిననిఁ జేసి • రనుపమప్ర
తాప దీపిత వీరాను • లాపములర
నుభయపక్ష బలంబులు • రభసమునను. ౭౩

ఉ. భండన భూమినిట్లు భయ • పద్ధతులేకడు నుత్సహించియు
ద్దండ పటిష్ఠతం దొడరి • దారుణయుద్ధము జేసిచేస్ని బ
హ్మాండ కటాహముల్ బగుల • నార్చిన నద్రిగృహాంతరంబులన్
నిండి ప్రతిధ్వనుల్ నిగుడ • నిర్వైరగొందిరి దివ్యులత్తఱిన్. ౭౪

వ॥ మఱియు నబ్బలంబు లుఱుపడి నొకరొకరు తమ శౌర్యంబు మెఱయ ఖడ్గంబుల వ్రేసియు, కుంతంబులం బొడిచి కుఠారంబుల నడచి వంకులం గుమ్మి శూలంబులం జిమ్మి ముసలంబుల మొత్తి పరిఘంబుల విదళించి పాశంబుల బంధించి ప్రాసంబుల హరియించి భిండివాలంబుల భేదించి ముద్గరంబుల ఛేదించి చక్రంబుల విక్రమించి తోమరంబుల నాక్రమించి మఱియు వివిధాయుధంబులం బరంగించిన విఱుగు తేరులును, యొఱంగు నేనుంగులును దిఱుగు హయములును, దఱుగు భటులునుం గలిగి విచ్ఛిన్నంబులైన ఛత్రంబులును, విదళితంబులైన కేతనంబులును విద్ధంబులైన తనుత్రాణంబులును విదితంబులైన శరాసనంబులు. విధ్వస్తంబులైన శరంబులు విగతంబులైన బాహుదండికంబులు వికలంబులైన మస్తకంబులు. విలూనంబులైన కంఠంబులు విశీర్ణంబులైన భుజంబులు విగళితంబులైన వక్షంబులు వివిధంబులైన తుండంబులు విశకలితంబులైన యూరువులు విపాటితంబులైన జంఘికలు విభ్రష్టంబులైన పదంబులుగలిగి వివ్యగ్ర్యావ్య కీర్ణ నర్తన పరివర్తన ప్రభూత భూత ప్రేతపిశాచ శాకినీ ఢాకినీ భేతాళాది గణకోలాహల రవంబులుగలిగి బహు ప్రహారణంబులవలన బుడిబుడి బడయు శోణిత ధారాళి ధారావారి పూరంబు దారుణ బాణవిలూన గజవాజి యోధ మేదోమాంస మజ్జమస్తిష్కంబు. పంకంబు. భుజంబులు. భుజంగంబులు శిరఃకపాలంబులు కమఠంబులు శిరోరుహంబులు శైవాలంబులు కరంబులు మత్స్యంబులు తురంగంబులు నక్రంబులు ద్విపంబులు ద్వీపంబులు ఛత్రంబులు ఫేనపుంజంబులు చామరంబులు మరాళంబులు. నానావిధభూషణ మణిగణ చూర్ణంబు పులినంబుగల సంగరాంగణంబు మహార్ణవంబు ననుకరించె దంభసంరంభ విజృంభమాణ ద్వంద్వ యుద్ధంబున శతాంగంబుల నిట్టట్టుసేయు మాతంగంబులు మాతంగంబులం దూలించు తురంగంబులు తురంగంబుల జెదరించు భటులును నిట్లు నిర్మర్యాదంబుగాం బెనంగు సమయంబున. ౮౫

క. మగధ మహీపతి బలమున మగటిమిగల వారలేట, మార్బలములముఁ
బెగడుపడఁజేసి తరిమిన। వగచెడి దాశార్హ సేన, వడిబరచుతఱిన్॥ ౮౬

వ॥ అట్టియెడ వజ్రబాహుండు. ౮౭

క॥ కలగిన తద్బలము సమజ్జీగోలు తలగఁజేసి నృపతి, కుంజరుఁడుచలాం, చలవృత్తి
నొంద మాగధ, బలముల జర్ఝరితగాత్ర, పరులుగఁ జేయన్. ౪౮

క॥ వెరచరని నలుగడలకున్ । బంచిన తనబలముచూచి, బాహాబలవిసు
రితుఁడగు హేమరథుఁడం । బరతల భూతలములడరఁ, బటురయమలరన్ ౪౯

క॥ హుంకృతులు సింజినీభవ । టంకృతులు సదానకరిఘు, టాసంభూతో । ద్ధీం
కృతులు భేరీకోదిత, ఘాంకృతు లడరంగవజ్ర, బాహుఁ గదిసెన్ ౫౦

సీ. వజ్రబాహుండేయు • వాడితూపులచేత
నరవరిలైపోవు • నరదములును
హేమరథుండేయు • భీమమార్గణములఁ
బరపరలైపోవు • భటచయములు
వజ్రబాహుండేయు • వరశిలీముఖముల
నట్టిట్టుబడుచుండు • నశ్వములును
హేమరథుండేయు • నిద్ధబాణంబుల
జిరజిర దిరుఁగుఁ బె • న్కరిపరములు

గీ. నిటుల నన్యోన్యబలములు ల • నేకశరము
లడరగాఁజేసి యలయించి • కడిమిమెరసి
యొకతో వజ్రబాహుఁడు • హేమరథుఁడు
దీప దివ్యాస్త్రములఁబూనఁ • దివిరి యపుడు. ౫౧

గీ. వజ్రబాహుండు విస్తార • వారిధార
వారిదాస్త్రంబు బరిగింప • భూరికోప
మెసఁగ నా హేమరథుఁడును • ద్వాత్రిమిత్రు
మారుతాస్త్రంబుచేత తన్మహిమ నడఁచె. ౫౨

క. విరసంబుమ్మరముగ భూ । వరబాణము వజ్రబాహు, ధరణీపుఁడేయన్
సరిగా హేమరథుఁడు త । త్పరిహరమై తనరుకులిశ, బాణంబేసెన్. ౫౩

క. దర్వీకరాస్త్రమపుడు సు । పర్వులు వినుతింప వజ్ర । బాహుండేయన్
సర్వాంగ హేమరథుఁడు శ । గర్వుండయి గారుడాస్త్ర, గరిమ నడంచెన్ ౫౪

గీ. వర్ణితాగ్నేయ బాణమా • వజ్రబాహుఁ
డేయ, నదిజ్వాలలలరంగ • నేవిరాగ
హేమరథుఁడంత వరుణాస్త్ర • మేసిదాని
యణఁచటడంచెను తనసైన్య • ముబ్బుచుండ.

క. చంద్రప్రకాశమునదగు • నైంద్రాస్త్రము వజ్రబాహుఁ డడరించ యశ
స్సాంద్రుఁడగు హేమరథుఁడుమ • హేంద్రాస్త్రము చేతదాని, యేపడచె వడిన్.

వ. ఇవ్విధంబున సింహంబుల చందంబున శరభంబుల పోలె శార్దూలంబులగతి వృషభంబుల విధంబున గజంబుల చాడ్పున నంతకంతకు మచ్చరంబు గ్రచ్చుకొన దివ్యాస్త్ర విలాసంబు జూపుచుఁ జెందంబు మొఱయింపుచు శరవర్షంబులు వాటింపుచు నిజబిరుదంబులఁ జాటింపుచు బోరునవసరంబున. ౫౭

సీ. చటుల భృత్యామాత్య • సహితుఁడై యవ్వజ్ర
బాహుఁడు వజ్రాధి • పతినిగిట్టి
అయిదింట గుఱ్ఱంబు • లారింటసారథి
నేడింట ధ్వజం • బెనిమిదింటఁ
జాపంబు తొమ్మిది • తూపులఁ దత్తను
త్రాణంబు దశసంఖ్య • బాణములను
నతుఁబుగాడంగ • వశనేయుటయుఁజూచి
క్రోధారుణాత్ముఁడై • యోధవరుఁడు

గీ. నతఁడు నిగుడించు శరముల • నంతకంబె
బెడిదమగు తూపుగమిచేత • నుడిపి తత్ప్ర
కార మార్గంబునకు. ప్రతీ • కారమొనయఁ
జేసి కడుమాట యుద్ధంపు • చిత్తమునను. ౫౮

క. తన యోధాగ్రణులందఱిఁ । గనుఁగొని చేవీచికడిమి • గడలుకొనంగఁద
త్స్వని శితబాణాసారము । మనువడి వారింపుచోన, మోఘాస్త్రుండై. ౫౯

గీ. స్వాతివర్షంబు గురిసిన • చందమలర
నతని యురదంబు బాణమ • యంబు జేసి

విజయ బిరుదాంక నిజయోధ • వితతిఁజూచి
విట్టుడని బరఁగ సమెచ్చ • నట్టియెడల. ౬౦

సీ. ఆహవంబున ద్రుక్కి • యలత జెందిన వజ
బాహుపై మాగధులు • పలువురేచి
* యొగ్గిబాగ వాక్యత్ర • గుదగధిష్ఠలములఁ
దవిలి శస్త్రాస్త్రసం • తతులచేతఁ
దద్దేహము సహస • ధారంధ్రముగఁజేసి
కొంద అాతసి తేరుఁ • గూల్చిరకట
గొంద అాతసిసూతుఁ • గుదియఁగ జేసిరి
కొంద అాతనివిల్లు • గ్రిందుపరచి

గీ. రెలమిఁగొందఱు తత్తూణ • మిలఁబడంగఁ
జేసిరొకకొంద అతనివా • జివజంబు
నరికి యిటువలెనారాజు • విరథుఁజేసి
పట్టిబంధించి రత్యంత • బలముమెరయ. ౬౧

చ. కలువలె బద్ధుఁజేయుటను హేమరథాధిపు యోధులెల్లఁద
స్ఫుటసచివాప్త భృత్యగణ • బాంధవులందరిఁ బారదోలియు
త్కటులయి శ్రీకావిజయ • భాంకరణంబుల శంఖ కాహళ
స్ఫుటరవముల్ చెలంగఁ బరి, పూర్ణ మనోరథులై త్రిదోషఁగా. ౬౨

సీ. మహిత చకాంచనమణి • మయము నై రంజిల్లి
కనుపట్టు ఘనశతాం • గములఁగొన్ని
దానధార సమిం • ధానగంధోల్లస
ద్బంధుర తరయూధ • పములఁగొన్ని
[illegible] కరిరత్న • పల్యాణభరవాయు
గమనంబు గలతురం • గములఁగొన్ని
[illegible] వాహకో • న్నతకాయములు గల్గి
సమదంబులైనయు • ష్ట్రములఁగొన్ని

* వాక్యప్రత్యేకయపార్శ్వదేశంబుల తా. ప్ర. (2) తద్వాహము అన్నిఁగ.

గీ. బహుళ ముక్తాఫలాంచిత • పటగృహముల
వితత సౌవర్ణ ముద్రికాం • చితవిశాల
పేటికా సంఘముల రాజ • బిరుద కేత
నాదులను గొని రత్యంత • మోదములర, ౬౩

వ. మఱియు. ౬౪

గీ. వరచు తన్మంత్రి ముఖ యోధ • వరుల మీఁద
వాయువేగాశ్వములఁ దోలి • వారిబట్టి
పాశ నిర్బంధ దేహులై • పరగ జేసి
హేమరథు మ్రోల నిడనమ్మ • హీశుఁడపుడు

గీ. వీని నావజ్రబాహుని • విరిచికట్ల
తోడ బహుళకటములతోఁ • గూడబెట్టి
తెండు మీరిపు డేమర • కుండుడనుచు
విజయ దుందుభి మ్రోయించి • వేడుకలర. ౬౬

క. నృపుఁడు చతుర్విధ సైన్య ప్రతతుని గని మనము వజ్ర • బాహుపురశ్రీ
నిపుడపహరించి యీరా జ్యపరిగ్రహణంబు సేయు • నర్హంబయ్యెన్. ౬౭

క. అనియానతి నొసఁగిన వా రనుమోదముతోడ వేగ • నుఱఁగ శుభల
క్ష్మిని దగు తత్పురవరము న్ననిలగ్గకు జొచ్చి మిగుల • కడిమిదలిర్పన్. ౬౮

హేమరథుని భటులు వజ్రబాహుని పురంబు కొల్లగొనుట.

క. వీరులు తత్పురి కావలి వారలొకించుక యు వేటు • వాటుల చేతన్
బోరగ వారలనెల్లం జీరికిఁ గైకొనక శత్రు • సేనలు కడిమిన్. ౬౯

గీ. ధనకనక వస్తువాహనా • దినిదనర్చు
వజ్రబాహుని గరిమమ్ము • వ్వరుసగాఁగ
దోచి తమతమకిష్టవ • స్తువులఁ గొనుచుః
బ్రభునియుక్తిఁ దదంతఃపు • రమున కేగి.

సీ. నవవిధ సౌనసంభవ మౌక్తికంబులు
గలుగు దివ్యాగార • ములుగలంచి
వజ్రవైడూర్యప్ర • వాళగోమేదికం
బులమించు నవసితం • బుల నడంచి
సౌవర్ణ చేలసం • చయముల విలసిల్లు
లలిత చతుశ్శాల • ములఁజరించి
రమణీయ తపనీయ • రౌప్యముద్రికలుండు
భాండాలయంబుల • బడలుపరచి

గీ. హారకేయూర మంజీర•చారుమకుట
ఘటిత పేటీభరంబుల • గాసిఁజేసి
వలసినట్టులఁ దిరిగియు • వ్యారిగాగ
నపహరించుచు రిపుసైన్య • ములరుమతిని. ౭౧

సీ. రామణీయకకన • ద్రాణివాసస్త్రీల
రాజిల్లుదాసదా • సీజనులను
జన్యస్థలమునకు • జనకశాలలనుండు
రంగత్తురంగమా • తంగములను
హరిమూర్తి విహాహి • తావివాహితనిత్య
మాన్యలై తగురాజ • కన్యకలను
పోషితవ్యక్తకా • పోతమాయూరాది
భరిత చామీకర • పంజరములు

గీ. జనమనోహర మగుమృగ • సంతతులను
మహితకస్తూరికాసంకు • మదమృగమద
ముఖ్యగంధ యుతకరండ • ములును మొదలు
గాఁగ సర్వస్వము • హరించి • కౌతుకమున, ౭౨

సీ. ద్రాక్షాఫలసమృద్ధి • తస్వాసవంబుతోఁ
జరణాయుధోపదం • శంబుగూర్చి
సహ్యాగ్రతటవరసాం • పత్త్రిధుతలతోన
జాపైత్రరంబులతో • సంగఁజేసి

మత్స్యండికాదిసం • భవమధుప్రతతితో
సచ్ఛేకతరసంబు • సంఘటించి
మహిత గంధోత్తమా • మైరేయముంగూర్చి
యాపిక పలలంబు • నావటించి

గీ. వారవనితాళి వేలాస • సంభ్రమంగ
జేసి పానంబొనర్చిరం • జిల్లువారి
బట్టుకొని పరిమదావన • ప్రముఖులను
యాపుమాపుచు నవ్వుడా • యాథజనులు. ౭౩

సీ. మర్ఘరావద్వ్యాఘ్ర, కార్భకస్త్రైణాక్షు
పాతపంకిలము నే • వట్టుజూడ
గుల్భద్వయసశ్యాత • కుంభముక్తాఫల
శార్కరిలంబు నే • చక్కగనిన
జానుమాత్రసితాభ్ర • సంకుమ దాగరు
గంధగంధిలము నే • కడదలంచ
స్కదఘ్నాధక • చణకశాలికులుద్ధ
మాషతుందిలము నే • మస్కసరయు

గీ. ఘనజనులు చూరబుచ్చిరం • కతనదత్తు
రాపణంబులు జూపట్ట • నఖిలజనుల
కెరగొనుచుంబోవ సింధుసం • భరితనివడ
మనుకరించెను వినువారి • కద్భుతముగా. ౭౪

గీ. అప్పుడా బాల గోపాల • మనక ప్రజలు
నొక్క మొగి వెరువకుజిక్కి • స్రుక్కిపొక్కి
క్రుందియాక్రంద నధ్వని • జెందియుండ
శత్రుజను లేగుచుండ త • త్సమయమునను ౭౫

మ. పరథాశ్వేభభటాళియై మగధధే • శుంబేలుచున్నట్టి హే
మరథాళిఖ్య నృపాలపాళి మిగులన్ • మత్తిల్లిదాశార్హరా

జ్యరమాధీశ్వరు వజ్రబాహునృపుఁ బ్ర • ఖ్యాతాత్ముఁ గాఁ జేసి చె
చ్చెరబంధించుక పోవువార్త మొరసెన్ • శేషించు దేశంబులన్. ౨౬

క. ఆవార్త పక రాజ్య! శ్రీవిభవసమేతరాజ • శేఖరులమహా
త్యావిష్కృతోక్తుల దరభ! యోవహాతన్ జాగరూకు•లై యుండిరోగిన్. ౨౭

వ. అట్టియెడ. ౨౮

పద్మాకరుఁడను వైశ్యుఁడు భద్రాయువు సహాయమున
—వ్రడనాభుని దండించుట.—

సీ. ఒనరభద్రాయుర • భ్యుదయాది నెఱిగిన
వాఁడొటఁ జేసియా • వైశ్యవరుఁడు
పథితారి వీరుఁడ • మ్మగధాధి నాథుఁడు
ద్వృత్తుఁడై యస్మత్స • మృద్ధిగల్గి
మించు దేశంబ్రాక • మించగలఁడువాని
విక్రమంబిమ్మహి • వీరుచేత
నడగింపఁ వలయునీ, యడ నదియుంగాక
మును బితృణము దీర్చు • కొనిననతడె
గీ. సుతుఁడుగాక తదన్యుఁడు • సుతుఁడె మఱియు
నివ్విధంబున భూపాల • కేప్సితంబు
సర్వజన సమ్మతంబునీ • శపరిసాద
లబ్ధబలుఁడీతఁ డతనిగ • లంచగలఁడు. ౨౯

మ. ఫణిహారుల్ పరదేశ వైవధికులై • ప్రస్తావనావాప్తివా
క్ఫణితిన్ మార్గగతార్య వల్లభునితో • భాషింప నాతండుత
త్ఫణితిం జెప్పిన స్ఫూర్జదూర్జితశర • త్పర్జాన్యగర్జవిజృం
భణమే పారనపాకకోప మలరన్ • భద్రాయువభ్యున్నతిన్. ౩౦

సీ. ఘనయోగి వరలబ్ధ • ఖడ్గశంఖంబులఁ
గొనిహీర కవచంబు • మునుధరించి
మణిగణాలంకార • మకుటాదులవహించి
రమ్యదుకూలాంబ • రములఁ గట్టి

పరశుపట్టసశూల • కరవాలముద్గర
ప్రాసతోమర భిండి • వాలముఖ్య
శస్త్రాస్త్రములనెల్ల • సవరించుకొనివీర
గంధమాల్యంబులు • తక్కలికఁదాల్చి

గీ. యాశ్వరాజగవసనాన • విశ్వజైత్ర
మనుశరాసన వరముద్ర • హస్త్రాస్త్రముఖ్య
మార్గణంబుల విలసిల్లు • భర్గుఁడనఁగఁ
దనరి సఖుఁడైన దర్వ్యోశ్య • తనయుఁ జూచి. ౮౧

క. ఇపుడు ధనుర్విద్యాభ్యా । స పరిశ్రమరాకుమార • చాతుర్యముతో
నుపమింప జేసి శాత్రవ। న్పపకులమును గీటడంచి • నిగుడఁగవలయున్, ౮౨

క॥ కావున నీవీయెడ, వీరా। ఫేశమ్ముబూను, నాస • హాయముగలుగన్
నావిజయమొ. నీవిజయము। గావిరరింపుమిక మైత్రి • గడలుకొనంగన్. ౮౩

గీ. అన్నను బలికిన సమకోచి • తాసమాన
భాసమాన సముద్యచ్ఛ • రాసమాన
నీయ బాణప్రసాధన • నియతుఁడగుచుఁ
దద్వధోత్సాహ పరతచే • దగిననగుచుం. ౮౪

సీ. ఋషభ యోగీంద్రము • హేశ్వరాంఘ్రులముందు
స్వాంతంబులోపల • సంస్మరించి
మాతృవందనముతో • న్మాని తాశీర్వాద
మొంది వైశ్యాధ్యునా • నంద మొనసి
బహుమంత్రపూర్వక • ప్రహరణంబులనూరి
మంతంబు లైకనం • బడివెలుంగ
వనఘుఁడై రంజిల్లు • సునయుఁడవ్విధమున
బొలిచినవారిన • స్ఫురజనమ్మ

గీ॥ లలరి శత్రులం గెలచి మీ • రతిరయమున
రావలయునని దీవింప • భావజారి
కవచ సామర్థ్య యుక్తవి • క్రమధురీణు
డైన భద్రాయువవ్వేళ • హర్షమెసఁగ. ౮౫

శా. ద్రాఘిష్ఠప్రతిఘాతఘాతవిధిసం • ధానోన్మనీషామహా
శ్లాఘామోఘజవప్రభావవిలస • చ్ఛౌర్యంబునన్ స్వీయధా
రాఘోట్టాణము నెక్కి దివ్యబలధా • రంధర్య ధుర్యుండునై
మేఘాడంబరశంబనిస్వనసము • న్మీలద్రవారంభుఁడై. ౮౬

క. వినయంబుతోడ సునయుఁడు ఘనతర కాంభోజఘోటకము నెక్కి యతిశో
ధనుఁడై తగు భద్రాయువు వెనువెంటను రాఁగ దివ్య • విభవంబలరన్. ౮౭

వ. ఇట్లు త్వరితగతిం జనుదెంచి. ౮౮

సీ. అశ్రుతబ్రాహ్మణం • బజ్ఞాతపార్థివం
బవిదితార్యంబగు • ద్ధ్వాంత్యవర్ణ
మాహృత ధనధాన్య • మార్ద్రసత్కంఖాణ
మాస్థలద్గజబృంద • మావిలూన
రథసంఘ మాధ్వస్త • రథ్యారథ రాజాత
నాభమచ్ఛేకంబు • నాపతధ్వ
జవ్రజం బభిన్న • సౌధాగ్రమాంగళ
తోరణం బాకృత్త • దుందుభియును
గీ. గలిత తత్పుటవరరాజ • కంబుసప్ర
థాసమావర్జితపదాతి • మానమగుచు
దుర్మదాహృత శేషవ • స్తువులు నిటుల
గాసిఁజెందె కనంబడ • కనికరమున. ౮౯

శా. కంఠేమత్సుఖ, యస్మదీయ పితృసో • త్కంఠాఖిలశ్రీపురీ
లుంటాకప్రకటప్రతాపమనని • శ్లోకంబు గావించిపె
న్పంపై హేమరథుంకు పోవఁగలఁడే • బాణానలజ్వాలలో
కప్పుటల్ చేయుచుఁ దద్బలేంధనము వే • కన్పండగాఁ జేసెదన్

చ్ఛందంబునఁ గార్చిచ్చుఁ గాదిసిన చందంబున నింద్రజాలంబు జూపిన యేపున మాయఁ గావించిన పగిది మంత్రించి పడవైచిన గతి విపక్షబలంబును గనుపుగొట్టఁ దనిమసంగి ప్రళయసమయసమారంభ సంరంభ జృంభమాణ వరాశాంభవీని టల తటస్ఫుటిత కీలికలాపం బనం దనరి యమ్మహాత్ముండు మందస్మిత వదనారవిందుం డై. ౯౫

శా. పూజ్యప్రాజ్య విభావిభాకరములై • పుంఖానుపుంఖంబులై
సజ్యీప్రాసనముజ్ఝితంబులగు నా • శస్త్రంబులన్ సంప్రహా
రేజన్ పత్రిలు శత్రుసంచయములన్ • హింసించి తద్రక్తపూ
రాజ్యోద్ధార్చిరవక్రవిక్రమశిఖిన్ • హర్షంబు నొందింపుచున్. ౯౬

చ. దుర మొనరింపు శాత్రవుల • తోరములై దగు మేను లెల్లఁ జ
ర్ఝరములై దలిర్పఁగను • సాయకముల్ పరగించి మించి దు
ర్భరతర శాతహేతుల, న • పారవిరోధి పరార్ధ్య నీశభీ
కరకర పాదమస్తకని • కాయములం దెగటార్చి పేర్చుచున్. ౯౭

వ. మఱియును. ౯౮

ఉ. ఆశుగవేగతో మరిగ • దాసిపరశ్వథ • చక్రకుంత ది
వ్యాస్త్రశుగ ముద్గరాది నిజ • హంబుల ముఱ్ఱిగుడింపుచున్ ధనుః
కాశల మేర్పడన్ భయద • కాండము నొక్కటి నేర్చి సంగరా
భ్యాశభటాళిమీఁద నెగ • శాపెఁ ణిక్రుత్తుఁ డిచ్చమెచ్చఁగన్. ౯౯

చ. పొదఁదగఁ గోలఁ బూనుటది • పొందుగ వింటఁ ఘటించుటంతలో
నెదిరిన మార్బలంబుపయి • నేయుట వారనిలోనఁ గూలుటల్
మదవదరాతి భంజనుని • మానసమొక్కటె రుంగు గాక వా
నిదురము జేయు నేరుపు ఫణి • ప్రభుకైన వశంబె యెన్నఁగన్.

గీ. పదియు నైదు రెండు • పరగంగ నొక్కటి
యెదురు లేని తూపు • లేర్చిఁ పుల
బనిపదుల నివేయు • బదిసహస్రంబుల
లక్షదును మహస్ర • లాఘవమున

వ. అట్టియెడ.

ఉ. ఈసున శత్రుసైన్యము ల • నేకములై తగు సైనికోత్తముల్
చౌపటమై మెలంగఁ బటు • భల్లసమూహము లుల్లసిల్లఁగఁ
వేసియు డాసియుం బరగ • విచ్చియు నొచ్చియు మచ్చరంబుతో
గాసిఁదలిర్ప నిప్పగిది • కయ్యముదయ్య మిరుంగఁ జేసినన్ ౧౦౩

చ. అనువుగ వారుబట్టిన శ • రాసన బాణ కృపాణ తూణముల్
తునుకలుగాఁగఁ జెట్టిదపు • తూపుల నేయుచు వారివర్మముల్
దునిమి తదంగ కంబులను • దూరగ ఘోర తరాశుగంబులన్
జొనుపుచు రక్తపూరములు • జొబ్బిలఁ జేయుచు కౌతుకంబునన్ ౧౦౪

క. గంధేభగమనుఁడరి ని ర్గంధన మొనరించి కార్ము • క ప్రోద్ఘుతగో
గంధన సఖవిసిఖా సంధానితఘనగవేణో నర్చఁ • జతురిమ మెరయన్. ౧౦౫

వ. అప్పుడమ్మాగధ బలంబులు, ౧౦౬

చ. తమతమ దర్పమేర్పడ మ • దంబున గొల్లలఁ జేసి సంభ్రమ
భ్రమితమ దేభ ఘోటభట • పంక్తుల నేరుపుచేఁ బ్రచక్రసూ
ద్యమమలరంగఁ జేయుచు య • థావిధిగా మొనలేర్పరించి, భూ
రమణునితోడ శత్రులుదు • రంబొనరించిరి పేరువాడుచున్. ౧౦౭

గీ. అట్టి సమయంబుఁ జూచివై • శ్యాగ్రగణ్య
సుతుఁడు భద్రాయుఁ గనుచునో • శూరవర్య
ఘనగదాయుద్ధ నైపుణి • గలదు నాకు
చూడుమని వాహనము డిగ్గి • స్ఫురణ దనరి. ౧౦౮

వైశ్యసుతుఁడు హేమరథు సైన్యంబుతో గదాయుద్ధంబు సేయుట.

ఉ. దండధర ప్రచండతర • దండసమానమునైన పెన్గదా
దండముఁ గేలఁబూని, భుజ • దర్పమెలర్ప నిజాంగకప్రభా
మండల మానదేశమున • మార్బలముల్ గని భీతి జెంద ను
ద్దండ పటుత్వమొప్పఁ బ్రవి • దారణ మునిఁ బొల్చి నిల్చినన్ ౧౦౯

క. తనిసుగథాధీశ్వరమి। త్రనివహమధ్యమున శూరుఁ డా ధన్యుండనువాఁ
డనుపమ బలదర్పోద్ధురుఁడన। అనవరకింపుగ నుగ్రదవ । సంగరానివచ్చెన్. ౧౧౦

వ. ఇట్లువచ్చిన యవ్వైశ్యనందనునకు నభిముఖుండై. ౧౧౧

మ. సమదాటోపతవార లిర్వురుజయేచ్ఛన్ జేరుచో మండలఁ
భ్రమణంబుల్ బటుసింహ చంక్రమణముల్ పాటిల్ల నుద్యద్గదా
సమిదారంభ విజృంభితోభయగదా సవ్యాపసవ్యప్రభా
రమలం జిప్పాదు లుప్పతిల్లభయదా రావంబు సంధించుచున్. ౧౧౨

వ. మఱియు హరిగతి గజగతి వ్యాఘ్రగతి, మహిషగతి, జంబుకగతి, మర్కటగ
తి, మార్జాలగతి, హరిణగతి, చటకగతి, తాండవగతి, మొదలగు ద్వాదశగ
తులు జూపుచు పరిభ్రాంతంబు నావృతంబు నావిద్ధంబు నాపాతంబును విభ్రమ
ణంబును మానుషంబును నిర్మర్యాదకంబును జితప్రకంబును భిన్నంబును సవ్య
కరంబును దుంగబాహువు నాత్రపృష్ఠప్రహారంబు వేల్లితంబును గురించితంబు
నుప్పస్తికంబును మొదలగు ద్వాత్రింశత్ప్రకారంబులఁ బచరింపుచు. ౧౧౩

ఉ. మొనలు గనుంగొనంగఁ దల ముప్పిరిగాఁగఁ దియంగఁ జుట్టి నె
మ్మనములఁ గోపముల్ గదుర మర్మవిభేదన మాచరించు నే
ర్పున బహువిచిత్రమార్గముల మూపుల వీపుల మోదిమోది తెం
పొసరఁగ నేదదీర్చుకొన కోపమువైపున నేపుజూపుచున్. ౧౧౪

శా. పాదద్వంద్వ సమాహతిం గలహభూభాగంబు గంపింపఁగాఁ
బాగుల్ దద్భరమానిఖేదమున ని ర్వ్యాపారులై యుండ బె
న్వేదండంబులు సింహముల్ శరభముల్ ద్వీపుల్ మహాభంబులున్
భేదంబొందుచు కేక పోరుగతిని రీతిన్ విజృంభింపుచున్. ౧౧౫

వ. ఇవ్విధంబున. ౧౧౬

మ. చలవాదంబులరన్ స్వసంభృతగదా సంఘట్టనప్రోజ్జ్వల
జ్వలనజ్వాల భవస్ఫులింగములచే సంగ్రామరంగస్థ

స్థలదుర్వ్యేషణు లొక్కపెట్టునఁ గలంగఁ గంబార తద్గాత్రముల్
శలభాభంబులఁ జేసి కాల్చి నిధన స్థానంబు నొందించినన్. ౧౧౯

క. ఇనతనయుఁ డివ్విధంబున। తననెచ్చెలియైన వైశ్య తనయుఁ డుఁ గోరన్
గనినీవు విశ్రమింపుము। నని గనుగొను యుద్ధమిపుడొ నర్చెవననుచున్.

—రెండవతూరి భద్రాయువు శత్రుసైన్యంబుతో బోరుట—

ఉ. చండతర ప్రభావిభవ శాతశరంబుల నేర్చిపేర్చి దో
ర్మండల కుండలీకరణ మండితచాపలతా విశేషుఁడై
ఖండనభూమి శాత్రవుల భల్లముఁ దెగటార్చి యారెనా
ఖండల దివ్యముఖ్యులును కౌతుకమానసులై కనుంగొనన్. ౧౨౦

వ. అట్టిసమయంబున భీషణహేషావిశేషరంగదుత్తుంగతరంగసన్నిభంబులగు తు
రంగంబులు ప్రావృట్సమయోచిత పర్జన్య గర్జావిజృంభణ శుంభచ్చతుర్దంత
కాంతంబులగు దంతావళంబులు దీర్ఘఘుర్ఘురసినదావక్ర చక్ర సుందరంబుల
గు స్యందనంబులును చటులాయుధ పటల సముద్భటులగు వీరభటులును; ని
జాధిపతి పనుపున నడువ దచ్చతురంగ బలపదాఘాత భూతల సముద్భూత
ప్రభూత ధూళిపాళి పిహిత కాంతిగలిగి మార్తాండ మండలంబు కళలఁ దొలఁ
గ విశ్వవిశ్వంభరాతలంబు తిమిరమయంబై వెలుంగ ప్రతిపదవాద్య మా
నొద్యద్భేరీ పటహఢక్కా కాహళ ఝల్లరి మర్దలాది వాద్యవిశేషంబులు
మ్రోయ తత్పరాగ భరంబున మునింగి యొకరొకరు నెఱుంగక పేరెలుగుల
మెలంగుచు కనకమణి మయంబులగు తమతమ ధ్వజంబులు గుఱుతుగ
కూట యుద్ధంబునకుఁ జొచ్చి భిండివాలమండలాగ్ర
భల్లరాచకోపాణ నఖరప్రముష్టి ముద్గర శూలముసలభుసుండి
క ప్రాసప్రకూర్మశంపనగద కుఠారోద్దండ కణయకుంత పరశుచక్ర పరిఘప
టపంబులను వంకిణి సబళంబుల సెలకట్టెల చిఱుతచేయమ్ముల గొరకలు ను
రియులు మొదలగు బహువిధాయుధంబుల నారాకుమారుంగప్పుచుఁ గది
యంగసంగొని. ౧౨౧

క. ఆరథికులలోనొక్కఁడు। హారథుఁ డెదుటన్ వసింపక నతిజవమున నా
త్మాశ్రహాధహయము డిగి గరు। డారయముసఁ దద్రథంబు నందుచుకడిమిన్.

గీ. సుసితాస్త్రంబుచే వాని • సూతుఁదునిమి
తద్రథికు శిరమొక్కన • స్త్రమున నరికి
తామహారథుఁడై యుండి • తనదుసఖుని
సారథిగఁజేసి వరశరా • సనముఁబూని. ౧౨౩

వ. అట్టియెడ. ౧౨౪

ఉ. దారుణవృత్తి మాగధులు • దగ్రతసారథి కాధ్యు తేరుదా
సేరుచువచ్చి హెచ్చియిరు • గ్రేవలఁ గ్రిందను వెన్క ముందరన్
నేరుపుమీరనిల్చి యతి • నిష్ఠురశస్త్రములేసి రుజ్వల
ద్వారిధరంబు లొక్కమొగి • వారికణంబులు రాల్చుకైవడిన్. ౧౨౫

వ. ఇట్లు గదిసినం గనుంగొని.

సీ. ఆమహారథికుండు • వామదక్షిణపాద
జలజముల్ సవ్యాప • సవ్యములుగ
సాచిపార్శ్వద్వయీ • సంచరత్పంచక
శూరవర్యులముందు • స్రుక్కఁజేసి
సమముగాఁ బదపద్మ • యమళంబు నియమించి
చరమభాగస్థాస్ను • వపులనడఁచి
మంథానదండసం • భ్రమణంబు నొందించి
యగ్రతస్ఫురనవ • త్నాళిఁగలఁచి

గీ. యంఘ్రి సరసిరుహములనా • యామములుగఁ
జేసి తనతేరుక్రిందటఁ • జెలఁగుచున్న
బలువిరోధి వరూథినీ • ప్రభులదోఁచె
భూరిశరములచేత న • ద్భుతనియతిని. ౧౨౬

కం. సమరథికప్రత్యాలీ • ఢమునాలీఢంబు మునుగ • డకొనుచుండన్
సమపాదమండలంబున • కమనీయస్థానవాచ • కంబునబోరెన్. ౧౨౭

వ. ఆయెడ. ౧౨౮

ఉ. కొండల మందకప్పగర • కూటవకూట విధంబుదోపగా
వండడిగాఁగ గూడి శర • జాలములన్ నిగుడించి మించనా
నండడి కయ్యమియ్యకొని • శౌర్యధురంధరుఁడైన రాట్సుతుం
డెందును జూడఁదానగుచు • నేవడిచెన్ రిపుకోటి నయ్యెడన్. ౧౩౦

వ. మఱియును, ౧౩౧

చ. సొగసగు కెంపుసొంపుగల • చూపులఁ బుట్టిన కోపవహ్నిఁ గ్రొం
బొగ లెగయంగ కాదరస • పూజ్యతరాజ్యము చేతఁ బైపయిన్
నెగడఁగఁజేసి యానున న • నీకచరారులమీద దీపితా
శుగమర్రి, బోసియేయనది • సూరెలముట్టి దహించె వేల్మిడిన్. ౧౩౨

ఉ. ముక్కులు జెక్కులుం జెవులు • మూపులు వీపులు జానుజంఘులున్
బక్కలు డొక్కలున్దలలు • ఫాలతలంబులు రంబులూరువుల్
వెక్కసపాటొనర్చు శర • వేగమెలర్పఁగఁ జెక్కుచెక్కగాన్
జెక్కుచు నుక్కడంచె రిపు • సేనల గక్కున నుక్కుమీరగాన్. ౧౩౩

వ. ఇవ్విధంబున నయోధ్యాధవరుండు లయకాల కాలగళాభీలాలిక కీలికీలా కలాపంబు మెరసిన తెఱంగునఁ గాండప్రకాండంబులు నిగుడింపుచు నిజబలంబులఁ గసిమెసంగినం జూచి కోపాటోపంబున హేమరథుండుడగ్గరి. ౧౩౪

మ. విలసచ్చాప విలానకౌశల పటూ • విఖ్యాత తేజంబుతో
బలవద్బాణ పరంపరల్ గురియఁద • ద్బాణంబు లావ్యోమభూ
తలమార్గంబులఁ బర్వివైరి జనసం • త్రాసంబు నంజొల్పియు
జ్జ్వలుఁడౌ రాసుతుపై పయిన్నిగుడెగీ • ర్వాణోత్తముల్ భీతిలన్. ౧౩౫

వ. ఇట్లు నిండిన, ౧౩౬

సీ. అమ్మహా వీరాధ్యుఁ • డాశీవిషాభంబు
లైన హేమరథుఁడేయు • నస్త్రములను
దిలలంతలై పోవ • దీవ్రాశుగంబులఁ

పరగించి తచ్ఛత్రు • బలములెల్ల
జర్ఝరితాంగులై • సమరవిద్రావంబు
నొందంగఁ గుందించి • డిందుపరచి
ఛండకుండాకాండ • హిండితాంచితభుజా
దండకుండలితకో • దండమలర

గీ. సర సకరపద్మ సవ్యాప • సవ్యముక్త
నిబిడఁశిత శిలీముఖ • నికరములను
సమర సమయసముద్భూత • సాహసప్ర
తాపదీపితుఁడై రణ • స్థలినిగుడ్చె.

౧౩౭

వ. ఇట్లు నిగుడించి వేఁడిమిఁజూపిన.

౧౩౮

మ. జ్వలనాస్త్రంబరిపోసి హేమరథుఁడా • శర్వప్రసాదోజ్జ్వల
ద్బలవద్వర్మ మహాప్రభావుఁడగునా • భద్రాయుపైనేయది
కీలలునిండన్నిను మంటమింట నెగయన్ • ఘోరస్ఫులింగావళుల్
గలయంబర్వఁజటచ్చటార్భటులును • నన్పట్టగావచ్చినన్.

౧౩౯

సీ. ధళధళద్దీప్తిసం • ధానా చిరప్రభా
దూరస్వ గాఢాంధ • కారమగుచు
ఘుళఘుళధ్వాన ని • ర్గళిత నిర్ఘాతాప్తి
బధిరీకృతాజాండ • భాండమగుచు
ఫెళఫెళ స్వానగ • ర్భిత నిష్ఠురార్భటీ
స్తనితభీయాభవ • త్సర్గమగుచు
గళగళన్నాదసం • కలిత కూలంకషా
పూరితాకూపార • వారియగుచు

గీ. ఝుళఝుళ స్వనభేదసం • జాతధూత
వారిధారాళ ధారాను • కారిఘోర
వారి వాహంబుజనియించు • వారిదాస్త్ర
మేసి భద్రాయుఁడన లాస్త్ర • మిలగలంచె.

౧౪౦

# తృతీయోల్లాసము

ఉ. భూధర బాణమా మగధ • భూధవుఁ డేసిన సర్వలోకసం
బాధకరంబుగాఁగ బహు • పర్వతరూపము దాల్చి యప్పుడా
యోధన భూవిజృంభితజ • లోద్ధత రాట్సుతు మీఁదఁ బెన్శిలా
సాధనముల్ నిగుడ్చుచును • సత్వరవృత్తి • గడంగ నయ్యెడన్. ౧౪౧

సీ. భద్రాయువంతటి • ప్రాంబై దనర్చిన
దంభోళిశస్త్రము • ధాటి నిగుడ్చ
పవికోటి శతకోటి • యై తేజితస్వీయ
ధారాప్రభాధాళ • ధళ్యమొనయ
చటులమాగధసము • త్సర్జితాస్త్రంబుపై
నిగుడి మున్నెన్నంట • నెగయుచుండ
గండశైలములతోఁ • గదియంగ తత్పత
[illegible]ముల దచ్ఛిలాదుల • ముద్దురించి

గీ. గిరులఁ దరులఁ బడు ద్యుద్ధ • హరుల గిరుల
[illegible]రుల గిరులఁ దదుద్యాన • తరుల నిరుల
మూలహీనంబులై పోవ • నేల గలిపి
చనియె శత్రుబలంబులు • సంచలింప. ౧౪౨

శా. బ్రహ్మాస్త్రంబు రిపోసి యేసినపుడా • ప్రత్యర్థినాథుండు నా
బ్రహ్మాస్త్రంబు భయంకర ప్రపంచము భయ • భ్రాంతిస్థితిన్ జెందఁ నా
జిహ్మప్రక్రమునై జసైన్యము నుతుల్ • సేయంగ సాటోపర
బ్రహ్మేశాన వరప్రసాదుఁడగు నా • భద్రాయుపై నల్కతోన్. ౧౪౩

శా. ఆవేళన్ శివవర్మధారియగు భ • ద్రాయుర్మహావీరుఁడా
ద్యావాభూములు ఘూర్ణిలన్ నిగుడు బ్ర • హ్మాస్త్రంబుపై దోర్బలా
సావిర్భూత కుతూహలంబడరఁ • బ్రత్యస్త్రంబు చేదానిని
ర్జీవంబై దనరంగఁ జేసె సురలా • శీర్వాదముల్ సేయఁగన్. ౧౪౪

సీ. ప్రబల మాగధుఁడంత • బహుళమాయోపేత
రాక్షసాస్త్రంబేయ • రయము మీఱ
నతిఘోర శరభసిం • హవ్యాఘ్రసూకర

వుండు పోనీకుండని యార్పులు పెడబొబ్బలు సలుదలు నింగిముట్టంజేయుచు బరిఘాది సాధనంబు లడరింపుచుం గవిసినం గనుంగొని. ౧౫౧

గీ. ఇటులఁ దనుఁజుట్టుకొన్నట్టి ♦ చటులశౌర్య
ధుర్యులగు శాత్రవులఁ జూచి - ధైర్యశాలి
యైన భద్రాయుఁ డతికరు ♦ ణార్ద్రదృష్టి
దనర హింసింపఁజాలక ♦ తడయకపుడు. ౧౫౨

శా. అంభోజప్రభవాండముల్ బగులమా ♦ ద్యచ్ఛాత్రపాలంభసం
రంభారంభ విజృంభమాణ విలయా ♦ భ్రధ్వాన వద్భాంక్రియా
స్తంభీభూత జలేంధనాగ్నిభయకృ ♦ త్సన్త్రాణ వాగావకృ
చ్ఛుంభచ్ఛంఖము నెత్తె రాట్సుతుండువి ♦ స్ఫూర్తి ప్రభావంబునన్. ౧౫౩

సీ. అట్టిశంఖారావ ♦ మాత్మవ్రాతృత్పుటములు
భేదిల్ల నత్యంత ♦ భీతినొంది
ఘోటకరథరథ్య ♦ కూబరాన్వితులై వి
సంజ్ఞచే భూమిపై ♦ జచ్చినటుల
బడి మూర్ఛనొందినఁ ♦ బరగఁ గన్గొనిదయా
ళుత్వంబుతోనరి ♦ జిత్వరుండు
వీతాస్త్రశస్త్రిల ♦ విగతవాహనులను
నష్టచేతనులను ♦ నయవిధిజ్ఞుఁ

గీ, డగుటచేఁ జంపరాదని ♦ యాత్మనరసి
హర్షమెసఁగ రథావరో ♦ హణమొనర్చి
సునయుగన్గొని పాశబం ♦ ధనమునొందు
మజ్జనకుని గనుంగొను ♦ మాన్యచరిత. ౧౫౪

లవంతమైనసర్పము। చలిచీమలచేతఁజిక్కు ♦ చందంబునఁదా
యుత్తుడయ్యెను శాత్రవ। బలములచేఁ బడియెదైవ♦బలరహితుండై ౧౫౫

గీ. అదియుగావునఁ దొలిబాము ♦ లందుఁజేయు
పాపపుణ్యము లనుభవిం ♦ పకతొలంగ

వెంతవారలకైన ము ♦ న్నదినిజంబు
వీరి విడిపించుటేకీర్తి ♦ విభవమొసఁగ. ౧౫౭

భద్రాయుఁడు హేమరథుని జయించి జనకుని విముక్తుని గావించుట

వ. కావున జననీజనకులు బంధనంబుల విడువుమనిన నతండట్లు జేయుట. ౧౫౮

క॥ బాధాసంయుతకన్యా, గోధన ధానాద్యబాల ♦ కుల,ముందుగసం
భాధంబు నొందకుండయు,శోధనుఁడగు రాజసుతుఁడు ♦ సుఖులుగఁజేసెఁ

గీ. మఱియు దక్కినబాంధవా ♦ మాత్యమిత్ర
భృత్య భటదాసికాదుల ♦ వేరువేర
విడువ నియమించి క్షణమాత్ర ♦ వివశులగుచు
మూర్ఛఁదేరిన శాత్రవ ♦ ముఖ్యులరసి. ౧౫౯

మ. అవినీతాత్య వరోధకాంతలఁ దదీ ♦ యశ్రీమనోమారుతో
జ్జవవద్ఘోటకముల్ గిరీంద్ర సదృశ ♦ స్తంభే రమంబుల్సువ
ర్ణవిధానేక శతాంగముల్ సురుచిర ♦ ప్రాయస్థదాసీతతిన్
వివిధాలంకరణంబులం గొనుచును ♦ ద్వేగంబు వాటిల్లఁగాన్. ౧౬౦

మ. విరథుండై తగినట్టి హేమరథుని ♦ ర్వీర్యుఁడునై యుండ దు
ర్భరపాశంబుల బద్ధుజేయుచును ♦ త త్ప్రాణప్రియా మాత్యాత
త్పరసేనాధిప నాయకావళిని ము ♦ న్బంధించి యున్మ్రుక్తుతా
నురుమంత్రీశుల డాపునన్నిలపి యు ♦ య్యుర్వీశ పుత్రుండొగిన్ ౧౬౧

క. ఓమంత్రులార, యిపుడీ హేమరథాదులను గొనుచు♦హితవర్తనతో
మీమీ పురముల కరుగుఁడు సామంతులతోడ ననిన ♦ సంభ్రమమలరన్.

చ. ప్రతిభట సంహతిన్ మునుప ♦ రాజితులై తగు మంత్రినాయక
ప్రతతులు, యోధముఖ్యులు, వి ♦ పద్దశలేక, పునస్సజీవన
స్థితులయి రా కుమారుని, ను ♦ తింపుచు విస్మయ మానమానసా
న్వితులయి వజ్రబాహుకడ ♦ నిల్చిసమాహిత చిత్తవృత్తిచేన్

సీ. ఓ రాజ ♦ వినుమిమ్మ ♦ హా రాజ తనయుండు
భూమిఁజూడఁగవచ్చి ♦ పొదలుచున్న
యింద్రుఁడో చంద్రుఁడో ♦ యినుఁడో యుపేంద్రుఁడో
తెలియంగవలవదీ ♦ తెఱఁగుమనకు
మనమహాభాగ్యంబు ♦ మనతపఃఫలమెన్న
నాశ్చర్య మయ్యెనీ ♦ యవనిలోన
ధన్యుఁడై తగినయీ ♦ ధరణీశ సుతునిచే
విజితులై రిపులెల్ల ♦ వెగడుపడిరి

గీ. చెలఁగి, యితఁడు మహాయోగ ♦ సిద్ధుడేమొ
మఱి తపస్సిద్ధుఁడో లేక ♦ సురవరుండో
కానిచో నీయమానుష ♦ విక్రమితని
చేవిజృంభించునా ♦ యింత జెప్పనేల? ౧౬౧

గీ, ఇతని జననీజనకులము ♦ న్నన్ని చూడ
పార్వతీ పరమేశ్వరు ♦ లుర్విలోనఁ
నిముషమాత్ర శత్రుక్షోహి ♦ ణీబలంబు
బలవదాశుగముల బయ ♦ ల్పడనడంచె. ౧౬౨

అని బహువిధంబుల స్తోత్రంబులొనరించి ౧౬౩

గీ॥ ఇవ్విధంబున నత్యంత ♦ హృష్టు లగుచు
మహామహాశ్చర్య సంయుతా ♦ మాత్యవరులు
తో షమలరంగ వరమహా ♦ త్మునఁడవటంచు
బలుకుచుండంగ నమ్మహా ♦ భావుఁడపుడు

సీ॥ విస్మయానందాను ♦ విద్ధుఁడానందాశ్రు
పిహితాక్షుఁడును ప్రేమ ♦ విహ్వలుండు
నై నట్టి జనకున ♦ భ్యర్ణమానటఁజేరి
దండ ప్రణామముల్ ♦ దగ నొనర్చి
నా రాజు ప్రణయార్ద్ర ♦ నభివాదన మొనర్చి
ధన్యునిఁగని గాఢ ♦ తరముగాఁగ

బరి రంభణ మొనర్చి ♦ బంహిష్ఠ మోహంబు
నొనరంగ నిట్లను ♦ నో కుమార

గీ॥ నడువు దేవుడవో మను ♦ ష్యుఁడవో లేక
పురుఁడవో పరమేష్ఠివో ♦ హరివొ తలఁప
నీదు జననీ జనకులెవ్వ ♦ రేది దేశ
మేది నీనామము వచింపు మిద్ధ చరిత. ౧౬౮

సీ॥ ప్రత్యర్థి వర్యనం ♦ బద్ధులై విద్ధులై
హత తేజులయి మృతు ♦ లట్లు యుండు
ధీరాభవదమాత్య ♦ భృత్యాదుల సపుత్ర
పత్నుల గాఁదయా ♦ పరుఁడవగుచు
విడిపించితివి మహా ♦ వీర్యాధై ర్యోజ్జ్వల
తేజోబలోన్నతుల్ ♦ తేజరిల్ల
నీ విక్రమ క్రమం ♦ బెట్లు నీకు ఘటించె
మహిత దేవాసుర ♦ మానుషాత్త

గీ॥ మైనలోకత్రయముఁ గెల్వ ♦ నలవుఁ జలము
గలుగజాలిన నీవంటి ♦ ఘనుని ఋణము
దీర్చుకోనలేను ధరస, ముత్తిలసహస్ర
జన్మములకైన దివ్యతే ♦ జప్రదీప్త ౧౬౯

సీ॥ లగునిదం పుత్రమి ♦ త్రకళత్ర పూజ్యరా
జ్యపురంబనకు సర్వ ♦ మలర విడచి
ఘనమదీయాంతరం ♦ గమునిచ్చు నీయందఁ
బ్రేమబంధంబునఁ ♦ బెనఁగదలఁతు
ననఘవచోయుక్తి ♦ ననువదింపుము నేడు
కడుమత్ప్రియంభావు ♦ కుడవు నీవె
యలరు మదీయశు ♦ ద్ధాంతకాంతలనెల్ల
త్వాతధీనత జరింప ♦ దలఁతునిపుడు

గీ॥ తవిలినీవు జితేంద్రియ ♦ త్వమున నునికి
తోచె నామడిగానసం ♦ తోష మొదవె

సర్వము వచింపుసను నీవు ♦ నిర్వహింపు
దేవుఁడవుగాక పరుఁడవే ♦ ధీరవర్య. ౧౭౦

క. అని యివ్విధమున జనపతి। వినయంబునఁ బల్కి ధైర్య ♦ వీర్యఘనుండ
జ్జననుతుఁడగు భద్రాయువు। ననువొందగ నిట్టులనియె ♦ నందఱువినఁగన్. ౧౭౧

సీ. ఇతఁడు వైశ్యసుతుండు ♦ కుతలాధినాయక
సునయాఖ్య మత్సఖ ♦ స్ఫూర్తిఁబొందు
సేనితనింట వి ♦ నీతమజ్జననితో
సతతంబు వర్తింతు ♦ సౌఖ్యగరిమ
భద్రాయురాఖ్యచే ♦ బరగుచు వర్తింతు
వెనుక వచింతు మ ♦ ద్వృత్తమెల్ల
ఘనమదంబున నిన్ను ♦ గాసినొందించిన
పరిపంథి బలమెల్ల ♦ బడలువడియె
గీ. మునుసభృత్య సుహృన్మంత్రి ♦ ముఖుఁడవగుచు
నిజపురంబు ప్రవేశింపు ♦ నిర్భయముగ
శత్రుసాధ్వస మొక్కింత ♦ సరకుగొనక
నమ్మదంబున వసియించు ♦ జనవరేణ్య ౧౭౨

మ. అదియుంగాక మదంచితాగమనప ♦ ర్యంతంబు దుర్బుద్ధిభా
జ్మదమత్తాఖిల శత్రుతాచరదధ ♦ ర్మప్రత్య నీకావళిన్
వదలంబోవక బంధనాలయములో ♦ వర్తింపగాఁ జేయుము
ద్యదయప్రాప్తిని నేనుఁబోయెద మదీ ♦ యాగారముం జేరఁగన్. ౧౭౩

గీ. విశ్వజననాది హేతుత్వ ♦ విభవమొందు
నమ్మహేశ్వరు కరుణనా ♦ యందుఁగలదు
గాన శాత్రవులఁ, దృణాయ ♦ మానముగను
జేయఁజాలిన నేగల్గఁ ♦ జింతవలదు. ౧౭౪

మ. అని యీరీతినిఁ బల్కి యానృపతిము ♦ ఖ్యాజ్ఞప్తిఁ బెన్పొందినం
జనితానంద మమందమై నిగుడసౌ ♦ జన్యాత్మ భద్రాయుఁడా

వ. నరేంద్రా; యమ్మహానుభావుండు శైవనరపతి శిరస్సమాభ్యర్చిత శాసనుండై పాకశాసనుండనందగు గరతలోపలక్ష్యమాణ శంఖ చక్రలాంఛనుండై చక్రధరుండ నందగు, నిర్జితమన్మథుండై హరుండనందగు విమానాహితరాజహంసమండలుండై కమలసంభవుండనందగు లక్ష్మీజనకుండై సముద్రుండ నందగు ననవరత ప్రవృత్త దానార్ద్రీకృతకరకమలుండై దిగ్గజంబనందగు మహైశ్వర్యంబులకుఁ గర్త సకలశాస్త్రంబుల కాదర్శంబు మిత్రమండలంబునకు దయాశైలంబు నహితజనముల కుత్పాతహేతువు సాహసికులలో ధౌరేయుఁడు, వినతానంద జనకుండై వైనతేయుండనందగు చాపకోటి సముత్సారిత సకలారాతి కులాచలుండై వైన్యుండనందగు నతని జన్మక్రమంబు తెలియంజేసెద నాకర్ణింపుము. ౧౮౧

శివయోగి చంద్రాంగదునకు భద్రాయువు జన్మాదికము చెప్పుట

సీ. అధిప, దశార్ణదే ♦ శాధినాథుఁడు వజ్ర
బాహుండనెడు నొక్క ♦ పార్థివుండు
తగుపుత్ర సంయుక్త ♦ దారరత్నంబును
రోగపీడితయని ♦ రోసివిడచె
విడచిన నారాచ ♦ వెలఁదికి నుదయించు
తనయుండు నావల ♦ ననుసమస్త
విద్యలెఱింగి సం ♦ విద్రూపుఁడైనట్టి
శివుని వర్మమునఁ బ్ర ♦ సిద్ధిఁ జెంది

గీ. ద్వాదశ సహస్రగజబలో ♦ దాత్తుఁడగుచు
తనదు పితృసంకటము బాపి ♦ ధన్యుఁడై స
యొక్క వైశ్యుని పురమునం ♦ దున్నవాఁడు
[illegible]న నీపుత్రికనుగుణుం ♦ డైనవాఁడు. ౧౮౨

రాజకన్యలలో ధన్య ♦ యై జగతిని
వెలయు నీసుతకమ్మహా ♦ వీరవరుఁడు
భర్తయై యుండెనా, మహీ ♦ పాల, నీదు
జననసాఫల్యమెంతని ♦ సన్నుతింతు

## భద్రాయుర భ్యుదయము

గీ. అతఁడు భద్రాయువను సమా ♦ ఖ్యను వెలుంగు
నార్యనుత శీఘ్రమున వివా ♦ హకార్యమునకు
నిచ్ఛయింపంగఁ దగునని ♦ ఋషభయోగి
నిజగృహంబున కేగెనో ♦ నిర్మలాత్మ. ౧౮౪

వ. నిజగృహంబు నందుండుచు నొక్కనాఁడు. ౧౮౫

సీ. శ్రీమంతుఁడైనయా ♦ ఋషభ యోగీంద్రుండు
భద్రాయుఁ గనగ సం ♦ భ్రమమొలర్ప
వచ్చిన నయ్యోగి ♦ వరుఁగాంచి సాష్టాంగ
దండప్రణామముల్ ♦ దగనొనర్చి
ముకుళిత హస్తుఁడై ♦ మోలనిల్చినఁ జూచి
నవ్వి గాఢాలింగ ♦ నంబొనర్చి
యోపుత్ర మగధదే ♦ శోదీర్ణబలముల
గెలచి వచ్చిననీదు ♦ బలిమి కలిమి
గీ. నెంతవర్ణింతు వినుము భూ ♦ మీశ్వరాగ్ర
గణ్య; చంద్రాంగదుని పుత్రి ♦ గలదు కీర్తి
మాలిని యనంగఁ దగునది ♦ మాననీయ
నీవు పెండ్లాడవలయును ♦ నిక్కముగను ౧౮౬

*గీ. అతఁడు నీకిచ్చుటకు ♦ మది హర్షమొందె
నీసఖుండైన యొక ♦ విప్రు నీతిమంతు
గా విచారించి పంపుమ ♦ కన్యఁ జూచి
వచ్చునని చెప్పి చనియెన ♦ వ్వరయశుండు.

క. ఆ యోగీంద్రుఁడు చనభ । ద్రాయువు తనచనువు నెనయు ♦ నవనిసురునితో
శ్రీయుత తత్కన్యామణి । నీయెడఁ గని రమ్మనుచు మ ♦ హెచ్ఛతఁ బలికె

---

పాఠాంతరము *గీ అతఁడు నీకిచ్చుటకు మది ♦ హర్షమొందె
నీసఖుండైన సునయుండు ♦ నీతిమంతు
డితఁడు దుజని తత్సమాచార ♦ మెఱిగినీదు
కోర్కి సఫలంబుగాఁజేయు ♦ గుతుకవశుననను. ౧౮౭

సీ. అమ్మహీసురుఁ డలరించఁ ♦ బ్రాంగణాభి
నాయకునిగాంచినాతఁడా ♦ నర్చు భక్తి
కలరి యాకీర్తిమాలినీ ♦ కలితరూప
లక్షణంబు లనరయుచు ♦ దక్షణంబా

క. వచ్చి ధరణీశతనయుని । గ్రుచ్చి కవుంగిటనుఁజేర్చి ♦ కొని వినయముతో
నచ్చు పడతద్విలాసము । నెచ్చరిక వచింపఁ దొడఁగె ♦ నీహితవృత్తిన్

ఉ. చూచితి దేవతాసతులఁ ♦ జూచితి యక్షపయోజనేత్రలన్
జూచితి నాగకన్యకలఁ ♦ జూచితి సాధ్యవధూలలామలన్
జూచితిఁ గిన్నరాంగనలఁ ♦ జూచితి సర్వజగల్లతాంగులన్
జూచితిఁగాని యీపడఁతి ♦ జోడగుచేడియఁ గాననెందున్ ౧౯౨

సీ. తలిరులు తాబేళ్లు ♦ కమలగర్భంబులు
కదళీకాండములు సై ♦ కతముసుడియు
పెనుతరగలుకను ♦ వీనుల జాడరి
శైలముల్ బిసములు ♦ సారసములు
దరము దర్పణముకుం ♦ దములు ప్రవాళంబు
కనకంబు మీనముల్ ♦ కార్ముకములు
సిరులర చందురుం ♦ డొరసైన తేటులు
కటిమొగుల్ కమలంబు ♦ మెఱుపుతీగ ౧౯౩

గీ. లునుదొగలునువ్వు బువ్వును ♦ వనజవైరి
శిలలు నవసంఖ్యలును పూగ ♦ ములునులతలు
వనటుల సికేఖకూపంబు ♦ లనటులుకరి
కరములును గాళెలును మేను ♦ లలరజోలు ౧౯౪

సీ. సారజోని మేఘంబు ♦ సాలివోని చందురుం
డలిగాడ్పుసోకని ♦ జల జములును
జిగిబిగి ఖాయని ♦ సొగసు సంపగమొగ్గ
నిద్దంపుటప ర్ధంజ ♦ యద్దములును
చిలుకముట్టని బింబ ♦ ఫలమంచ లంటని

తూఁడులు గోవెలల్ ♦ జూడనట్టి
తలిరులు సెలడాల ♦ నలయని రిక్కలు
మెరసి సిల్కఁడగతి ♦ మెఱుఁగుతీఁగ. ౧౯౫

గీ. తురుము నెమ్మోముగు గన్నవ ♦ యొరపునాస
చెక్కుల ధరంబు భుజములు ♦ జేతులునఖ
ములును మైవన్నె లైవగ ♦ ముద్దరాలి
నరచితంబుగ నలువ ని ♦ ర్మించెనేమొ. ౧౯౬

గీ. నలువ వికచశిరీషకో ♦ మలప ... గ
మిందు మృదితామృతంబులో ♦ నెనయఁజేసి
త్రిముఖములఁ ద్రిజగద్గత ♦ శ్రీవహించి
కడమ ముఖమున నిర్మించెఁ ♦ గమలముఖిని. ౧౯౭

క. వెలఁదుక కన్నులకాటుక। పులుఁగులగుటఁ దెలిసియెగరఁ ♦ బోయానికన్నుల విలుతుఁడు రులనొడ్డిన। చెలువున ముంగురులుదనరె ♦ సింగారముగాన్

ఉ. మేనికడానిలోనిజిగి ♦ మించిన మంచిమొగంపు సొంపుడాల్
పాలమడుంగునం జిరుత ♦ పాయమునంబొరలాడు జోడుతా
వాలుగమీలనంగఁ దెలి ♦ వాలుఁ గనుంగవ నుల్లసిల్లున
బ్బాలిక కంచులోకములు ♦ ప్రస్తుతిఁ జేయును బ్రస్ఫుటంబుగాన్. ౧౯౮

గీ. కలికి నిడు సోయగపు ... లు ♦ కన్నుగవల
వలన గ్రుమ్మరు లావణ్య ♦ జలధినడుమఁ
జెలువు గరచింపఁ బూనిన ♦ సేతువనఁగ
భాసురాంబుజలోచన ♦ నాసమెరసె ౨౦౦

సీ. అధరామృతప్రవా ♦ హప్రతిక్షణజాత
నూతన బుద్బుద ♦ ప్ర... తమనఁగ
యావ్వన మన్మథో ♦ ద్యానవాటీలస
ద్దాడిమఫలబీజ ♦ తతియనంగ
నాననపద్మప ♦ ద్మాలీ యాంగణసీమ

రంజిత మౌక్తిక ♦ పుంజమనఁగ
గించిద్వికచముఖ ♦ ప్రాంచత్ప్రమోదినీ
రసపూరకోరక ♦ విసరమనఁగఁ

గీ. లలిత రదనాంశు కారణ ♦ ఫలకలిఖిత
పంచబాణప్రతాప ప్ర ♦ శస్తి విజయ
శాసనాక్షర సంతతి ♦ చందమునరఁ
గాంత కాంతామణీదంత ♦ గణము వెలసె. ౨౦౧

గీ. వరుసనై యొక్కవలుతక్కు ♦ వలుదొలంగి
యొక్కతీరునఁ బెంపొందు ♦ చున్నదంత
పద్మరాగాళిఁ బెనగొని ♦ పరగినట్టి
తావిసకలాలితుస్మకన ♦ మోవిదనరె. ౨౦౨

సీ. కన్నుల విలుకాని ♦ యెన్నికజాళువా
జంజాళి యనవొప్పె ♦ సకియనాస
చక్కెరవిలుకాని ♦ చక్కని తోఁత్తటి
చిలుకుల నగవెల్గెఁ ♦ జెలియకనులు
రాచిల్క నెక్కెడు ♦ రాయని తీరైన
విండ్లననగను నట్టు ♦ వెలఁది బొమలు
సింగారమైనట్టి ♦ సిరిపట్టిబంగారు
పలుకయనం దోచుఁ ♦ బడఁతి నొసలు

గీ. మరుఁడు శ్రీపుత్రుఁడనుమాట ♦ యెఱుకపడఁగఁ
జేయుచందము దోపస ♦ చ్చెలియవీను
లగుచు శ్రీలుమెలంగనో ♦ ననుచుఁ బొగడ
భ్రమరకుంతల జూపట్టు ♦ సుమశరమన. ౨౦౩

గీ. అలరువిల్తుఁడనెడు గేస్తు ♦ డతివమేన
లలిత శృంగారలక్ష్మి వి ♦ లాసములను
లలివినిర్మించుటోఁ దొలు ♦ దొల్తశంకు
నిల్పినోయన దనరారె ♦ కలికిగళము. ౨౦౪

సీ. అనురాగ రత్నప్రభా ◆ స్వనకశైలములన
మకరాంక కన్యకం ◆ దుకములనఁగ
వరదేహ జన్యలా ◆ వణ్యపుంజములన
స్వాంతసరోజ్జకో ◆ శములనంగ
మదనమోహనభూతి • పదకరండములన
గంతునిర్వక్రచ ◆ క్రములనంగ
హారమృణాళసం ◆ చారకోశములన
భవమహీ రుహమూల ◆ ఫలములనఁగ

వదికలోక జగీషాప్ర ◆ వర్తనప్ర
భవపరిశ్రమలాలన ◆ పంచబాణ
సుఖనివాస గృహములన • సుందరాంగి
కలుకుగుబ్బలు దనరారెఁ ◆ బొలుపుమీఱ. ౨౦౫

క• గ్రక్కాంచ నాచలాచల। దళదురు సంజీవనీల ◆ తాఫలములనన్
విలసిల్లెన్ దదురోజయు। గళమనఁదగు లీలచేవి ◆ కానము దనరన్. ౨౦౬

చ. మెఱుఁగుదొరంగు తుందమను • మేలిమిబంగరు రంగుటాకునన్
మరుఁడు తదీయరూపమహి • మాతిశయంబున కన్యమీఁదుగా
దొరయదటంచు కజ్జలము • తో లిఖియించిన నాగరంబనన్
సరసిజాక్షి చక్కనగు • శ్యామలరోమగణంబు సొంపగున్ ౨౦౭

క. చూపట్టినట్టి పొక్కిలి। లోపల విలసిల్లు కనద • లోలమనోభూ
దీపపు కొడియన నాగా। రాపూర్ణ శశాంకవదన • కందంబయ్యెన్ ౨౦౮

గీ. అంశుక వ్యాప్తిచే మధ్య • మాస్తికత్వ
ముగిప రామరిశించిన • యొసరుననుచు
నంబుజాక్షి మననుపట్టు • ననుటగాని
తలఁచిచూడఁ గృశత్వంబె • దానికరవు. ౨౦౯

చ. ఉరుతుచ కుంభపాతమున • కోర్వకనో? యటుగాక భావిన
త్పురుష కరోరుపాశమునఁ • బుట్టిన ఖేదముచేత నేమొ? యా

సరసిరుహాక్షి నెన్నుదుము ♦ చారుకృశత్వముబూనెఁ గానిచో
[illegible] ♦ [illegible]విలసిల్లఁ[illegible]నే ౨౦౦

మ. తలిరుంబోడి[illegible] ♦ [illegible] విద్యా[illegible]
ద్యల సద్భావహ పరాక్రమ క్రమము పాం ♦ థప్రాణికోటిం జలా
చలవృత్తింభజియింపఁ జేయఁగ జయ ♦ స్తంభంబులన్ నిల్పెనాఁ
గలనన్ భీతమృగీ విలోచన తొడల్ ♦ గన్పట్టె నౌ పట్టుగాన్. ౨౦౧

క. అంగజుఁడనిమొదు సామరి ♦ బంగారపు రంగులన్ వి, భాగింపుచు మున్
రంగాయించిన గుడెలన ♦ సంగన జంఘికలు దనరె, నద్భుతరీతిన్. ౨౦౨

గీ. జంఘికాగతలావణ్య ♦ జలధి జనిత
శుక్తులయ్యెఁ బదంబులు ♦ స్ఫుటిత తత్సు
ముఖవినిర్యన్మణులు చంద్ర ♦ ముఖి నఖములు
గాని సుమతారకలు పోల్కెఁ ♦ గానవయ్యె. ౨౦౩

గీ. తారకలు సరిగాఁజేయఁ ♦ దగదు నఖస
మాస మొనరుట కనిబ్రహ్మ ♦ యమృతబిందు
తతికి నిల్కడవన్నియు ♦ ఁదగనొనర్చి
వెలఁదినఖములు నిర్మించె ♦ ఁజెలువుదనర. ౨౦౪

ఆ. అంగజేభ శిరమ ♦ నంగ వక్షముదోచె
గుంభయుగమురీతి ♦ ఁగుచములలరెఁ
గరముపోల్కెరోమ ♦ గణము జెన్నొందెద
దగ్రముగతినాభి ♦ యలరుచుండె. ౨౦౫

చ. అతివ విలోచనంబులు శి ♦ తాబ్జములంచుఁ గనీని కామిష
స్థితి నిరుమేనులందు నరి ♦ శ్రీ హరి నిల్చినఁ జూచిలక్ష్మితత్
కృతి నెడఁబాయలేక కను ♦ పాపల నేనెపమొప్ప నుండెన
ప్రతిహతవృత్తిఁ జెందునన ♦ పాయినిగాభువి నెన్న నిచ్చలున్. ౨౦౬

గీ. ఉదరము దరంబనందగి ♦ యొప్పుచుండ
మధ్యమును మధ్యమంబయి ♦ మలయుచుండ
బొమ్మలలతుంట వింటికి ♦ బొమ్మగట్టి
బిరుదు చాటించుఁ జెలియపాం ♦ బిరుదు లెపుడు. ౨౧౭

చ. చెలువగు తావి మోవిరుచి ♦ చేఁ దగు కెంపుల సొంపు పల్కుపై
నలరుల వింటిదంట విర ♦ హాత్ములై చరియించు పాంథులన్
గెలిచి జగంబునన్ బిరుద ♦ కీలితనైజ జయాంక నాక్షరం
బలలిఁ గీలుకొల్పెననఁ బొల్చెల ♦ సన్మదిరాక్షి దంతముల్. ౨౧౮

క. కందర్పగజాలానపు । పొందునఁదగు గర్తమనఁగఁ ♦ బొక్కిలి మెరసెన్
సుందర తచ్చరణాగ్రస । ముందుకి మన్నరోమరాజి ♦ యలరారె దగన్. ౨౧౯

క. సొగసగు నగుమొగమనియెడు । తొగరాయని దండనుండి ♦ తోచిన
బలుకెం । జిగిఁదగిన సాంధ్యరాగపు । వగయనఁ జిగురాకుబోడి ♦ వా
తెఱ వెలసెన్. ౨౨౦

సీ. చేతో గృహాంతరా ♦ సీన మానాంబక
వీక్షణోత్సవదగ ♦ వ్యాక్షుపాలన
వదన సంపూర్ణలా ♦ వణ్య స్రవంతికా
విహారదంజననామ ♦ విహగములనఁ
గమనీయ దరహాస ♦ కలశాంబునిధిభాస
మానసీలోత్పల ♦ సూనములన
లసమానదృష్టిలీ ♦ లాకుంద మాలికా
కలితద్విరేఫయు ♦ గళమనంగ

గీ. మహితదృష్టి యాధేష్టగ ♦ మానవిరోధ
కశ్రవణకూప కృతకోప ♦ కస్మరూప
లోహితోపాంతములఁ జగ ♦ లోభనీయ
మగుచుఁ జెందని రుచిఁగువ నే ♦ త్రాబ్జయుగము

గీ. మరుఁడు సార్వభౌమ ♦ బిరుదుఁ గైకొని తన్ము
ఖంబు భద్రపీఠి ♦ గా నొనర్చి
మెరుఁగు గరికపచ్చ ♦ మేలుకట్లొనరింప
బోలుననఁగఁ గలికి ♦ బొమ్మ లలరె. ౨౨౨

గీ. వెలఁది కటిభాగ ♦ ములు చెలువొందెనో
పుల్లహల్లకముల ♦ పోల్కెఁదనరి
శీతలైనదండ ♦ చేతులువిలసిల్లె
వానితూఁడులనఁగ ♦ వన్నెమీరె. ౨౨౩

చ. సిరి, హరి రాణివాసమయి ♦ చెల్వగు గైరిక సారసారసం
బరిమురి విభ్రమద్భ్రమర ♦ కాంచితసంచితమైన వాసనా
భరమునఁజెందు మోముగుచు ♦ భాసితఁ తత్కమనీయ పేశల
స్ఫురిత మృణాళమాయనఁగఁ ♦ బొల్చెను నాసిక సారసాక్షికిన్. ౨౨౩

క. అలుల జయింపఁగ జలజము । వెలఁదుక జిగిఁదగు మొగంబు ♦ వెనుక
కరుగ న, య్యలకముల పొల్పుఁ దెలుపుచు । నళులక్కడ నిలచియుండె ♦
ననఁ గచములరెన్. ౨౨౪

గీ. తగు ధనుర్మీనములుగూడి ♦ మగువ భ్రూన
యనములయినను గురుఁడు నా ♦ సను మెలంగె
మౌక్తికాకృతి దేదీప్య ♦ మానుఁడగుచు
వెలయుఁ దానేలికైనను ♦ నెలవు బలిమి. ౨౨౫

చ. పొలుపగు గుబ్బలన్ బటువు ♦ పుల్గుల మెల్గగ శంబరారి పో
క్కిలి నెలవై జెలంగ జవిఁ కీలని సోలకజాలముంచి త
త్కలిత విసీల సూత్రమున ♦ కై యమరించినకేతిఁదోచె న
య్యలి కులవేణితగ మెరు ♦ నాగు వినోదమునొంది పొందుగన్. ౨౨౬

గీ. జలజసాయకుఁడమ్ముల ♦ సానఁబట్టు
రత్నమయశాణ చక్రమా ♦ రమణిపిరుఁదు
దాని జిగియందనపుబంది ♦ యానుకొను
దనరనందు వసించిన ♦ దరులుతరులు, ౨౨౭

క. అలికంబరనెలఁ దెగడిన। నలికంబునచూపు దెగడు ♦ టది చిత్రముగా
దలకంబు మొయిలఁ దెగడిన। నలకంబును గళము దెగడె ♦ నారతలంపన్ ౨౨౮

క. వలమురిగళమైతగఁ గలు। వల మురిఁగొనులే తనగవు ♦ వసుధాస్థలిపై
గల మహిళామధ్యమమే। కల మహిళా మధ్యమంబు ♦ కమనీయంబై. ౨౨౯

క. ఆవర వర్ణినియధరం। బావరవర్ణిని సుధాస ♦ మన్వితమగుచున్
భావిదితమైన యూసతి। భావిదితయున గ మిగుల ♦ భాసిలుచుండెన్. ౨౩౦

క. సరమాతను వసితోర। స్సర మావేనలి సుధావ ♦ సరమాసుడిమేల్
సరమాహాక్కిలి రత్నవి। సరమారదనాళి చెలిసు ♦ సరమాఁ పొగడన్. ౨౩౧

క. ఆరమణిరో మగణకబ। రీరమ్య కుచంబు లలరె ♦ శ్రీదన రారన్
ధారాధర ధారాధర। ధారాధరములు తిరస్కృ ♦ తములైఁ దనరన్. ౨౩౨

ఉ. జంబుగదేశచంబు, జలఁజంబుగదే మొగమా మణీసమా
జంబుగదేర దావళిగ ♦ జంబుగదే నడలార హేమపుం
జంబుగదే రొండల్ మలయ ♦ జంబుగదే మయితావి చంద్ర తే
జంబుగదే స్మితంబునని ♦ జంబుగదే నడుమెన్న బోటికిన్. ౨౩౩

వ. అని యివ్విధంబున వివరించి. ౨౩౪

గీ. ఋష భయోగీంద్రుఁ డెపుడు నా ♦ హృదయమందు
స్ఫురణఁ బుట్టించుటయుఁ జేసి ♦ భువనములను
గలుగు కన్యలఁ గంటినా ♦ క[illegible]కివంటి
చెలినిఁ జూడంగ లేదయా ♦ శ్రీదవిభవా ౨౩౫

వ. అని యివ్విధంబునఁ గీర్తిమాలిని సౌందర్యాదిగుణంబు లేకతంబునఁ దెలియం
జెప్పిన నారాజ సూనుండు సంతుష్టాంతరంగుఁడై యుండె నట్టియెడ. ౨౩౬

గీ. అంతనక్కడఁ జంద్రాంగ ♦ దావనీశుఁ
డాప్తులన్ జూచి పలికె భ ♦ ద్రాయువునకుఁ
గీర్తిమాలిని నొసఁగినేఁ ♦ గీర్తిశాలి
నైతి మీకం[illegible]కినిది ♦ హర్షముగదా. ౨౩౭

క. అనవారలనిరి జనవర । యనుపమ సౌందర్యధుర్యు ♦ డార్యుఁడు భద్రా
యునికంటెవరుఁడు లేడీ । వనధిపరీతమగు భూమి ♦ వలయములోనన్, ౨౩౮

వ. అనివారు సమ్మతించిన నంతఃపుర స్త్రీలలో సాధ్వీరత్నంబగు సీమంతి
నికి భద్రాయురభ్యుదయాది కావ్యంతంబు వృద్ధబ్రాహ్మణ ముఖంబున
వివరించిన నాకీర్తిమాలినివిని తనమనంబునకు భద్రాయువు సాక్షాత్క
రించి నట్టయినఁ గరణత్రయంబు నతని యధీనంబు జేసియుండు సమయం
బున. ౨౩౯

సీ. ధారాలసితవారి ♦ ధారాలసితసరా
ధారాలసితహంస ♦ వరమగుచు
పదన నిర్యత్సుధా ♦ సవన మానసదురా
సదన వార్తికవిద్యు ♦ దుదయ మగుచు
భావ జరితహావ ♦ భావ పల్లవికాధి
భావ కృత్సనితపుం ♦ భావ మగుచు
హాల హాలేత్యగులాప ♦ హాలవిలాస భృతిదో
హాల భుజాబల కృషీ ♦ వలము నగుచు

గీ. దేదివద్ధాతు భూతలో ♦ త్థితతలాగ్ర
వితత సీపద సీపసీ ♦ పతదసమకు
సుమస ముద్గీర్ణ ఘుమ్ఘుమ ♦ త్సురభిభూత
లంబుదగ ♦ నంబు దాడంబ ♦ రంబు దోఁచె. ౨౪౦

చ. పలుతాపంబుల నాపసోపములు జూ ♦ పట్టంగ నిట్టట్టుగా
సినలసె న్బంటవలంతి దీనికిఁ గశై ♦ త్యప్రక్రియల్ జేయగా
వలె నంచున్ ఘనుడంత వృష్టిజనిత ♦ వ్యాపారముల్ జేయఁగా
బులకల్ మేనజనించిమించెనన మున్ ♦ బొల్చెన్ దృణాంకూరముల్. ౨౪౧

చ. కతల భూముఖస్థలుల ♦ జెందుచుముందు వివిక్త రక్తకీ
టకము లసహ్య తాపవిలు ♦ తస్మహితత్వమయుండు పొందుఁబొ
తుక గిలిగింతఁ గొల్పఁదరు ♦ ణారుణదీధితి మత్ప్రవాళపా
ళికల సరుల్ ఘటించెనన ♦ లీలఁగనందనరారె నత్తఱిన్. ౨౪౨

చ॰ ముసిముసి మబ్బుసన్దనరు ♦ ముత్తెపుటెత్తులసం దృశాంతసం
వసదురు శీకరంబులన ♦ వద్యుత దంతర కీలితంబులై
మిసిమిపసిండి కెంపులన ♦ మించుమెఱుంగు వురుంగు లొప్పనా
నసిగలచోట గాటముగఁ ♦ జాలుపు వానలులేని వేళలన్. ౨౪౩

మ॰ వినుతప్రాప్త యథాక్రమ స్తనితమై ♦ విద్యుల్లతామూర్తియై
తను మార్గాగత వృత్తి మభ్వసనమై ♦ ధారాప్రవాహైకయై
కనదుత్తుంగ పయోధరోల్లసనమై ♦ కమ్రాంబ రోపేతమై
ఘనసంగంబున వృష్టిఁజూడఁదగె లో ♦ కంబుల్ మదిన్మెచ్చగాన్. ౨౪౪

క॰ అహమహమికా వివాదం । బహర హమా స్తనిత విద్యు ♦ దంబునికరప
న్నహనములకు రావర్షము । తహాతహ పొందించె సకల ♦ ధరణులనెల్లన్. ౨౪౫

మ॰ అలరున్ జానపదస్థలంబులు స ♦ ముద్యద్భూమ ధూమాలయో
జ్వలదాచ్ఛాదనముల్ నిరంతరజలా ♦ సారంబునన్ నందు పం
దుల ధూమాంకురముల్ జనించి మును ముం ♦ దుంజారు ధారాకరం
బులుగాఁ దజ్జరరంబులంబుదములై, భూమిన్ దివిం జేయఁగన్. ౨౪౬

సీ॰ ప్రతిపదా దర్శాను ♦ మితవర్తులాద్యంత
రంబులై రుచిరగ ♦ ర్తంబులలర
సర్వతస్థాపితా ♦ ఖర్వదుర్వర్ణ పా
త్రంబులై పద్మాక ♦ రంబులలరఁ
బరితస్స మర్పిత ♦ స్థిరదు కూలాచ్ఛాద
నంబులైతేటి నీగ ♦ ణంబులలర
విష్వక్పరిప్రిక్క యా ♦ విఖ్యాత తారహా
రంబులై కల్యాది ♦ కంబులలరఁ

గీ॰ బంటవలఁతి యానెడువాలు ♦ గంటతోడ
మింటి తెరువరిదంట వా ♦ ల్గంటనంటి
గంటకుండిన నివియెల్ల ♦ నొంటిరియుండఁ
దెలియ వచియింపనలవి యే నలువకైన. వ॥ తదనంతరంబు॥ ౨౪౭

సీ. కలితప్రకాశసం ♦ ఘాతంబు వెలయంగ
గల హంసకస్ఫుర ♦ ద్గతులు దనరఁ
బటుతర రజతకుం ♦ భపయోధరములొప్ప
ధవళాంబరము ధళ : ధళ వెలుంగ
వేణీప్రదేశంబు ♦ విశదమై గనుపట్టఁ
జంద్రరేఖా విలా ♦ సంబుదోప
సరలోచనము లకానందంబు ఘటియింపఁ
దారాళి ♦ నిర్మలత్వంబు నొంద

గీ. శాలిసుకృత ఫలమహాత్మ ♦ మాలికాశ
యంబు విలసిల్లగాఁ బ్రవీ ♦ ణాళుకవిల
సితని నాదంబులదర నా ♦ శ్వినపువాస
రంబునను పీకశరదాగ ♦ మంబుదోఁచె. ౧౮౮

మ. హరిదుగ్ధాంబుధి నిద్రితుండగుట చో ♦ ద్యంబెట్లనన్ వైద్యశా
స్త్రరహస్యంబతఁ డేర్పడం దెలిసెఁదు ♦ త్కాలోప భోగ్యస్థితిం
జొరలేవన్యములైన రోగము లటం ♦ చున్ లేనిచో శేష సా
గర వైకుంఠ ముఖప్రముఖ్య సురలో ♦ కంబుల్ దగన్ లేవకో. ౧౮౯

వ. తదనంతరంబ ౧౯౦

సీ. ఇందూప లాగార ♦ బందీస మాచార
మంబుష్ప వోచ్చార ♦ ణాపవాద
ముద్యాన యానప్ర ♦ యోగభాగవిలాస
మైందవా తపసేవ ♦ నాప్రసక్తి
పన్నీరగంధ సం ♦ బంధ నిర్గంధంబు
కోమల వ్యజన వి ♦ శ్రామకరము
సరసాంబు జాతావ ♦ సానప్రకారంబు
పత్యర్థిరచితప్ర ♦ పావిరహిత

గీ. మగుచు నెగడొంది సేవంతి ♦ కాంతరాళ

హారిధారాళతు హినధా • రావతార
మిళిత నక్తందివ స్రవ • న్నిహిక నుగుచు
వసుధఁదుహినాగ మోల్లస • ద్వారములరె ౨౫౧

చ• ఒనరనయో మయాంతరస • ముజ్వలిత జ్వలనంబు గాడఁబొ
ల్చినఁ బ్రహసంతి కాగ్రములఁ • జేతులు నిట్టటు విప్పుచుందురా
జనముల దెట్లనఁగ హిమము • సర్వజగంబుల నీవలావలన్
బెనచు నటంచుఁ దెల్పుగతిఁ • బేర్చిన యా హిమవాసరంబులన్• ౨౫౨

మ• తనరెఁ సాంద్రతరాంతి కానలల స • ద్వాసోష్ణవాః కుంభ సం
జననంబిష్ట ఘనేష్ట కోపచితవా • సస్వాపనాత్యప్రవ
ర్తిన నిర్నిద్రకళావతీ కృతపరీ • రంభన్స్పృహోద్యద్వయో
జనమాక్రందిత దుర్గతాధ్వగనధూ • జాతంబు సీతంబలన్• ౨౫౩

సీ• పాదంబు లగ్నిలో • పలఁ జాపఁగాఁ జేయుఁ
బూని మున్నినుసంత • వానినైనఁ
గరములు జల్లగాఁ • దిరుగంగ నొనరించు
వసుధలో రాజంత్త • వానినైనఁ
మేనెల్లఁ దెలిడాలుఁ • బూనఁజేయఁగనేర్చు
వహిసదా శివునంత • వానినైనఁ
నిలువెల్ల నల్లనై • మెలగంగ నొనరించు
వఱలు శ్రీహరియంత • వానినైనఁ

గీ• నితరు లననెంత యీ హిమ • ప్రతతికనుచుఁ
దనకు నిలయిత వదన పా • దముల విడచె
నగ్నియటుగాక తక్కిన • వన్నియుండ
నదియుఁ జలినొందునని జనులనుదు రెపుడు• వ• తదనంతరంబ ౨౫౪

సీ• విలసద్ఘనేష్టకా • విరచితాంతర్గృహ
నిద్రాభిలాషిత • నిరసనంబు
మేదురాగరుకుంకు • మాదిసమ్మిశ్రిత

గంధిలాలేప ని • ష్కాసనంబు
సద్రక్త మృగరోమ • జప్రచ్ఛదాచ్ఛాద
నేచ్ఛావిచారణా • హింసనంబు
స్థాపితాహర్నిశో • ష్ణకర దుష్టవాః కుంభ
సంభూత కాంక్షాను • శాసనంబు

గీ. తప్తకాంచన కనదవ • ధ్వస్తశస్త
భూమధూమజ్వలన పరి • స్ఫురణచరణ
మోమయ హసంతి కాదినం • యోగ జనిత
సుఖనికారణవృత్తిచే • సొంపుదనరె. ౨౫౫

సీ. సాంద్రచంద్రోపల • స్థగిత ధారాధర
సౌధాగ్ర కేళికా • సౌఖ్యకరము
మహనీయ హిమవారి • మర్దిత శ్రీగంధ
చర్చానుమోద ప్ర • సక్తిదాయి
సతత ఘుమఘుమ • త్సౌరభోద్దీర్ణ కా
సారహారి విహార • కారణంబు
శీతలా నిలజాల • ధూతప్రసూనసం
వాసితో పవనప్ర • వాససేవ

గీ. నాస్పదంబును జంద్రకాం • తాభిరామ
మందిర ప్రాంగణాంభోజ • మార్గణప్ర
థనగ తాన్యోన్య పరిరంభ • జననసమ్మ
దావహంబై వెలయుచుండె • నట్టియెడల. ౨౫౬

గీ. మధిత సజ్జాతి యగుచును • మధుపనికర
మెనసి కొలువంగమే నెఱుం • గనివిభునితో
నేస్త మొనరించు టొక్కటే • నీచగుణము
గాని యిటువంటివాఁడు • లోకమునఁ గలఁడె. ౨౫౭

వ. అట్టియెడ. ౨౫౮

క. మలయు వలరాచ వానికిఁ। బలువిడిదలుగ నను శ్వేత ♦ పటకుంటపుల్
వెలయించె ననెడిపగిదిం। బొలుపుగఁ బుష్పితనికుంజ ♦ పుంజము లలరెన్. ౧౬-౨

సీ. మొలఁగు సహస్రార ♦ ము లబండ్లనమరించి
కలువకాడల నిరు ♦ సులుగఁజేసి
సొగసునాళంబుల ♦ నొగలుగా సవరించి
పెలుచ గేదఁగి రేకు ♦ పలుకఁజేసి
మంచి సంపెగపువ్వు ♦ మద్దిగంబొనరించి
పొగడ మొగ్గల చీల ♦ లొగినమర్చి
మేలుదానిమ్మల ♦ మేల్గల తామర
నూలుచే సేటులు ♦ గీలుకొలిపి

గీ. పువ్వుఁదేనియ కందనై ♦ పొలుపుఁజేసి
పగడముల తీగలను పల్పు ♦ లుగనమర్చి
రాచిలుకలును గుఱ్ఱంబు ♦ లై చెలంగ
రాజహంసలు జులుమతీ ♦ తేజులుగను ౧౬-౩

సీ. అళుల మొత్తంబులు ♦ కలగానము లుజేయఁ
గలసికోవెలలు కా ♦ హళములూద
సారసంబులు మృదం ♦ గారవంబులు సేయ
గలరవంబులు తాళ ♦ గతులు నెఱపఁ
బుడమిపుట్టువుగుంపు ♦ లెడనెడ జడియంగ
మెరయుగాడ్పులు బరా ♦ బరులు సేయ
నేపైన తీవియ ♦ లింపుచేడియలెల్ల
బలసి పేరంటపా ♦ టలఁజెలంగ

గీ. జొట్టుపులుగులు నట్టువ ♦ పిట్టపరవ
పరపులగు మావితావుల ♦ మెరకత్రోవ
రహిలతా కోరకాళితో ♦ రణములలర
మరునికి విహారయోగమా ♦ మనిరచించె ౧౬-౪

సీ. పూఁచెనశోకముల్ ♦ బున్నాగకుసుములుబూరు
గలుకలి గొట్టులు ♦ తిలకములును
గాఁచెనామ్రకపిత్థ ♦ కదళికాకంటకీ
ఫలజంబు జంబీర ♦ పాదపములు
నేఁచెసాలతమాల ♦ హింతాల తృణరాజ
నారికేళ పలాశ ♦ భూరుహములు
తోఁచెఁ గైరవసిత ♦ తోయజేందీవర
మాధవీమల్లికా ♦ మహితలతలు

గీ. వకుళలవలీ మాతులుంగల ♦ వంగలుంగ
హింగుదీభుజ పత్రనా ♦ రంగగంధ
సారఘనసార సహకార ♦ సరళవకుళ
కురువకసితాసితాగరు ♦ కుజచయములు. ౨౬౮

సీ. తొలుదొల్తఁ దేనియల్ ♦ దొలఁకుచుందాడిమంచి
ఫలజాత ముదయించె ♦ విలసితముగ
నాఫలసంతతి ♦ కన్న ముందుగఁదోఁచెఁ
దోరగాయలపిందు ♦ మేరమీరి
యాదోరగాయల ♦ కాదియై మునుదోఁచె
బువ్వుపిందెలగుంపు ♦ నివ్వటిలుచు
న పువ్వు పిందెల ♦ నలరించి ముందుగా
ముకుళ సందోహంబు ♦ ప్రకటమయ్యె

గీ. తిన్ననగు మొగ్గ గమికన్న ♦ మున్నెయగుచుఁ
బల్లవము లుదయించె శో ♦ భాప్రకార
మందు ముందుకు ముందుని ♦ ష్యందమాన
మధుర మధురస మొలయంగ ♦ మహివనమున. ౨౬౯

సీ. ననలదట్టములోఁచ ♦ సంబులై కనుపట్ట
నలులగుంపుకసీని ♦ కలుసుగాఁగ
లలిజిగురులు ప్రవా ♦ ళంబులై విలసిల్లఁ
గలికాంతతులు మౌక్తి ♦ కములుగాఁగ

మంజరుల్ స్తనభార ♦ మహిమచే వెలయంగ
నరుణపల్లవములు ♦ హస్తములుగఁ
బంధుటాకులుపట్ట పలుగ తిలకించింప
శాఖలు భుజములై ♦ సంభ్రమింప

సీ. పూలిచె వనలక్ష్మి మాధవ ♦ స్ఫురణమునకు
నుచితవేషము ధరియించె ♦ నో యనంగ
నలరుచుండిన యవ్వేళ ♦ నఖిలజనులు
సమ్మదంబునఁ బొదలిరి ♦ తత్సమయమునను ౧౬౭

వ. మహేంద్ర వైభవుండగు చంద్రాంగదుండు భద్రాయువునకుఁ దన పుత్రికారత్నంబైన కీర్తిమాలినిఁ బెండ్లిసేయదలంచి సకలమంత్రి జనానుమతంబున కార్తాంతిక నిశ్చిత పరిణయోత్సాహంబున నుండెనని శౌనకాది మహామునులకు సూతుండు జెప్పిన. ౧౬౮

మ. పురజిన్మార్గణ మార్గణాళిసుమ మనో ♦ భూజాతమిథ్యామత
స్థిరధీవారణ వారణాసినగర ♦ శ్రీవిశ్వనాథాంకశ్రీ
కరపాదాన తదాన తత్పరసదా ♦ కల్యాణ కల్లోలదయా
వరసన్మానస మానసప్రభవద ♦ ర్పధ్వంసకృల్లోచనా। ౧౬౯

క. క్రీడాకిరాతమాయా। క్రోడీకృవ దాశరథ్య ♦ గురుమోక్షదమా
క్రీడిత క్రుత్యవలోడిత। తాడితపూషాభిధాన ♦ దశనవిలసనా. ౧౭౦

శా. అభ్రాంత భ్రమదుత్కట వ్యతికర ♦ వ్యత్యస్త లోకాంధను
ష్మభ్రాంశుద్రుత విశ్వసృడ్గృహపద ♦ స్ఫూర్జన్మహావృత్త తా
విభ్రాదానవిభావదాన్యశశభృత్త్రైతద్యుషన్నిర్ఝరీ
శుభ్రాదభ్రతరంగ సంగతజటా ♦ జూటప్రియంభావుకా. ౧౭౧

స్రగ్విణి. విశ్వకద్రూభవ ♦ ద్వేదవేదాదివ
ర్ణాశ్వతోత్రకిరియా ♦ ధ్యక్షదక్షాంతకా
వైశ్యరూపానుభా ♦ వప్రసిద్ధిప్రభా
వేశ్వరీ నాథవా ♦ గీశముఖ్యస్తవా. ౧౭౨

మ. ఇదిశ్రీభద్రపరిష్క్రియా కలితబం ♦ హిత్వప్రతిష్ఠాగరి
ష్ఠదిగంతస్తుత పారమేశ్వరకళా ♦ సంకాశ రంగాంగనా
హృదయానంద దరాజశేఖర హిత ♦ శ్రీమూర్తి భద్రాద్రియు
ద్భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమున తృతీ ♦ యోల్లాసమై పొంపగున్. ౨౬౪

—: * గద్య * :—

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద
ప్రస్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్లగోత్ర పాత్ర
కామినేనివంశపయః పారావార రాకాసుధాకర రాజచంద్రా
జన్మ దేశాయి సార్వభౌమాజ్ఞా పితాంధ్ర గీర్వాణ
కవిత్వతత్త్వ చాతుర్యధుర్య పరాశరగోత్రి
రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాద్రియు
గభ్యుదయంబను మహా
ప్రబంధంబునందు
తృతీయోల్లాసము
శ్రీ శ్రీ శ్రీ





శ్రీరస్తు

# చంద్రాయురభ్యుదయము



## చతుర్థోల్లాసము



శ్రీతరుణీమృదు మధుర ర
సాతతవచన రచనాస ◆ మంచితవీణా
పాతన రామారెడ్డిధ
రాతల పతిపురనివేశ ◆ రాజమహేశా. ౧

వ. అవధరింపుము, నిఖిలపురాణ వ్యాఖ్యాన సమేతుండైన సూతునకు శౌనకాది మునీంద్రు లిట్లనిరి. ౨

గీ. అవ్విధంబున శ్రీవసం ◆ తాగమంబు
కరము సర్వజనానంద ◆ కరముగాఁగఁ
దనరు సర్వేశ కీర్తిమా ◆ లినివిరహాని
రసిత డోలాయమానమా ◆ నసమునొంది. ౩

సీ. శ్రీమంతుఁడైనట్టి ◆ బుషభయోగీంద్రుండు
మిహిరప్రకాశుఁడే ◆ మిటికివచ్చె

నచ్చెగా కేమి స • ద్వంద్య భద్రాయువు
ఖ్యాత శౌర్యం బేలఁ • బ్రీతినుడివ
నడువుగా కేమి సం • తుష్టుఁడై మాతండ్రి
హితమదుద్వాహంబు • నేలఁదలఁచె
దలచుఁగా కేమి తా • త్సౌందర్యముఖములు
ముందునా మదియందు • నెందుకలరె

గీ॥ నలరుగా కేమి దుస్సహుం • డసమశరుఁడు
కుసుమశరముల నన్నింత • మసలఁజేసె
నేమిసేయుదు విరహార్తి • కెటులనోర్తు
తాళలేనింక నేనని • తలఁకి తలఁకి॥ ౮

సీ॥ మేనువేదనపాలు • గా నొనరించుచు
నెరజవ్వనంబు క • న్నీటికొసఁగి
తేనెజాల్గలు వా • తెఱసోయగంబెల్ల
వేడినిట్టూర్పుల • తోడఁ గలసి
సొగనుగుబ్బలమీఁది • పొగరెల్ల జాఱ
పసగల పయ్యెద • పాలుఁజేసి

గీ॥ బయలు కౌఁగిటఁ జేర్చుచుఁ • బ్రకటమైన
ధైర్యమంతయుఁ గడుదీన • దశకొసంగి
తలఁకి యుస్సురనుచు మదిఁ • దల్లడిల్లి
బెగ్గిలుచు మన్మథాయని • పేరుగొనుచు ౫

క॥ నినుగుంబయ్యెరసోకినఁ గసిగందెడు వేళనేలఁ • గదియింపుచు సా
మ్మసిలంబోవుచు లేచుచు। విసుగుచు వేసరుచు మసలె • విరహాభరమునచే॥

సీ॥ తొలుతకాయక్లేశ • మలవడఁగాఁజేసి
యచలాసనాభ్యాస • మలవరించి
ఇంద్రియార్థంబుల • నెలమివిసర్జించి
కనుగవ దూరమో • డ్పుగా నమర్చి

చూపులొక్కటఁజేసి • శుద్ధమనోవృత్తి
తదధీనముగఁజేసి • తమినడంచి
సకల వస్తువులను • త్మునకత విడంజేసి
ఖేచరీముద్రను • గీలుకొలిపి
గీ. తనకొకటి దోఁచుటన్నది • తానొకటికిఁ
దోఁచుచున్నది లేకయ • త్రోయజాక్షి
విరహ యోగంబుతోఁగూడి • విభునిపదము
లక్ష్యముగఁజేసె నాత్మీయ • లలనలదరా.

క. అభిలాషవిప్రలంభ। ప్రభవస్తంభాది సత్త్వ • భావము లెదలోఁ
బ్రభవించిన నిర్వేదా। దిభవము ... ... దేట। తెల్లమిగాఁగన్

గీ. స్థిరవిభాను భావసా • త్త్విక ముఖముల
నలరు రసమంబు జాతాయ • తాక్షి మేనఁ
జెలఁగుచుండె నవసాలి • శేషములను
నవవిధములఁ బరస్పర • భవములగుచు

క. గరమాయె నోగిరముసా। గరమాయె వియోగమలిక • గతకస్తురినా
గరమాయె రేబగలు జా। గరమాయెం జెలికి విరహ • గతియెట్టిది యో. ౧౦

వ. మఱియు మందమందాందోళిత కలశ జలనిధి కల్లోల జాలధవళిత హాసచ్ఛవి తాధరంబు పూర్ణిమా శశాంకసంకాశ ముఖంబు కోటికందర్ప లావణ్యాధిక్య ముద్రా మణీయకంబుగల భద్రాయువు సురూపంబు హృదయంబున ధ్యానంబుఁ జేయుచు నేత్రగోచరుం డైనట్టులైన నలుదిక్కులం జూచుచు యౌవన సాగర చంచలాభంగ తరంగ పరంపరా సహితయు, ననురాగ రజ్జుసమావృతయుఁ గుసుమశర శరకీలితయు నభిలాష విప్రలంభశృంగార భావనా పరిభూతయు నిజరూప పరిభాష శల్యకీలితయు మలయానిలావధూతయునై ప్రియసఖులంజూచి యో యనంగ రేఖా విరహ పరితాప దుస్సహంబైన నాహృదయంబునఁ బాణిపద్మంబుఁ జేర్పుము, ఓ మదనమంజరీ, నాయవయవంబుల శ్రీచందనోదకంబులఁ దడుపుము ఓ వసంతతిలకా, నా

శర్కరీభరంబుఁ జక్కఁ జేయుము. ఓ తరంగవతీ కేతకీసుమపరాగంబు పయింజల్లుము. ఓ కందర్పమాలినీ, శైవాలజాలకలిత వ్యజనంబుల విసరుము. ఓ చిత్రరేఖా నా చిత్తవిత్తాపహారకుండైన పురుషరత్నంబు చిత్రపటంబు లిఖింపుము, ఓ విలాసవతీ ముక్తాఫల చూర్ణంబు నిక్షేపింపుము. ఓ సఖీ నళినీ దళచయంబున నా పయోధర యుగళంబు గప్పుము, ఓ సంచారికా కనకకదళీపర్ణంబునఁ జల్లనివాయువు సంచరింపఁజేయుము. ఓ కాంతిమతీ బాష్పంబుల పనయింపు మనుచుఁ బలికి నిరుత్తరయై యించుక నిదురించి యులికిపాటున నులుకని పరిజన ప్రయత్నంబున గృహీత జీవితయై యున్నంత. ౧౧

మత్స్య కూర్మాంగ విలసన ♦ మహిమఁ దనరు
సరసిజానన లావణ్య ♦ సరసిలోన
శంబరాహితుఁ డడరి జా ♦ లంబు వేసి
కలయఁ దజ్జీవనంబెల్లఁ ♦ గలఁచి కలఁచి. ౧౨

చ॥ కరువలి త్రేఁకఁ దీరరయు ♦ గారడి లేఁదలిరాకు బాకుచేఁ
జరజరలాడు నయ్యెదఁగ ♦ జిక్కనఁ గాటవు పోటునర్వబి
త్తరి తతియింపరానిబలు ♦ తాప నితాంతదురంత చింతనా
శరవిరహార్తిఁ బెగ్గిలిన ♦ శౌశవధూతతి సేమరింపుచున్. ౧౩

సీ॥ అనవరతానిలో ♦ ద్ధతరజో భరచూత
నూతనస్మరభూత ♦ భీతయగుచు
కోరకచ్ఛురికాగ్ర ♦ కార్కైతకమూర్తి
మహితగతిజోవీర ♦ మహిమకలసి
వితతకుట్మలకింశు ♦ కతతిపాంథామిష
సహిత నఖవ్యాఘ్రు ♦ సరణి కులికి
నిరతోర్ధ్వ భాగసం ♦ చలపరాగస్థల
నలినీతలజ్వాల ♦ నునికి జడిసి

గీ॥ నికట కింజల్క పుంజకం ♦ టకచయంబు
కుసుమ రసదీర్ఘికాకూప ♦ విసరములను

దనరుచున్నట్టి యుద్యాన ♦ వనముఁ జేరి
తద్భయంకర వృత్తికిఁ ♦ దల్లడిల్లి. ౧౪

గీ. మఱియు శుకపిక ముఖసము ♦ చ్చరిత విరుత
భరితపరిలసదుపవనాం ♦ తరము శ్రవణ
కటుతఁ జేసిన నీసున ♦ కంప మొంది
సుందరీమణి వలవంత ♦ సోలిసోలి. ౧౫

వ. తత్ప్రదేశంబున శిశిరఘనసార విసరాపగా పులిన తలంబునఁ దుహినమలయజకృత కసరిత్పరిసరంబునఁ గనత్కనకారవింద బృందసరస్తట చందనవిటపిచ్ఛాయలనని లాందోళిత కదళీకాననంబునఁ బూర్వరచిత ప్రసూనతానవ్యూన శయ్యలందు సారసంభూత శిలాతలంబుల వసింపుచు విలహాదహన బంధ్యమానమానసయై సంచరింపుచున్నంత. ౧౬

ఉ. అయ్యెడ నెయ్యపుం జెలులొ ♦ యారపుటారమణిం దలంచితా
నెయ్యెడకేగెనో సకియ ♦ యేకతమేకత మానురాగియై
పయ్యెరసోకినన్ వనరు ♦ పాయపు పువ్వుల మేనులాడితా
నెయ్యెడఁ దియ్యవిల్తు వన ♦ మెయ్యెడ హాయని త్వరింపుచున్. ౧౭

క. రోయుచు నిదియేమని తల। పోయుచుఁ బెగడొందికుంది ♦ పూఁబొదరింటిం
డాయుచు లతికలఁ బాయం। దోయుచుఁ బొగలెగయువగల ♦ లోఁబొరలంగన్

గీ. మంజుకుంజాంతరసమేధ ♦ మానమాన
సీయరమ్యఘృణీమణీ ♦ నిబిడమైన
వేదిమీఁదను వసియించి ♦ విరహఘూర్ణ
మానమానసమున నుండు ♦ మగువఁ జూచి. ౧౮

మ. పడతీ; సాహసముల్ వియోగభరము ♦ త్పాదింపగా మమ్ములన్
విడనాడిట్టులఁ దియ్యవిల్తు వనమున్ ♦ వీక్షింపగావచ్చినన్
జడుపింతైనను లేక భీకరశరా ♦ సారంబు ఘోరంబుగా
వెడవింటన్ బరఁగించునించు విలుతు ♦ న్వేడంగి మాశక్యమా.

శా॥ రోలంబాలక; మానినుల్ జగతిలే । రో॥ నీవతేణ్ వేదనా
లోలత్వంబునకోప్పి సుప్పిరిగనీ ♦ లోఁబాయకున్నట్టియా
బాలామన్మథుఁడై ధరాతలమునన్ ♦ భద్రాద్రియువణ్ రాట్సుతుం
డీలోనణ్ బచరించుగాన వగనీ ♦ కేలేకురం గేక్షణా ౨౧

చ॥ తెలికనుమీలు వేడిఁగను ♦ తేకువవచ్చిన నీటివెల్లితోఁ
గలయుముడింగి మిట్టిపడ ♦ గామరుఁడాత్మజ యాంకముల్ చలా
చలతనుఁబూననోపవని ♦ సారెకుఁ గోపము జేయునంచు నె
చ్చెలు లుపచారభేదములఁ ♦ జేయ దొడంగిరి యానెలంతకుణ్. ౨౨

తే॥ బిసకిసలయ భుజపాణులు। బిసకిసల ప్రముఖవస్తు ♦ భేదంబులనా
బిసరుహనేత్రకు మృగనా। భిసురభిపాత్రకు నొసంగ ♦ భీతిలి తమల్లో. ౨౩

సీ॥ జిగిపెంపు గలకెంపు ♦ చిగురుటాకుల సొంపు
లంగారములరంగుఁ ♦ లావహింప
నడరుపీఁచోపుల ♦ వడలెహ తెగనియూ
దుడు క్రోవుల తెరంగు ♦ దొలుతఁ దెలుప
నెనయజొబ్బిలనంత ♦ టనలందు గందంబు
మొగివెలిగారంబు ♦ సొగసుఁజూప
మేదురస్వేదోద ♦ కోదయసంతతి
కలయఁజల్లిననీటి ♦ చెలువుఁజూపఁ

గీ॥ గనలుసన సెజ్జయు హసంతి ♦ కళలనీనఁ
జెలియ యుడిఁగుందసప్తముద్రఁ ♦ జేసికటించె
సతినుఁడిను స్వర్ణ కారకుం ♦ డనుచు వగచి
రింతులొక్కింత చింతదు ♦ రంతముగను. ౨౪

వ॥ మఱియుఁ జిత్తజాయత్త చిత్తయగు బిత్తరి యుత్తరుణీమణి లోనరించు నో
జపుఁ గఱపు విరివరప్పుపైఁ బొరలుచు జగురువిలుతుమగంటిమి సెగపొగలెగ
య దిగులుఁగొని మిగుల నగలఁబొగిలి నొగిలి కన్నీటి మేటియేటి వరుద బరుపై
యుల్లలదా యుల్లకజ్వర ప్రతప్త కార్త స్వరమణిగణప్రభామండిత కుండలం

బులఁపై నావరించి చూత్కృతులు నిగుడింపుచు సిరులొసరవగు కుచగిరులపైకి దేరవారి తోరంబులగు తారహారంబుల వికారంబు నొందించి పులకలమాంకూరంబులకుఁ దన్నిరుచందంబు నొందుచు నందముగనలందు గందమునఁ జొందుపరచిన మెకపు గోవజవ్వాజి యొప్పిన కప్పురంబు కుంకుమ మొదలగు ప్రశస్త వస్తువులు కరంగి కుర్వంగట దొరంగు మకరికలాపంబుల జిగిబిగి బాయు గండమండలం బఖండ పాండిమ పిచండిలంబై తోచరుఁచిర చికుర నికురుంబంబున దొరయు విరిసరంబులు పరిసరంబు మెరయ మిసిమిగల పసిడి మేనులు కసిగ్గంద నడుగడుంగున కుడుగని జడివిడిన పువ నొడలి చిరుచెమట నిగుడుచుండ వియోగావస్థ నవసిన సద్దెసల గుసగుసలఁబోయి మసలుచు బిసరుహాలోచనలు తటస్థోద్దీపన వేపమానమానసయగు నా చిగురకుఁబోడిం జూచి:

సీ. సంతత సురసాల ♦ కాంతఫలాహార
 సమయంబుగల శుక ♦ సంచయంబు
వరసుమనప్రియా ♦ చరణ సవనభూమి
 గలయవర్తిల సాధు ♦ కరగణంబు
మధురసాయన నియ ♦ మచ్ఛదస్వాదనం
 బ్రమరస్మనువన ప్రి ♦ యవ్రజంబు
సరసీ భువనదేశ ♦ జంఘాలగతులచేఁ
 బెనుపొందుఁ బరమహం ♦ సనివహంబు

గీ. విభవ యోగాగమోల్లస ♦ ద్వివిధఫలద
మాధవాలోక నామోద ♦ మహిమఁదనరి
పరగు నివియెల్ల నీకేల ♦ బాధఁదలఁచు
నింత చింతిలనేటికి ♦ వంతనొంది. ౨౬

సీ. శృంగార రసమొల్క ♦ చెలికొప్పు మొయిలను
 గనిడాయవచ్చుశి ♦ ఖావళములు
రాగవిస్ఫూర్తితో ♦ రంబులౌ కుచమంజ
 రుల నటింపగఁజేరు ♦ సిఖులగములు

మధువినోదము దెల్పు ♦ మహిమ నీగతి లోచ
నాబ్జములఁ గనవచ్చు ♦ హంసతతులు
నతిమధురతఁ జూపు ♦ నధరబింబము దారిఁ
గెరివచ్చు నుదార ♦ కీరవార

ఆ. మలర నింపుసొంపు ♦ హావంబు భావంబు
వహిదలిర్చు నీయ ♦ వయవరుచులఁ
గొసరి దెసల మసలు ♦ ననమబాణబలంబు
లేలఁ జాలిఁ జేయు ♦ లోలనయనా. ౨౭

సీ. శంబరారి యటన్న ♦ జడియంగ నేటికిఁ
దగ సరిత్వము ముందుఁ ♦ దలఁచనపుడు
కుముదబాంధవుఁ డన్న ♦ తమకింప నీకేల
విగతబాంధవముగా ♦ వించినపుడు
కుసుమాకరుండన్న ♦ నుసురునందఁగ నేల
దోలినిరాకరవృత్తిఁ ♦ దలఁచినపుడు
చెలి వనప్రియమన్న ♦ నులుకంగ నేటికే
ప్రియమార్గమున దానిఁ ♦ బిలువనపుడు

గీ. కాంత నామాంతరంబుతోఁ ♦ గలిసియుండు
శంబర కుముదకుసుమవ ♦ నంబులకును
వనిత యొక్కింత వలవంత ♦ మనములోన
నిలుపకుము నీకు మేలగు ♦ నిక్కముగను. ౨౮

చ. నెనరునఁ జిత్తగింపురమ ♦ ణీరమణీయ మదీయ వాక్కులన్
దనుతవహింపనేల వని ♦ తావనితాంత తనూవిలాసయా
వనటలఁ జెందనేల మగువా ♦ తగవా వనజాస్త్రశస్త్రముల్
వెనుకొనవేగ నేల పద ♦ వేపద వేగ మెలర్ప ముంగలన్. ౨౯

చ. తెలసిన దానవాదువుర ♦ తిప్రయునాజ్ఞల మీరనట్టి రా
చిలుకలు కోవెలల్ మనకు ♦ క్షేమము నేమముగాఁ గోరునీ

వలయుకుమమ్మ సొమ్మసిల • కమ్మ శుభంబగునమ్మ నెమ్మదిన్
దలఁకక నమ్మవమ్మ రుచి • ధాళధళీ వికచాబ్జలోచనా. 30

క. అనియూరార్పుచు నుపవని। మునవనితామణికిఁ బ్రొద్దుఁ • బుత్తమనుచునే
పూన్కై దండల నిడుకొని। వనజనయన లిట్టులనిర • వారణ గరిమన్. 3౧

సీ. చూచితే కొమ్మకొమ్మల • సొంపులింపు
లతల జతలను బుష్పసం • తతుల రుతుల
వెలయు నళులను శుకపికా • వళులచెలుల
గ్రొందలఁ బొదలెడు పొదలసం • పదల నిచట 3౨

చ. అలవియె కాంతకాంతలతి • కాంతనితాంతచర స్ఫురన్మరు
చ్చలదళ జాలజాలనివ • సన్నవ సత్కలికా కలాపసం
వలయిత నూతనాతనువి • మానసమానర మావిలాసవ
త్సలలిత కాయమాన ల • సంచులమించు మతింనుతింపఁగా• 33

చ. కనుఁగొనవమ్మ యమ్మ ... • కావలియుంచిన మించు తేటులీ
వనజమరంద బిందువుల • వైపులఁ జక్కగ మెక్కిసొక్కుచున్
వనిఁ గలయన్మెలంగుచు న • నాదగు గేవఁగి బోదులందు వి
చ్చలవిడిఁగూడి యాడెడు వె • సన్ వికచోత్పల పత్రలోచనా. 3౪

ఉ. చూచితివా వనీగమన • సూచితరేచిత కీరవారవా
హోచలితావనీజ జని • తాంచిత సంచితమా పరాగమున్
రోచదుదారమారజయ • సూఢకసధ్వజ చేలలీలగా
నోచెలి యీదిశాసరణి. నొరగవారుట మంచిదేజుమీ• 3౫

చ. చెలి;కలయంగఁ జూడుమిదె • శీర్యదుదార రసారుహోత్పత
త్ఫలవిలసద్రసప్రసవ • పంచమరాగ పరాగభాగభా
గలిపిక శారికీరసము • దంచితపద్మ మరందబిందుతుం
దిలజల పత్రచిత్రితవి • నిందితవారి సరోవరంబునన్• 3౬

క॥ లలనా, కలకంఠవ, యో। లలనాకలనాదగీత ; లహరీవిహార
చ్ఛలనాత్మాత్మజ విశిఖాం। చలనానాసూనముల వె • సంగనుమించటక ♦ ౩౨

సీ॥ అల్లిబిల్లిగ నల్ల • సిల్లుమల్లియ తీవ
తెల్ల మొల్లలఁగూడి ♦ యింపుతెసఁగఁ
బజ్జపజ్జలనున్న ♦ గుజ్జుగొజ్జంగుల
తావిమావుల తావు • లీవుకొనఁగఁ
జాలుగా మేత్రైన • యేలకిచాలుపుల్
గొప్పకప్పురముల ♦ నుప్పతిలఁగ
జెంతల వింతలా ♦ బంతిసేవంతులు
గున్నపొన్నల వెన్నె ♦ లెన్నఁగొనఁగ

గీ॥ నెలమువలిగలిగిన వేల్పు ♦ యేటినీటి
తోటివీటయి గాటమా • తేటనీటి
జిలజిలననేలఁ బలుచలు • వలను దనరు
దోనలఁ బెనుఁగొను తెలిలాక • లనువుగను మీ. ౩౩

సీ॥ కొమ్మ నిమ్మళపుతేఁ ♦ గొమ్మలఁ గదలించి
యింపు నిద్దంపుపూ ♦ జొంపమరసి
తొగరుచేఁ బొగరెక్క ♦ జిగురుపిండుఁగలంచి
విప్పుకప్పురముల • కుప్పలెక్క
మొల్లమా వట్రవేళ్ళ ♦ చల్లపందిరులంది
వెలివలి • తొగలను • గలసిమెలసి
గనిగట్టు కొనతట్టు • ఘనుగుపట్టరయుచు
నల్లబిల్లగుమల్లి ♦ యలనుజూచి

గీ॥ కలకలను పులుగులఁపడ • గలనుకొలను
లరసి బలుగొమ్ములల మొకంబు ♦ రమరుచెక్కు
చెమరులల్లార్పుచును గుమ • గుమను వలపు
వెలయుదక్కిన పూదెమ్మ • రలనుగంటె ♦

## చతుర్థోల్లాసము

చ. సకిమకిరాంకుఁడాగలను ♦ సారెకుమీరుచుఁ గేరునారులం
జికిలి మెరుంగులీనునన • చిల్లలపెల్లున నల్లిబెల్లిగా
నకరుణ నేయనాయెడల ♦ నామని యీయమని వాతిగోతులం
జకచకలీననించెననఁ • జక్కిమెలంగె మరందదీర్ఘికల్. ౪౦

పంచచామరము

పరిస్ఫుటంబు లయ్యెఁ దీర • భాస్వరద్రుమప్రసూ
నరాజరాజి మచ్చరత్స ♦ నతనేందు కాంతవ
ద్దరీ ఝరీ తరంగసంగ • తప్రచార సారసో
త్కరా కరావనీపనీప ♦ తత్ప్రియాళికల్ చెలీ

క. సుమవన సముదయ సముదయ ద్దమితమ రంధాదనోద్ధిత స్వనసీల
భ్రమదభ్రమద భ్రమద భ్రమదవ్యూహంబు గనుము ♦ పంకేజముఖీ ౪౧

వ. అని మఱియు నిట్లనిరి. ౪౨

సీ. భూపాల తనయయీ • పొగడపట్టుఁదలంపఁ
బొగడపట్టగుచుండి • నిగుడుచుండు
నలరుదానిమ్మల ♦ హరిణాక్షి కంటివే
నిమ్మల కడసమ్మ ♦ దమ్మొసంగు
తరుణిరో దేవగాం • ధారయ గ్రామంబు
నీకళావతి నివా ♦ యించి తేని
యీనదేశక్షితి • నెనసిన పొదలెల్ల
నేచిపూచి తలిర్చి ♦ కాచియుండు

గీ. సరసమై తగిన వసంత ♦ సమయమునను
చాన యౌవనమేనాట ♦ నైనఁగలదె
వెలఁదియిచ్చోట నుదమాల • వితతిననిచె
నాతి యనురాగములమించి ♦ ఖ్యాతిఁబూని. ౪౩

క. కమలము ఖాళియగుచుహిమ|నుమితవనగుమనకుసొంపుఁ • జూవఁ దగదె యా
రమణిరతి రాజుకాబీ| రము కా నదు విరహిణు ను • రాపొనరించుక్ • ౪౫

గీ. నిబ్బరంబై రవిలివయి • గబ్బిమలయ
మారుతంబిచ్చటఁ జరించు • మారుశేక
విశ్రుతానంద భైరవ • విభవుఁడైన
మారునకుఁ దేరగుచునిది • మలయుచుండు. ౪౬

క. విరులంటగ వల*దన్నా| సరి*యని కోపంబుసేయ • సమకట్టితివి
త్తుకిమారువేడి తూపులు నిరతము శాసించకున్నె • నీరేజముఖీ.

సీ. అతివ; కన్నడ *గౌల* • లతివదనంబునను మ
ముక్కల విడనాడిట్లు • మెలఁగితేని
యబల; *నీలాంబరి* • వై యొంటిపాటునఁ
జరియింప నేటికే • విరహమునను
చెలియ; *సాదాహిరి* • తులయూర్ధి కాతత్తుల్
చలియింపుచున్నవి • నెలవువలన
పడతిరో; మారాచ • పట్టివై యీ వేళ
ధైర్యమించుకలేక • తలఁకనేల

గీ. చూచితె వ[illegible]ళి యిప్పుడే • యేచి చెవులు
చెవుడు దడ[illegible]మోయుచున్నదు • చిగురుఁబోడి
తరుణి యిచ్చోట పున్నాగ • తరులు కుసుమ
విసరములు మించెఁ గనుగొ[illegible] • విశదమతిని.

సీ. సకియరో నాగమ • ల్లికనుజూచినశంక| రాభరణంబున • సలరుచుండు
ఘనవనీపదము మో • హనమై కనుంగొను| వారికిన్దోపుగా • మీరుచుండు
నీ*తోడి*రాచక • న్నెలఁ గాంచితినిగాని| విరహార్తి నిటువలె • వేగలేదు
*రేగుప్తి*లీలచేఁ • జోగుచు నీచక్ర • వాకదంపతులుండు • వనతి గనుము

గీ. సిగ్గు[illegible]యి మను*కల్యాణి* • సొంపుమీరి
యావనిలోపలఁ గల్యాణి • వై మెలుంగు
పూరిత మనోరథస్థితిఁ • బొలిచియుండు
[illegible] మనుచునూ రార్చి రత్యంత • వినయమునను

క. వినుసహసావేశ్రత్తో। చిన వారినివిడువవలయు ♦ సేవకధర్మం
బునవర్తించిన వారిని। వనితామణివీడఁదగదు ♦ వసుధాస్థలిలో. ౫౦

సీ. *కేదార గౌళాంధ్ర* ♦ కేరళా దిక దేశ
ములనైన నిటువంటి ♦ ఫలితవనము
జూడలే దెచటనీ ♦ *సురట*కోకిలకీర
ములఁజెందు మాకంద ♦ ములఁదలిర్చి
*సారంగ* నయనవే ♦ సారంగనేటికే
ఘనవిప్రలంభశ్రేం ♦ గారమునను
బహుళన*కాంభోజ* ♦ పద్మాకరంబులఁ
జూచితే యిచ్చట ♦ సుందరాంగి

గీ. కాయజుఁడు *కానడా*వియో ♦ గమున నొంటి
వై చరించిన నిన్నేచె ♦ నంబుజాక్షి
ధవళ సుమములు కురువక ♦ తరులవెలసెఁ
గలతఁ జెందగ నేటికే ♦ లలితగాత్రి, ౫౧

క. పడతీ విరహ భరంబేఁ। గడఁదేర్చెద నాయటంచు ♦ గళవళపడుచున్
బడలికఁ జెందఁగఁ దగదీ। యెడ,మావచనమ్మునమ్మ ♦మిందునిభాస్యా. ౫౨

గీ. చెలియ, యీవని శ్రీరాగ ♦ కలనఁజెంది
చూచువారల కిష్టమై ♦ సొంపొనర్చు
నతను ఘంటారవంబుల ♦ ననుకరించి
పికసమూహంబు మ్రోయు - నుత్సుకత జెలఁగా. ౫౩

సీ. కుంజ ల్ మాలతీ ♦ పుంజముల్ తీరభూ
కంజముల్ వేష్టిత ♦ గుంజములును
సాలముల్ కుందాల ♦ జాలముల్ వితతప్ర
వాళముల్ విలసదా ♦ సాలములును
పూగముల్ కల్పసం ♦ యోగముల్ శ్రీచంద
నాగముల్ మల్లికా ♦ భోగములును
కీరముల్ భృంగప్ర ♦ చారముల్ కలకంఠ
వారముల్ మధువారి ♦ పూరములును

గీ. గలిగి సవిధ వివిధకుట • గళితలలిత
కుసుమ కిసలయ విసరను • వసన విలస
నకనదవశీతల మున్నృప • నలినముఖుల
సుఖమతుల నొసరించెను • సొంపుదనరి. ౫౫

శా. మందార ద్రుకుటీ తటీవిటపయు • జ్మల్లీమతల్లీగతా
నంద ప్రోదిత మన్మథాంకజయగా • నప్రోల్ల పత్కిన్నరీ
బృందాలోక సుఖైకశోక యువతి • ప్రేమాస్పదీభూతమా
రందోదార సరఃప్రతీర మలరెఁ • రాజాననల్ చూడఁగా. ౫౬

వ. మఱియుఁ దత్ప్రదేశంబున నహరహర్విహారదవక్రిచక్రాంగ ప్రాంచచ్చంచూ
పుట తృటితసాళీ నాళంబులవలస మెలఁగి వెలికుబుకుచు చకిజలంబుల తుం
పురులు పొంపుజూపఁ బంపకింభులచెంత నిద్రించు చమరీమృగంబుల సమరి
తామరసపత్ర పాత్ర వ్యాకీర్ణ వివివర్ణాసూన సంతానంబులు శోభనాంగ రం
గవల్లులై దనరఁ దద్విక్షణతాది దృష్టి పేటు ద్రాక్షానికాయమానాంతర స
మాసీన కస్తూరికామృగంబులఁ జూపట్టుచు నుద్ధామసామజ సమకంట
కిఫలమూల ఫలబంధుర గంధానుసంధాన నిగళాయమానసమాన మధుపా
ళి జాలంబు గనుంగొను సారంగంబులు సాంద్రచంద్ర రంభాస్తంభాను గళద
సమహిమవాలుకా హంసతూలికాశయన సంకు మదమృగంబులఁ దనరియు
పటుపటీర కుటీరప్రదీపీ భూతప్రభూత గంధిల గంధఫల్య వికల ముకుళంబుల
కుఁ గరంబులుచూచు విగత ఖరకిరణవిహారణ సమంజస కింజపుంజాంతర ని
ద్రాప్రబుద్ధ భద్రేభంబులు గలిగి కనత్కనకకందుకాకారసహకార ఫలంబు
లన్గని తత్కనలయ ఖాదనామోదనా కుంఠిత కంఠకలకంఠంబుల నొనరి
మంజరీసంభూత భూతలసమానమానిత చేతోమోదంబుల మీరు కీరవారం
బులఁ దనరి మఱియు. ౫౭

క. విచికిల వీరుధ్వ్యాలయుత! నిచులాంగణ సైకతాది • నిర్మిత వసుధా
పచిత విధానవిధాన సు! మాచయముఖున కిచలకచల • మున మొనరింపఁ

గీ. చూచి తలయూచి చేచాచి • సోనతేనె
లీను సూనప్రతాపంబు • లానిమాని
కములగుమ్మిఁ బెన్గొనుపటి • కములపడకు
లడరఁ బడఁతుక లింపులు • గడలుకొనఁగా ౫౮

సీ. కీరవాణియొకర్తు ♦ సారెసారెకుఁ జేరి
బింబాధరాయని ♦ పిలువఁబోఁడ
గలహంసయానయొ ♦ క్కతె ప్రమోదంబున
బిసరుహాననయని ♦ పేరుకొనియెఁ
గలకంఠనినదయొ ♦ క్కతె మేలమునమించి
పల్లవశయయని ♦ పలుకరించె
సింహమధ్యయొకర్తు ♦ చెలఁగుచుఁ జనుదెంచి
గజగతియని పిల్చెఁ ♦ గౌతుకమున

గీ. కమలగంధి యొకర్తువే ♦ గ న వచ్చి
యలినమానకచాయని ♦ పిలచి నిలిచె
నిటుల నన్యోన్యనామంబు ♦ లెంచియెంచి
చెలఁగి యారామలారామ ♦ సీమలోన ౬౦

వ. విరహవేదన నొందు నా రాజసుందరికిఁ బ్రొద్దుబుచ్చఁదలంచి. ౬౧

క. దరహాసమొనర్ప మహా। దరమునఁ బొన్నలుదలిర్ప ♦ దరమాకనస్త్రీ
దరమోప వనోదరసుం। దరగతిసీవనముజీవ ♦ నము మనకతివా. ౬౨

గీ. రమ్య పరిరంభములను కు ♦ రంటకంబు
లేచి చూచి రసోచిత ♦ రోచిదనరె
మనము బెనుగొనఁ గనుగొని ♦ కొనల ననలఁ
దనివిగ నొసంగ ననుమయ ♦ మనఁగవలదు. ౬౩

సీ. ప్రసవస్థలంబులఁ ♦ బలుమారు దిరుగుచు
ద్విజపంక్తి మిక్కిలి ♦ తేజరిల్ల
గణికా సమూహంబు ♦ కడనుండి పల్లవ
సందోహమానంద ♦ మందుచుండ
గంధోత్తమావనిఁ ♦ గదిసి నృత్యం బల్ప
మధుపవ్రజము సంభ్ర ♦ మమువహింప

గమనీయ భూవరా • గంబులను వహించి
గంధవహుఁడు మంద • గతులఁజూప

గీ. విమలభువనస్థలీ • వసో విభ్రమంబు
దనరఁ బద్మిను లతిముదం • బునదొలంగ
సార్వకాలిక వైభవా • స్థానవిపిన
వాటిలోపలఁ దిరిగిరాఁ • బోటులవుడు. ౬౫

శా. ఆశ్వాసంబు లొనర్చినన్ బొగడలా • హాయేమనన్ వచ్చునా
విశ్వాసంబులు నావిలాస ... లు నా • విఖ్యాత దాతృత్వముల్
శశ్వత్సుందరదివ్యగాత్రల మహా • సంతోష మొందించెనా
విశ్వాసః ఫలదాయకో యనెడు ము • న్వ్యక్తముందప్పునే. ౬౬

ఉ. గానము సింధువారనగ • కల్పితపల్లవ పుష్పసంపదా
దానముతాన నంచయ ని • దానము రాగవిశేష మిశ్రసం
ధానము శ్రోత్రసమ్మద వి • ధానము చంద్ర శ్రీ సుఖోదయ
స్థానము నైకనందగని • తాంతముతద్వన సీమలోపలన్. ౬౭

మ. అదలించున్మదమొంది ప్రేంకణము ల • త్యంతంబు కాంతాతతిన్
బొదలించున్ సుమపల్లవాసుల లతా • పుంజాంత రేలాతతిన్
మెదరించున్ మధుపాళిపాళికలన • మ్రిూభూత వీరుత్తులన్
గదలించున్ దదుదారకైశికలస • త్కల్యాణ భూషావళిన్. ౬౮

చ. జిలజిలఁ దేనియల్ వెలికిఁ • జిల్కఁగఁ గుల్కెడు ముద్దుపల్కులన్
గలయజనింప సంగెగలు • కమ్మని నసలానవింపుసొం
పులుగల పువ్వు జొంపముల • ముందుకు ముందొనరించి మించుకాం
తల నలరించె నౌరప్రమ • దంబున *నాసుర కన్నెలెన్నఁగాన్

గీ. భాసి ముఖవాసనావాపి • తానవంపు
తావులంటుచుఁ గేసర • తరువరముల
విరులనువగు పరవుల • దొరలనొసఁగె
నసమ కుసుమాంగులకు విహా • రానుగతుల. ౭౦

*నంబరవాసులెన్నగా

క॥ ముదవాటిదవ మదవతులకుం। బదతాడన పీడనములఁ ♦ బల్లవముకుళా
స్పద రక్తాశోకములు వి। శదకళలంబొదలి కుసుమసంతతి నొసఁగెన్. ౨౧

క॥ అంటినవెంటనె పువ్వులు। నొంటుగఁగం కేళి కేళి ♦ నొనరింపుచుఁ బూ
వింటను గెంటనిబంటగు। వంటను బుట్టించుచతుర ♦ తన్విలసిల్లెన్ ౨౨

వ॥ ఇవ్విధంబున దోహదక్రియలొనరించి ౨౩

క॥ ఆరామాక్షణు లయ్యెడ। నారామమునందుఁగడునొ ♦ య్యారంబుగసం
చారంబొనరించిరిసము। దారూఢిన తానతాన ♦ తానతమూఖులై ౨౪

చ॥ లలిత శతాంగవిలాసపిక ♦ లాపకలాప కలాపకుంతలల్
స్ఖలితమరంద కందళిత ♦ సాలరసాలకిసాలఖాదసం
చల కలకంఠ గానసుఖ ♦ సారససార ససారసాఘులన్
నెలకొను భూతలంబులగ ♦ ణింపుచు నింపుజనింపఁ బోవుచోన్. ౨౫

క॥ హేలావతులై దగినమ। హేలాతతు లుపవనోప ♦ హితవిహితవిధా
నైలాతత డోలామత। ఖేలారతలగుచు నగుచుఁ గేరుచుఁబోవన్. ౨౬

చ॥ సవిధగధాతకీతరుజ ♦ జాలకజాలక జాలకాంతి మ
త్ప్రవిమల సూనసంభృతప ♦ రాగ పరాగ పరాగతాళిసం
భవకలనాదమే దురిత ♦ మానస మానస మానసంతత
స్తవనదముల్ సదేశజక ♦ దంబకదంబ కదంబులై తగెన్. ౨౭

క॥ లలినీ పవనాంతస్థిత। ఫలినీలతి కారతిప్ర ♦ పదభవవికస
న్నలినీపత దలినీయుత। మలినీకృత పదము ముదము ♦ మదిఁబొదలింపన్ ౨౮

క॥ ఆరామాంతస్సంచర। దారాములు మాలియాని ♦ లాప్తిమరందా
సార సుమాసారలతా। సారగృహాంతర గతాళి చయములఁగనుచున్. ౨౯

చ॥ వలదురు విహానచంచదని ♦ వారితవారిత వారిజాకర
స్థలకమలాళిచెంత సత ♦ తంబు తతంబు తతంబుగాఁగ నం

చల దళచర్మ సంచయుని • శౌరదశ్చారద శ్చారదంష్ట్ర శ్రో
వల గరిగించి రింపుగల పాటలఁ • బాటల పాటలంబులన్. ౮౦

క. నాళీకముఖులు మదనుని। నాళీకములనఁగఁ దగియు • నారతవికస
న్నాళీక మృణాళీకము। నాళీకలనాదమోద • రసికసరసులై. ౮౧

చ. వనిఁ బరికించి కించిదలి • వర్ధవిహారముఁ గాంచి కాంచికా
ధ్వనులకుఁ జేరిచేరి కన • దంచితహంస శుకాళికాళివహాం
తనపికచక్రచక్రకములు • తక్కైమలన్ వెలయంగ నంగ ళ్ర్
తనివిననంగ నంగజాత • [illegible] [illegible] పన్నగ ॥ ౮౨

క. శ్రీహాదాగత యువతుల। కాహాదనుప మితవికసి • తాగసుమఫలా
ధారామధుధారాబహు। ధారారట దలిసికాది • ధారలువోచెన్. ౮౩

వ. ఇవ్విధంబునఁ దోఁచ విహరింపుచుఁ బుష్పాపచయంబు జేయందలంచి. ౮౪

రగడ

సారసారరజోభరముకా • సారసారమునైన తలిర్చును
భూరిభూరి నగంబు లిప్పుడు • బూచెఁ బూచెలు వంబుదనరఁగ
జాతిజాతి లతావితానము • జాలజాలక ములను స్థలకం
జాతజాత సుమంబులను వెద • జల్లఁజల్లఁదనంబు దగుని
ప్పాటఁ బాటలఁ దరులు దగఁ బరి • పాటిపాటిత • తామరసకర
హాటహాటక గర్భవాహ • లమరసమర నగంబు లలరెను
గోరగోరంటలను జిదుమం • గోరగోరకములు తొలంగం
బారుబారులు గట్టి సరసపుఁ • బలుకుపలుకుచుఁ గీరచయములు
మలయమలయ సమీరణుఁడు వే • మరుమరుండును నెమ్మనంబులు
కలఁగఁగలఁగుడు పరతురదెని • కంబు కంబు సమానగళయు
క్కురవ కురువక తరులునిక్కలి • గొట్టుగొట్టు పడంగఁ జేయఁగ
విరియ విరియఁగఁ బూయఁదలఁపని • వింతవిన్ తరుణీమణిరో యీ.

సీ. హరిహరోపలకుట్టి • మా వనితలములు
　　కాలాగరుజధూప • కళవహింప
బద్మరాగప్రభా • ప్రాజ్య స్థలములునీ
　　రాజనభాజన • తేజమొనయ
శశికాంత కాంతభూ • సరణులు శ్రీగంధ
　　బంధుర పాత్ర ప్ర • భావమొంద
సురభికుంకుమ్మరజో • భరధరాభాగంబు
　　సాక్షితచ్ఛదపుటం • బగుచు నెలయ

గీ. బహువిధాగమ కుసుమ సం • భవపరాగ
నికర మవ్యక్త పరిమళ • నియతిఁ దనర
రమ్యరమ్యని కలకల • రవవిహంగ
రుతినొసంగించె నొక్కస • రోవరంబు　　౯౫

క. చూచి తదోచితవృత్తుల కాచిలుకల కొలుకులలరి • యంబుక్రీడా
ప్రాచుర్యసౌఖ్యమునఁద తే్సచనమునఁ దనరి తద్విశేషమరయుచుఁ　　౯౦

వ. చనంజన వసంతలక్ష్మి మాధవ సంభోగ క్రీడాసుందర మందిరాయమాన మానాతీతనూతన లతావితాన సమంజస కుంజంబును తదీయ హంసతూలికా కేలికానల్ప తల్పసూచక రోచదుపాంతకాంత ద్రుమాంత లతాంత పరివ్యాప్త సాంద్రచంద్రోపలస్థలంబులునునలయ వలయీభూత సదేశరిరం సుహంస కంబులును, తత్సమయ జన్యానోన్యస్య గళరవాయిత కలరవ కోకిల ముఖసుఖ వికార విహగరుతంబులును, వితతరతికూజిత యాచ్నార్థ ముహుర్ముహురాభాషణాయమాన కపోతజాత హుంకృతులును, తద్భ్రమ జలకనత్కోకానేకంబును కుచమండల మండిత కుంకుమ సంకుముద మృగమదాది బంధురగంధ రసాయిత నవిధ వివిధకుసుమ విసరానర్గళ నిర్గళన్మధూదకంబును, ఇతతస్తత్క్షిపతిత విలులితాలకజాలాయమాన పరితః పరిభ్రమద్భ్రమరస్త్ర సముదయంబులును భా

నురాశ్వాసా నిలీకృత మధుపానార్థ సంచరచ్చంచ్చంచరీక కానే గరున్మరుత్ప్రవ
రణంబులును, ఘనస్తనసమ్మర్దపీడలూనతారహారాయిత సమీరకుమారాందో
ళిత సుమితలతా వితానంబులును, మధ్యే మధ్యేరతి ఫలమధుసంగత భృంగా
రూభవన్మరంద బృందభరిత పత్రపుట పాత్రనికరంబును గలిగి చెలువొందుచు
విప్రవరసేవ్యంబై సుమనోంచత్సవన భూమి తెఱంగునఁ గాంచనప్రభాభిరామం
బై భూరి ధరాధరంబునఁ జందన పల్లవ। విలాసాస్పదంబై గణికానివాసంబుగతి
నతివిచిత్ర పత్రరథపాలన శీలంబయి విగ్రహభూతంబు పోలుపున నుత్కలికా
సమన్వితాంతరాధారంబయి శ్యామానికరంబునమించి జడాశయుప్రసాదకృద
భిరామంబయి దేశికోక్త మహావాక్యంబునంనగి, సమీరకుమార విహారంబై
యయా రామపద సాన్నిధ్యంబునందగి దేశోపలక్ష్యమాణశంఖచక్రసుపర్ణ విష్వక్సే
నాది సమన్వితంబై మాధవలోకంబు వడువున వశీకృతరాజ హంసమండలము
కరచ్ఛప కుందాద్యలంకృతంబై శ్రీదవైభవంబురీతి సుగంధ బంధుర సుమ
నోని వహంబై దివ్యనికేతనంబు భాతినరుణ హరిత్పత్త్రి విలసనంబై లోక
బాంధవు పథంబుచాడ్పున నిగమాంతామోదచరద్వ్యాస ప్రియాలాపకలాపం
బై కమలభవసదనంబున మించి భద్రశకుని బాలవకులోపేతంబై కరణప్రదే
శంబురీతిఁ గర్కటమీన సహితంబై రాశివిలాసంబుగతి బుష్పవతాంతే
తస్థలంబైన ఖప్రదేశంబుఫక్కి బహుళరజోభరంబై గంధవహాగారంబునఁదో
చి స్వభామృతాధరంబై శుద్ధవస్తు విధంబున మెరయు సరోవరంబు రికసి
రుదంపుచు కుందరదలులు ముదంబున. ౯౧

స్థాపితతరణి హరివాయువి॥ ధూపల ఘనకనకనికష • శోపల శేఖా
రోపణ సోపానోపల। శోపరిభాగ్యాగధగ్య • మోగనురయుచుఁ ౯౨

సీ. లాలిత మణిమయా • లంకృతుల్ సడలించి
పంచాస్త్ర దివ్యప్ర • భలవహించి
శాలిచోలనిచోల • జాలంబు వెడలించి
సుమబాణ బాణవి • స్ఫూర్తిఁ జెంది

ప్రస్ఫురత్కంబరికా ♦ భారముల్ వదలించి
కందర్ప ఖేటక ♦ కళలఁదాల్చి
హేమవమౌక్తికపుష్ప ♦ దామముల్ సడలించి
కందర్ప తెరవారి ♦ గతులఁదాల్చి

గీ. వలిపె పావడలనుఁగట్టి ♦ వరవార్ద్ర
మేనులనలంది భృంగవి ♦ తానమలర
తవిలి, జానుద్వయసకటి ♦ దఘ్నునాభి
మాత్ర నీరంబులోనయ ♦ మ్మగువలలిరి. ౯౩

చ. చివురుమెఱుంగు జోండ్లసర ♦ సీజసమాజ్ఞపరంపరాజనం
జవ భవనత్సరోవరన ♦ సంభ్రమ సంభ్రమ దండజాదిసం
భవవిభవంబు లారయుచు ♦ బోయుచు డాయుచు వేయుచున్నదు
ద్భవనవ కేళిలాలసతఁ ♦ బల్మరు నోలయటంచుఁ బల్కుచున్. ౯౪

గీ. సారకాసార సంచార ♦ చారురేక
కాలమునఁ గ్రుంకి లేచిన ♦ గానవయ్యెఁ
దత్సరశ్రీది దృఙ్మాగ ♦ తద్విలసన
రాజరాజాన నారత్న ♦ రాజయనఁగ ౯౫

చ. వెలఁదుకలంగ కంతకున ♦ ఎనవినోదము లేర్పడంగ ద
జ్జలకలితాంగ శృంగములఁ ♦ జక్కగనాక్క మొగిన్బహిస్సలీ
కలనను జెందఁజేసినను ♦ గన్పడెఁదజ్జ విముక్త మౌక్తికం
బులు వెలిబుచ్చు దేవతల ♦ పోలిక జోడులుగూడి వేడుకన్ ౯౬

ఉ: శంబర నేత్ర యోర్తురభ ♦ సంబున నంబుజరాగ యోగ శృం
గంబునఁగంబులుంచి కల ♦ శంతులనొంచిన సాంద్రచంద్రికా
డంబర హాసభాసురత ♦ టంబులఁజేరి ముఖేందుబింబమా
ర్గంబులఁ దద్విలాసము మరల్చిరి ♦ సత్ప్రమదాత్త చిత్తలై. ౯౭

చ. సరసిజపాణిపాణిగత • చంద్రశిలామయ శృంగసంగత
స్ఫురదుదకంబులంజెలుల • ముద్దుమొగంబుల పైలగించినన్
దురుసుగ లఁ జూపి దీపిత వి • ధుంతుదశంకనొనర్చినన్ భయాం
తరమును జెందుచందమునఁ • దత్కరసారస మగ్నమై తగెన్. ౯౮

మ. ఆలీలావతులాసరోవర విహా • రానంద సందోహవా
చాలీలావ్రజ మాత్మదంత వసన • స్వాయన్మధూపేత వ
క్త్రాలోలాంబుజపాళిఁ గన్గొనుచుఁ దా • నాసక్తిఁ గాఁజూచినా
సాలీలన్ మరలించి రంచిత విలా • సప్రాభవోదారతన్ ౯౯

మ. లలనారత్నములంబుజాకరగనా • ళశ్రేణి ఖండంబులన్
జలదంభోజ సమానహస్తములచే • సంధించి తద్రంధ్రసం
కలితాంభఃకణముల్ మరాళములపైఁ • గప్పంగనాటంబలెన్
గలిగెన్ నాళమరాళసంతతికి లోక • ఖ్యాతి వైరంబిలన్ ౧౦౦

చ. చలమున రేఁబగల్ దపము • సల్పుచు మోములతోటి సాటిరాఁ
దలఁచెను సారసంబులని త • ద్దళముల్ హరియించి వాహినిం
గలపఁగ వద్దువద్దనెడు • కైవడి క్రౌంచము లిమ్ములైనతీ
రలలిత సాలజాల శిఖర • మ్ముల నెమ్మది మ్రోసెఁ జెచ్చరన్ ౧౦౧

గీ. సారసంబుల వాడలు • దూరితూరి
సారసంబులు వేడుకల్ • సలుపుచుండఁ
గలువగుంపుల వీక్షించి • కలువగుంపు
లగుచు జక్రంబు లోకవంక • సొగసొనర్చె ౧౦౨

క. కంజాతనయన కటువలెఁ • గంజాతానయనలీలఁ • గనఁబట్టినచో
మంజులవంజులకుంజస ముంజస సింజానభృంగ • మండలి పొదలెన్. ౧౦౩

సీ. హంసయానయొకర్తు • హంసదగ్గరఁ జేరి
హంసయానవ నటంచు • నటమటించి

గమలపాణియొకర్తు • కమలంబు జేబూని
కమలపాణి నటంచుఁ • గరము మురిసెఁ
చంద్రానన యొకర్తు • చంద్రవాటికఁ జేరి
చంద్రమూడ నటంచు • సంభ్రమించెఁ
గీరవాణియొకర్తు • కీరంబు దరిఁజేరి
కీరవాణి నటంచుఁ గేరుచుండ

గీ. మఱియు రంభోరు వొకతెరం • భలనుడాసి
రంభ నేనని సమ్మదా • రంభయయ్యె
నిటుల సద్దివ్య భూమినం • ఘటనమునను
త్రిదశభావంబు దలతురా • సుదతులెల్ల ౧౦౪

చ. కరము నటించుచాభ్రమర • కంబులు పత్రము లుల్లసిల్లఁగన్
సరసవయోవిలాసములు • చక్కఁగ గన్పడఁ బద్మినీస్థితిన్
దొరసినమమ్ము సమ్మదముతోఁ బురణించుకమించు పద్మినుల్
సరసి వసింపఁగూడదని • జాడదలంచిరి ప్రౌఢ చేడియల్ ౧౦౫

మ. లలనారత్నము లంతకంతకునవై • లామాధవీమల్లికా
ఫలినీజాతక జాతడోలికలలోఁ • బాంచాలికాపాళికా
విలసల్లీలల తోడఁగూడుకొనియా • విఖ్యాత మోదంబునన్
జలముప్పొంగగు భాలునన్ దుముకుచున్ • సారప్రచారంబులన్ ౧౦౬

క. దరివిరివిరైన తీవియ। దరివిరి పొదలంటి కుసుమ • తరణివిలాసా
దరలై తగిరాజకృతో। దరులా నరసిన్ వినోద • తత్పరలగుచున్ ౧౦౭

. ఒకరొకరి మేనులంటుచు। వికవిక నవ్వుచువిలాస • విభ్రమ దచకి
చ్చకితాత్ములు కాసార। ప్రకట విహారంబుసలిపి • బహుళశ్రమలై

గీ. తీరములఁ జేరఁగుచతటో • దారగంధ
సారమస్తృణ ఘుస్పృణహారి • ద్రోరుమృగమ

దమిళదుదక సరోవర । మమరినపుడు
జాహ్నవీయము నానర ♦ స్వతుంగతుల ౧౦౮

క. కుసుమ శరశరద్బిసరుహా। లసితాక్ష్యను బంధగంధి ♦ లజలాకృత్తి
ద్యుసరః పరిసర సరదురు। భసలవిసరసర మొరసిసె ♦ బహువిధగతులన్ ౧౦౯

సీ. తడసిన పావడల్ . వెడలించి చెందిర
వన్నెమిన్నగు వలు ♦ వలుధరించి
వెడదఱొమ్ముముద్దులమురు ♦ సడలించి ముత్యంబు
జడియునంబడు చిన్కు ♦ తడలుమాన్చి
నిగడుమానికములం ♦ బాగడల సౌరముల్
కబరీభరములలో ♦ పొబంగొనర్చి
విలసిల్లు మేనిచా ♦ యలకు చాయలొసంగు
జమిలితున్కలరవ ♦ ణములు బూని

గీ. తట్టుపునుంగున నాసన ♦ లుట్టిపడంగ
నలరు మేనుల సిరిగంధ ♦ మలదివదన
కమలముల తేకమేవుబొ ♦ ట్లమరంజేసి
నిలిచిరింతులు మరునివ్రా ♦ ములుకులనంగ. ౧౧౦

సీ. గండస్థలోల్లస ♦ న్మండి తనవరత్న
తాటంక రుగ్ధాళ ♦ ధళ్యములును
సకలాంగ కవిశ్లేష ♦ సంభూతలావణ్య
యోగ్యరోచిర్నైగ ♦ నిగ్యములును
కరపద్మ భాసుర ♦ కంకణ మణిగణ
చారువిభాచాక ♦ చక్యములును
వ్యాలోల వరహార ♦ లీలామనోహారి
తరదంత రుచిధాగ ♦ ధగ్యములును

గీ. పలుకులను దేనెచిలుకులు, దొలుకబలుకు
బెళుకనెడు చూపులకులః తెలఁగుచుండ
దనరి వనరుహ లోచనల్ ♦ వనజశరుని
పూజ లోరినంప నెమ్మదిఁ ♦ బొదలిరపుడు. ౧౧౧

సీ. గుజ్జుగొజ్జంగులు ♦ గున్నపొన్నలుకలి
గొట్టుచెట్టులతోడ ♦ గూడియుండఁ
మల్లికావల్లికా ♦ మందార మాకంద
కుంధబృందంబులు ♦ సందడింప
మాతులుంగలవంగ ♦ మాధవీ లతికలు
బంతిసేవంతులు ♦ బలిసియుండ
ఘనసార చంపక ♦ గంధసారంబులు
పున్నాగ వకుళముల్ ♦ బొదలుచుండ

గీ. సాంద్ర చంద్రోపలస్థల ♦ స్థగితదివ్య
కుసుమితలతా వితానజ ♦ ప్రసరదచ్ఛ
రస సరమధుఝారంపి ♦ భ్రాజమాన
గంధఫలి దీవకళికలు ♦ త్కలికఁజేయ. ౧౧౨

క. ఎన్నికఁగన్నియ లప్పుడు। తిన్నని పన్నీట మొదపి ♦ దిద్దినకపురం
పున్నిడుద తిన్నెమీదను। గ్రొన్నన లన్నియును దెచ్చి ♦ కోరికలలరన్. ౧౧౩

చ. పరిపోనరించి దానిపయి ♦ పాండుర పంకజమునుంచి తచ్ఛదాం
తరముల మంచికస్తురిని ♦ తామరసాస్త్రుని వ్రాసివానిముం
దర ఋతురాజు వ్రాసిరతి ♦ దాపలగా వెలయించి కేవలన్
బరిచరులన్ లిఖించి లలనా ♦ జనమంతట సంతసింపుచున్. ౧౧౪

సీ. ధాన్యంబు మానసా ♦ యతనసంచరునకు
సాహసం బమితోగ్ర ♦ సాహసునకు
నాసనం బబ్ధిక ♦ న్యాతనూజాతుని
కర్ఘ్యంబు శంబర ♦ హారణునకును

పాద్యంబు మాధవా • పాదితబలునకు
మహితాభిషేకంబు • మన్మథునకుఁ
గుసుమాంజలులు లలిత • ద్విసరుహాంబకునకు
గంధంబులు వసంత • బాంధవునకు

గీ॥ ధూప మనిలకృతాంగసం • దీపితునకు
దీపముల్ లోకచటుల • ప్రతాపునకును
నిత్యనైవేద్యములు కీర • భృత్యునకును
విశద తాంబూలమలరుల • వింటిదొరకు॥ ౧౧౫

సీ॥ కిసలయ కుసుమంబు • లొసఁగెద మంటిమా
చైత్రుండు నీకు స • న్మిత్రుఁడయ్యె
సమ్మతాదికంబుల • నలరింత మంటిమా
కైరవప్పుఁడు సహ • కారి నీకుఁ
బరిమళ ధూపమే • ర్పరచెద మంటిమా
బాలానిలుఁడు నీకుఁ • బరిచరుండు
మేలైన పాటల • బొలింత మంటిమా,
పికశుకంబులు నీకుఁ • బ్రియపదములు

గీ॥ శ్రీవసంతస్య కుసుమాప • చితివిధాన
మర్జన ధరస్య భూరిర • త్నార్పణంబు
కల్పవృక్షస్య హృద్యార్ఘ • కల్పనంబు
గా విచారించి కైకొమ్ము • కంజబాణ॥ ౧౧౬

శా॥ నేడిక్ష్వ్రమలతావితానములు నీ • నెయ్యంపు టుయ్యాలలై
యాదాక్షిణ్య మరుద్వసంతముఖుల • త్యంతాప్తులై యొప్పనే
తాదృక్ష్యానన సూనతానములు విం • తల్ గాదె మేమిచ్చుటల్
యాదోభర్తృరబంజలిః కృతమితి • వ్యాహార మన్వర్థతన్

సీ॥ చిగురాకుఁ బోడిపైఁ • జిగురుటాకు కటారి
నోరవాయఁ జెకనీ • కుచితమగున
ముద్దులగుమ్మపై • మొగిలి పూతరవారి
చేఁ బట్టిజళిపింపఁ • జెలువమగున
ముగుద మీఁదటను సం • పెగ మొగ్గ గదఁ బట్టి
నిగుడించఁ దలఁచుట • తగునెనీకుఁ
బోయ్యాలి మీఁదమో • దుగపువ్వు జాతుల
జొత్తుహత్తిన కత్తిఁ • జూపఁ దగున

ఆ॥ మిక్కుటంపు సొంపు • చక్కెర వింటను
వెక్క సంపు కోల, లెక్కు బెట్టి
స్రుక్కఁ జేయుమ్మదిఁ జు • రుక్కునఁ దాకెంపు
ముక్కు జక్కి నెక్కి • నొక్కుచేఁడ ౧౧౪

సీ॥ కలుముల జవరాలి • చెలికాఁడునీతొల్లి
టమ్ములఁ గన్నుల • నద్దుకొనియె
పామేనుపైఁదలి • సామినీ యానతీ
చెలికాని సొదల • నిలుపుకొనియెఁ
దల్లి కిట వెలఁగు • పాలఁతి సేలినవాఁడు
నీబలఁబుల మీఁద • నెనడఁజేయు
జంటారు మోములు • సామినీయాజ్ఞపైఁ
దిశగనిచోటులం • దిరగుచుండు

గీ॥ బోడులను జలపట్టిపూ • బోడులందు
మనసుగలవారిగాఁజేయు • మతకరివిగఁ
తిగబోడులనఁగ నీకు • ద్రోణసమాన
మలరు విలుకాఁడ; యీరీతి • చలమువలదు. ౧౧౫

చ. నెలతల దారిదారిమును • నేరమి వేరముఁ జేయురీతినీ
నెలతల దారిదారికడు • నేరమివేరముఁ జేయనాయమా

వలపులరాయ యీరామొదల • వంబయినందయు లేమనీపు వే
వలఁబులకించె మేచులిక • వల్దిఁబువంటి • కడిందిమార్గముల్

క. అని యిటుల నిటలతటఘటిత నిజహస్తజలజపుటములు • దనరఁగ వనితా
జనము ముదంబున నుండఁగ। దినకరబింబంబు జరమదిశఁ • జెన్నొందెన్ ౧౨౧

## సూర్యాస్తమయ వర్ణనము

గీ. సతత రాజాభిరక్షిత • స్వచ్ఛకువల
యస్థిత శ్రీలహరియించి • యాప్తచక్ర
మలరఁ జేయుచుఁ బాపాత్ముఁ • డగునినుండు
వారుణీరాగ మగ్నుఁడై • మీరియుండె. ౧౨౨

సీ. కుంజాంతర శయాన • ఘోరసత్వంబులు
పలశంకఁ బల్లవ • పటలమొసఁగ
గైరిక ఝరకేళి • కాకిన్న [illegible]ంగనల్
క్షతజేహఁ దత్పరి • సరములంటఁ
జెంచుముద్దియలు సు • మాంచత్పరాగంబుఁ
గుంకుమ శంకచేఁ • గొనుచుఁబూయ
సరసీచరద్విజ • సంచయంబొహాన
కాంక్షను గింజల్క • గణముఁ గదియ

గీ. శీతలోదకి ముత్పత్తి • హేతుభూత
కుసుమితలతావితానాగ • కుంజపుంజ
భాదిదృక్పాగతాబ్ధిశ • భాసమాన
రాంకవపటంబనఁగ సాంధ్య • రాగమలరె. ౧౨౩

౧౨౪

వ. మఱియును.

సీ. అరుణాశ్వఖురపుటా • హతధూతభూతల
జాత రజోభర • వ్రాతమసఁగ

మారుతోద్ధతచర ♦ మత్స్యాధరస్థల
నలినీపరాగస ♦ న్నాహమనఁగ
వికసిత బంధుజీ ♦ వకజపాకెంకేళి
కర్ణికారచ్ఛవి ♦ కాండమనఁగ
వరుణ శోభనగృ ♦ స్ఫురదురు కరదీపి
కానేకదీప్తి ♦ సంతానమనఁగ

గీ॥ బద్మినీ ప్రియవిరహాసం ♦ భవదహన
లస్ఫులింగ ప్రకార వి ♦ లాసమనఁగ
మిన్నుడిగ్గియు లోపలి ♦ మేలితమ్మి
నంచుగామింట నెఱసఁజె ♦ మించెనపుడు ౧౭౪

వ॥ మఱియు దివసమహిషరుద్ధ రథారా ప్రవాహంబన నపగమహార్ణవ తటస్ఫుటిత విద్రుమలతా వితాన ప్రభయనంగ గవాక్షా సారవికచ ప్రవాళారుణ కంజపుంజ ప్రకాశంబన గంధర్వరథ కాంచనకేతనోద్యోతంబన నభస్సౌధశోణ పతాక దీప్తియన, స్వయంవర గృహీతరక్తాంబరలక్ష్మియన, రక్తాంబర ధారితపస్వియన తామ్రపయోధర కామినియన, సాంధ్యరాగంబు మించిన॥

సీ॥ సారవాహానజగీ ♦ షానటదస్త్రాద్రి
గహన వాహద్విష ♦ త్కళలనంగ
దర్ఘుర కులీకృ ♦ తవనజనిస్పృహాం
బరచరన్మధు పాళి ♦ పాళియనఁగ
సుఖకరేన వియోగ ♦ శుక్పద్మినీ సృష్ట
సాంజననేత్రాశ్రు ♦ పుంజమనఁగ
వరుణాంగనాలక ♦ విరచిత సంస్కార
కాలాగరుజ ధూప ♦ కాంతియనఁగ

గీ॥ వనభవకరటి కరటప్ర ♦ వన్మదాంబు
సమ్మిళద్దరి హాయశిలా ♦ స్తరణసరదు
దారనిర్ఘోషదుద్యోత ♦ ఘోరమనఁగ
రహినవీన తమప్రచా ♦ రంబు మించె ౧౭౫

వ॥ మఱియుఁ బ్రదోష సమయానటన పాటవనీలకంఠ కంఠ నీలిమంబనఁ బ్రకుపితతారకదైత్య బలమన, నిఖిలకాష్ఠాపహారక కృష్ణవర్త్మ మార్గంబనఁ గామినీ కేశసంస్కారధూప ధూమ సమృద్ధితంబై, మధుకరని కరమేచకితకరివరకపోలగళిత దాన [illegible] ప్రకారంబై, వితత తమాలకాననలీయమానంబై, పాంసులా కలితౌషధంబన వృద్ధవారవని తాపత్యంబన, రజనీసమరమిత్రంబనఁ బ్రత్యక్షుదరి [illegible]వ్యవహార బౌద్ధసిద్ధాంతమన, యింద్ర నీలమణీ మృదితంబై సంకుచత్కువలయ దివాకరోదయారంభంబై తిరస్కృత కళాంతరాస సన్మహాత్వంబై, అంధకారంబు దోఁచిన॥ ౧౨౭

సీ॥ పదములఁ దొట్రుపా • టొదవనస్ఫుటములై
వాక్యముల్ వెలయుజ • వంబులేక
సారస్యాలంకార • చాతుర్యమెడలంగ
విగ్రహంబులసొరు వెడలుచుండ
విగత సంశ్లేషల • విలవిలఁ బోవుచు
వృత్తిశూన్యత యొక్క • వింతఁ దెలుప
సుహిత శయ్యావి • ధము లేర్పరింపక
యెదుట విపాకముల్ • బొదలుచుండ

గీ. విరసరీతులు దోఁచంగ • విమలినాంత
రాళ యాభావమున మెప్పు • రాకకుకవి
నిర్మితంబౌ ప్రబంధంబు • నెలవుగలిగిఁ
సందులను గొందులనుదూరెఁ • జక్రకుకవి

గీ. మొదల సద్వ్యాహార • మునుద్విజసంతాప
కరమునలత మోపి • కారమగుచుఁ
గాలభేదమప్పుడు • గనన రాజకమైన
నేమి దెలియవచ్చు • నిలజనులకు ౧౨౮

చ. తొలిగలవైరముల్ దలఁచి • తోరపుచీకటి మూకలెల్లనా
వెలుఁగుల జేనిచుట్టముల • వేమరుఁ బట్టి కలంచిమించియా

గలతలలన్వహింపఁడని • కేలిఁగొనంగ మలినప్రభాననం
బుల నలచక్రదీపచయ•ముల్ చెలఁగెన్ గృహసీమలందొగిన్.

క. ఆ మేడఁ గులటలు జీకురు| వాయుబు బాగడంగ ద్రోవ• ట్టుచు ఖద్యో
తాయాతరుచులు దివి మలు•గాఁ గణికలగుచు వెడలె • గౌతుకమలరన్

చ. మొగులను పల్కబిద్దను బ్ర• మోదముతో నజదేశికేంద్రుఁడి
చ్చగగణితోదితార్థగతి •సంఖ్యయొనర్చి తదన్వయక్రమ
ద్విగుణితమైన యొద్దునిడి• తేకువతో గుణియించినున్నలం
దగనొనరించునోయనఁగ • దారకలుల్లసిలెన్నభోన్నతిన్ ౧౩౦

వ. మఱియు సంధ్యాసమయతాండవాడంబరోచ్చలిత మహానటజటాజూటవర్తి
తరంగిణీ తరంగ లింగత్పృషత్పరంపరలన, దిఙ్మాతంగకరనిర్ముక్త తుషార ని
కరంబులన నభ్రభ్రమణ ఖిన్నదినకర తురగముఖ విశీర్ణఫేన కణంబులన,
వియత్సరోవర ప్రకట వికసిత కుముదసముదయంబన, జగత్త్రయ జిగీషామ
నీషా నివర్గతానర్గళ భుజార్గళ మకరకేతనశిరః ప్రసారిత రతిసతీ కరతలాగత
లాజలన, ఖస్థలకలశపారావార డిండీర ఖండంబుల నవ్యోమపదలక్ష్మీవక్షోవి
హారహార తారముక్తాఫల నిచయంబులన నాకాశ మహాస్థాలీభజ్యమాన లా
జలన, విహాయస్స్ఫాటిక ఫలకవిలిఖిత మదనవిజయ శాసనాక్షరంబులనఁ
దనరి. ౧౩౧

గీ|| గరుడ గంధర్వకిన్నర • సురముఖాంబు
జాసనాసివ మస్తక • న్యస్తకుంద
మల్లికాఫుల్లసుమనస్స • మాజమనఁగ
సురపథంబునఁ దారకా • భరముదోచె ||వ|| అట్టియెడ||

వేయిమోములతో గంగ • దాఁటుటయును
దదభిముఖముగ వచ్చు • ప్రాగుదధి మకుట
తటఘటిత హీరవరవిభా • పటలమనఁగఁ
దొలుత దెసవైనఁ బలువైన • వెలుఁగుఁ దోచె|| ౧౩౨

క. హరుఁ డంతి రజస్సత్త్వా। కరుఁ డైనసుఁ డైతమోవి ♦ కారము దూర
మ్మురయముగఁ ద్రోచె ననుగతిఁ ♦ జరముగ నిలుకడలు లేక ♦ చీకటి వెరిసెన్

మ. కరమర్వైశఁ బ్రసాధికల్ హరిహరి ♦ త్కాంతప్రబోధ ప్రభా
కరముక్తావయ భూషణావయవగాఁ ♦ గైసేయుచున్ శక్రకం
ధరవక్షస్థలులందుఁ గుంకుమను విం ♦ తన్ దిద్దిరో నాఁగ నా
కరణిన్ రేయి సొంపుమై సకలమై ♦ కంజారి యొప్పెన్ వెసన్ ౧౩౧

వ॥ మఱియు రజనీ రాజకన్యా కరగత కనక కందుకంబన, నుదయగిరి శాలమంజార పుష్పస్తబకంబనఁ బ్రాచీ మహిళాల లామలలాట తటబంధురబింధూకతిలకంబన నభశ్శ్రీపరిత్యక్తజాంబూనదకుండలంబన దిగ్వధూ ప్రసాధికాప్రశస్తహస్తసరిస్త్రాలక్తకపిండంబన, సురపథశాతకుంభంబన మకరకేతన ప్రస్థానసమయమంగళ కలశంబన, బురందరాశాసతీ కుంకుమారుణస్తనమండలంబన నుదయరాగసము జ్జ్వలుండై చంద్రుం డుదయించె దదనంతరంబున యామినీ గోపాలాంగనా విస్మృత నవనీతఖండంబనఁ గుసుమశర శ్వేతచ్ఛత్రంబనఁ బ్రోషితపోధన కరధృతస్ఫాటికలింగంబన రతిరాజమహారాజ సితచామరంబన నంబర మహార్ణవశంఖంబన మందాకినీ ఫేనపుంజంబన ధాత్రాది పాణిగత పారదంబనఁ గంధర్వనగరచారు చక్రంబన స్వర్గపుర సౌధపాండుర పారావతంబన మవియదైరావత శుంభత్కుంభవృలంబన సిద్ధాంగనా వీజితసిత తాళవృంతంబన మన్మథసాయక కషణశాణ చక్రంబన సకల జగన్నియామక దివ్యకీర్తి కాంతారత్నదర్పణంబన చిరాప నంబనఁ బాంథనికర జైత్ర యాత్రావిజృంభమాణ పుంశ్రేణి కోదండాసన కుండలీకృతకోదండంబనఁ బుసవమాతది స్ఫురత్స్థాపిత రాజిత వజ్రకలిత పీఠంబన స్వరంగణ తరంగిణీ పరిణమత్పారసంబన బూర్ణప్రకాశంబై యుండె। నట్టియెడ।

గీ॥ హరుఁడు నిజమంత్రసామర్థ్య ♦ మలరు భూతి
నిఁకలుషములఁ ♦ బోఁగొట్టి ♦ దలఁచి పిలుచఁ
బర పెనోయనఁ గాఁగడ ♦ తెలుగఁ లేక
విరిసెఁ జీకటి వెన్నెల ♦ తరచు మెఱసె ౧౩౨

సీ॥ సరసీవరులనండు ♦ జన్వాది మొకములు
  క్షీరసృహన్ వారి ♦ పూరమానఁ
గలిత భిల్లాంగనల్ ♦ కైతకక్రమంచే
  నెలమూవిచిగుపటా ♦ కులధరింప
ముదితని షణ్ణభ ♦ ములుకుంజములఁగాంచి
  హరిశంకచే మహా ♦ దరులదూర
సారకామికలు వృ ♦ క్షచ్ఛాయలనుఁ జూచి
  యూరకు లేతెంచి ♦ గనుపడగ

గీ॥ వేలుపులతోడి వసిరిపెండ్లి ♦ వేళసకల
దివిజులైడ తెగకుండ నం ♦ ధించినట్టి
మహిత కళఁ దగు వెన్నెల ♦ మడుగులనఁ గఁ
నిండు రేయండ జగములు ♦ నిండియుండె॥ ౧౩౨

క. చెలులార చూడుడిదెమన। చెలులారసవిలసదచ్ఛ ♦ సీధురసమువె
న్నెల రారాల్గలగిన్నెల। నలరారం దెచ్చిరనుచు ♦ హర్షంబెసఁగన్

క. పానముసేయఁ దగుపయః। పానముదధి పానమమృత ♦ పానముహాలా
పానమునకు సరిగాదను। మానముమానసమునందు ♦ మలయుచునుండన్

వ. అట్టియెడ హింతాలీతాలీనారికేళీ ♦ ఖర్జూరీ ముఖవృక్ష సంభవంబైన గంధో
త్తమాధానంబునన్ దనరి
౧౪౧

సీ॥ పాణిక్తైలాచూర్ణ ♦ భరితసద్యోఘృత
  పక్వసంస్కారపూ ♦ పములుగొన్ని
మరిచమిశ్రీకృత ♦ త్రగుణామేషాజాది
  రమణీయ పలలకూ ♦ ర్పములుగొన్ని
గంధిల ద్రవ్యాను ♦ బంధశాలిజాంగ
  కరసమన్వర్ణ వా ♦ క్రములుగొన్ని
సమ్యక్సితోపేత ♦ శష్కులికాధార
  ఖర్జూర సుయబస్త ♦ కములుగొన్ని

గీ. నలవణార్ద్రకవిశ్వాభే • షజసమేత
ధన్యంబమ్ము యణీమండ • దధిసమృద్ధ
శాలితండుల భక్తంబు • సంగ్రహించు
శానుచునారామలవ్వేళ • వినయమలర ౧౫౩

క. సుమిళకదంబకదంబక। కమనీయపరాగవేది•కాస్థాస్నుశ్రీ
రమణీమణినర్చించిరి। సమబుద్ధిని షోడశోప•చారవిధులచే ౧౫౪

సీ. నవరత్న ఖచితపీ • ఠా దన వినోద
సంగీత రసికశ్రీ • సారసాక్షి
లలితలీలాశుకో • ల్లాసిని బింబోష్ఠి
సరసయామక యుక్త • చరణనఖర
అంచితాకీర్ణకే, శాళికహృద్యాంగి
శితశంఖ తాటంక • యుతసుకర్ణ
కమనీయ మణిసరి • ప్రాకారసముజ్వల
సస్మితాధర పూర్ణ • చంద్రవదన.

గీ. యగుమహాలక్ష్మి కుపహార•ముగ నొసర్చి
వలయితస్థితిచేమధు • వారమునకుం
దారతమ్య విశేషత • త్వరతం దనరి
నోష్ఠిసలిపిరి యాముద్దు • గుమ్మలపుడు ౧౫౫

వ. ఇవ్విధంబున మధుక్రమంబునందవిలి కాండ జకాకడప్రకాండ పుండ్రేక్షుకో దండ కాండాసన పాండిత్య హిడితంబైన చంద్రమండలంబు వెలుంగ నెలచ లుపలుగఱంగి జలజల జాలు గాడు నీరంబు పన్నీరంబునంగలసి తోరంబులైన యారంబులందగు కుసుమ సముదయంబులవలన వలపుంజెందు మరంద బృం బునొందుచు స్ఫటిక ఘటితంబులైన పడకుల నదరి గంధేభయానలకుగంద

ధౌత్తమ భ్రాంతినిఁ బుట్టింపుచు సజ్జసజ్జలనజులగు గొజ్జఁగుజ్జంగుల వలని చలి
జలంబు సొంపుసంపాదింపు కెంపుజొంపములుంగ చోటుల నిలచిఁ గాశ
మద్యంబని మదవతు లెదగుదిరిన ముదంబున గ్రోలఁ గమకించి ప్రతిఫలితం
బులగు నిజనేత్రంబులు సంస్కారార్థ ప్రతిష్ఠోత్పల దళంబులని కరంబుఁ బనంటి
న నవి యంటకుండుటం దెలసి నవ్వుజవ్వనులును హరిహయోపల విపులాత
లంబులఁ దొట్టిన తేటచలినీటిం జూచి ద్రాక్షాఫలరస విసరంబుల జనించుమా
ధవకంబని కొందఱు ముగ్ధాంగన లుపభోగింప బోగింపఁ నిజాననంబుల
యందు బ్రతిబింబించినఁ దద్వాసనార్థంబుగా నొసంగించు కమలంబులని భ్రమ
జెంది రిత్తయగుటకు నబ్బురంబు నొందువారును గలిగి జిగిగరగరి పచ్చల
విచ్చలవిడి గ్రచ్చుకొనవచ్చు నచ్చంపు పన్నీరు చెఱకు రసంబున జనించు నా
సవంబని యానగమకించి స్వీయనాసికలందుఁ దోఁచిన గంధఫలీ కలికలని వి
చారించి నిశ్చయింపనివారును బుష్యరాగంబులుగల చోటుల గాటంబుగా
నిండిన సేవంతి కాసుమ సముదయ గళన్నీరపూరంబు తేనియవలన సంభవిం
చు మధ్వాసంబని తలంచి దవ్వుదవ్వులం బోవు చెలులఁ బిలచుకొని కలసి
యాస్వాదింప దదభావంబగుట కరుదందువారును గోమేధికంబుల నెలవున
నలముకొనిన పుష్పరసంబు ధాతకీప్రసూన మిశ్రితగుడసహిత ధాన్యాంబుకృ
తంబైన మైరేయంబని గ్రోలం బోయి సిగ్గునొందువారును సొగసుగలమగమా
నికంబులని గసిగను లోయల వెన్నెల తేటనద్దీటుకొను వలినీరు పైష్టికంబైన
మాధ్వియని తలంచి తారసిల్లి తెలివినొందువారును వైడూర్యంబుల విలసిల్లు
వెలుగుల నలరు తెలిసలిలంబు తాలతృణమూల సంజాత హాలావిశేషంబని
కదిసి పిమ్మట॥ బోవువారునై సాంద్రచంద్రాతపక్రీడా వినోదంబుల సుప్రస
న్న ప్రసన్నోన్నపదశ ప్రత్యవస్థానంబులం దలితరువుల కాంతలంగని లాతివారు
చనుదెంచిరని భయంబడి నిశ్శబ్దంబుగాఁ బానశాలా పురోభాగంబున నెదు
గువారును, నస్మృతి విశేషంబున భూషాంబరాదుల వ్యత్యయస్థితిఁ జేర్చువా
రునై యుండ చంద్రాంగద దర్శనార్థ మహాముని తపస్సంకల్పితం బగు నుద్యా
నవనంబునందిరుగు మెఱుంగుబోఁడులగు బోడ్లం గనుంగొని యా కీర్తిమాలిని
యాలంబన గుణంబైన రూప యౌవనాదికంబును యౌవనోద్భూతంబులైన

హావభావాదికంబులును దదలంకరణంబులైన నూపురాంగద హారాదులును
దటస్థోద్దీపన ప్రవర్తకులైన మలయానిల చంద్రాదులును స్ఫురించి నంతకంతె
కు వలవంత యగ్గలంబై తోచ విరహాభరంబున నొక్క మంజరీసంజాత సిం
జానమధుకరీ పుంజరంజిత కుంజాంతరంబున నిజసఖుల గన్మొరంగి వసించిరి.

సీ. కన్నవయీక్షణా • కాంక్షచే విలసిల్ల
చిత్తమభీప్సితా • యత్తమయ్యె
సంకల్పము తదేక • సరణి జేవర్తింపఁ
గృశతనెమ్మేనున • విశదమయ్యె
నరతిమిక్కుటమైదు • రంతమై కనుపట్ట
హ్రీత్యాగమధికమై • యేపుఁజూపె
నున్మాద మవ్వేళ • నుద్వేలమైయుండ
మూర్ఛమున్నొప్పదలియు • దృబ్ధమయ్యె

గీ. సంత్యమూర్తియు సందేహ • మైతలిర్చె
ఘోరతర విప్రలంభశృం • గారమునను
దగుననంగ దశాదశ • స్థానమాన
సమునఁ జింతాభరంబునఁ • దేమలితేమలి. ౧౮౫.

వ. మఱియుస్తంభప్రళయ రోమాంచస్వేద వైవర్ణ్యకంపాశ్రు వైస్వర్యంబులను
సాత్త్వికభావంబులు నిర్వేదగ్లాని శంకాసూయామద శ్రమాలస్య దైన్యచిం
తా మోహస్మృతి ధృతి వ్రీడా చపలతా హర్షావేగ జడతాదులగు సంచారి
భావంబులును మనంబునందోఁచినఁ జింతాసంతాప సమ్మోహ నిశ్వాసభరం
బునొంది యుండునట్టియెడ. ౧౮౬

క. పెనఁగొనిన విరహబాధను । మనలందిగ నాడికీర్తి • మాలినియొటకే
గనొ యరయవలయునని నె। మ్మనములఁగని కరముదోప • మగువలు వేగన్ •

శా॥ రారేముద్దులగుమ్మలార వెదుకన్ • రాకేందు బింబాస్యయా

శ్రీరాజన్యుని స్వాత్మలో నిడి కృశిం • చెన్ జూడరే సేడను
ర్వారాకార విహార మారకృతసం • త్రాసాధిక వ్యాధిమ
చ్ఛారీరాద్యుతినోదన శ్రమజలా • సారంబు తోరంబుగాన్ ౧౮

వ॥ అని వితర్కించి

శా॥ నానా సూనర సాతిరేకమధు పా • నల్చేత నాచేతస
జ్ఞానానూనలు వ్యత్యయావయ వసం • ధానాంశు కాదంబ గళ
న్యాగధ్వాన వితానలైన నవలా • లున్మత్త మత్తేభరా
ట్యానాన్వేషణ భాషణంబులఁ దదా • యత్తైకచిత్తంబులన్ ౧౯

సీ॥ తరుల లోపలఁ దీవ • త [illegible] లతావులనేటి
దరుల కోవుల వింత • లరసి యరసి
తొగలచాయలను నం • పెగల పాయలనుగం
పుగలలో యలను వెన్ • దగిలి తగిలి
సరములన్ పి[illegible]దం • తరములన్ మకరంద
ఝురములన్ మిక్కిలి • మెరసి మెరసి
విరుల గుంపులను గ • ప్పురపు పెంపులను చ
ప్పరపు వంపులజాలఁ • దిరిగి తిరిగి

గీ॥ దారువుల సా[illegible] వులమీదఁ • దడసి తడసి
నేలలో మూలలోఁ జొచ్చి • నెమకి నెమకి
[illegible]రముల తీరముల పట్టు • లెక్కి యెక్కి
రేవులను బావులను జల • రేగి రేగి ౧౯

సీ॥ మదనాగ చూడవే • మదనాగయానను
లకుచచూడవె వర్తు • లకుచనిపుడు
కరవీరచూపు భీ • కరవీరపుత్రికన్
జీవక చూపుమ • జీవకసఖిఁ
బాటల మాయూట • పాటల వింటివే
చంద్ర చూడగదె మా • చంద్రముఖిని

సీ. పోవఁబోవఁగఁదోఁచెఁ • బుడమిఁగస్తూరిదొన్త్రు
లడర బెడంగైన • యడుగుజాడ
లరయనరయఁవీఁ • దంతరాంతఃపాతి
తఃప్రసవంబుల • తలలుమెరసె
జూడఁజూడఁగనొక్క • చోటఁగాటంబైన
యాటతేటులపాట • లమితమయ్యె
వినివినితారిన • విద్రుమాధరవేణు
వీణ్యంపు వాసనల్ • వెడదయయ్యె

గీ. దరియఁ గదసిన నొకతీవ • దరివిరిగాద
క్రింద నందముగాఁగ స్ర • క్చందనాదు
లందగుల్కొను కురువింద • పందిటందుఁ
జొక్కమైనట్టి కపురంపు • టిక్కదండ. ౧౫౯

మ. సవిధోదీర్ణ సుధార్ణవీభవదన • శ్యాయోద కావాలభూ
లవలీచూతల తావితాన సహితై • లామల్లికావల్లికా
భవనాంతద్రజనీకరోపల తల • ప్రాయః పతత్పుష్పసం
భవశయ్యాగత గంధవాహకృతస • న్మానం బపేక్షించుచున్. ౧౬౦

వ వసించు చెలింజూచి. ౧౬౧

క. పికపికనగి సకియరోసీ! వకటాని కటాద్రిరూఢ • హరిణాంకముఖ
న్మకరధ్వజ మధ్వాదులు! తుకతను వుడికించునిటులఁ•దూకొనవగునా ౧౬౨

చ. తలకవదేమి వింతగల • దాకల నాపరమైన మేలుదే
వలదని పల్కనల్కతగు • వామగువాచల పాదియైననీ
పలుపుల కేనిరీతి విన • వాకనవాయిటువంటి చోటులన్
నెలవొనరించమించు మతి • నీకగునా తగునావి మోగినీ ౧౬౩

శా. తాపం బేపగిదిన్ వహించితినిరా • తంకాంకగాపాదిత
వ్యాపాదుల్ దురరుంతుదోన్మద వచో • వక్త్రద్వికేఘాదితా

టోపుల్ గోపులుమన్మథ ప్రభృతులె ♦ ట్టోకానినుఁ సైచుటల్
భూపాలాత్మజవైనవైన మనయం ♦ బున్మించిదూహించినన్. ౧౬౪

క॥ అనవహారహార్వి రహాజద హాసవహానాసహానచిత్త ♦ మ్మైప్రకటపునః
పునరంగ నాప్రచోదిత! మనమునసోకరితిభీతి ♦ మల్లడికొనఁగా ౧౬౫

చ॥ నెలతల మూపులాపులుగ ♦ నీడలనీడల నావకాడకున్
నిలచియొకింత చింకిలుచు ♦ నెవ్వొరగందుచు గుందుచున్నొయిన్
బులకలు జెందడెందమునఁ ♦ బొక్కుచు వెక్కుచునుస్సురంచుహా
యలరుల వింటిదంటవెగ ♦ టాయగదే జగదేకసూరుఁడై ౧౬౬

వ॥ అని యాచేడియలలోఁ బ్రోడయగు నొక్క పూఁబోఁడిఁజూచి ౧౬౭

మ॥ నెలతా వెన్నెలవేడియై మొయికడా ♦ నిఁ వేగరంగించెనో
మెలతా కోమలతాంచితా వినవదే ♦ మేమన్మథుండేయున
మ్మ్ములకుఁ దాళ నతాఖిలావయవనై ♦ పుంస్కోకిలాలాపములీ
గలతా నాకలి తాళిసంతతి మ్మెలం ♦ గఁ గంటివేనెచ్చలీ ౧౬౮

గీ॥ ఏమిసేయుదు వీరహార్తి ♦ నెట్టులోర్తు
గాముపలెడాయుఁ గాము నే ♦ కరణిగెలుతు
నేమొడలనైన నీమాటఁ ♦ ద్రోయలేనె
నెలతరోయని పలుకన ♦ ప్పొలఁతివినిచె ౧౬౯

చ॥ రహివిడనాఁడగూడ దన ♦ రాళమురాళక రాళ భావనా
సహనము చేతమాసనకు ♦ సాయకదాయక నాయకాఖ్యుఁడా
బహుళ తరప్రకాండ సుమ ♦ భారవనార విహారచైత్రచేఁ
దహాతహానంద నేలిముది ♦ తాఁవిదితా దివితంబెఱుంగకన్ ౧౭౦

మ॥ అని యారీతిధరామహేంద్ర సుతతో ♦ నాలేఖమున్మెల్లెమె
ల్లననేర్పొప్పున సామవాక్యములుదె ♦ ల్పన్ స్వాంతజాయల్లకఁ

బనువేలానల కీలజాలముగది • వ్యాపార సీమాంతరం
బునఁ జెన్నొందిన ఖేదభేద • మలరంబుంజీ భవత్తాపమై ౧౭౧

మ॥ లలనారత్నము నింపువెన్నెలకుఁ • దాళన్ లేక పైతా టాం
చలమాస్యంబునఁ జేర్చియేడ్చును మన • శ్శ్యామాకరాంభో మహా
కలిత గ్రామ విశేషక శ్రుతకళా • కాలక్రియామానవ
ద్విలసత్కన్నడ గాడమేళకలనా • వీణాను కారధ్వనిన్ ౧౭౨

కం॥ అనివగచిను నుప్పమొనచే దనరిన గేదంగి పురియ • దరినదర్శించన్
గనికరములఁ గరములనార్చకనకాంగులు గ్రుచ్చిగ్రుచ్చి • కౌఁగిటఁజేర్చున్ ౧౭౩

కం॥ వలదని వనితలు లవలీ। వలదనిల్పచల తలతోప్ర • వర్తనమునఁగ్రే
వలద విలినిలువరింపఁగ। వలఁదవిలిన మీనురీతి • వనితవడంకెన్ ౧౭౪

గీ॥ ఇటులవడికిన నన్యథా • వృత్తివర్త
నములఁ దవులని యింద్రియ • నటనలైన
తనువలగ్న లోకించుక • తడవునుడువ
నాలుకాడక నాడాడు • జోడుగూడి ౧౭౫

గీ॥ విప్రలంభార్తి చేఁ జిక్కి • వెలఁది స్రుక్కి
దీనికొక్క యుపాయంబు • బూనవలయు
ఫలకవిలిఖిత తత్స్వరూ • పంబుజూపి
శాంతి నొందింత మీవంత • కొంతదీర ౧౭౬

గీ॥ అనివిచారించు నిత్యయూ • వనవిలాస
వర్తియైనట్టి యాతని • వర్ణనీయ
ఫలకతలమునఁ జిత్రరూ • పముగ వ్రాసి
మోలనిలిపిన యారాచ • ముద్దుపట్టి ౧౭౭

కం॥ మూచితలయ్యాచి తత్సమ। య్యాచేరి తాయల్లకార్తి • నా ఫలకంబా
లేచితదృష్టింగనుఁగొని। రాచ్చూలివి రాలిఁ దేలి • నాపడిపలికెన్ ౧౭౮

ఉ. ఏలర యిప్పుడింత చల • మేలర మారుని కేళిలోనన
న్నేలర యీవిరాళిఁ గొన • నేలర నాఁ దగువంత దీర్పనా
ళీలర సాలసాల సుర • భీకృత భీకృద సూనసూనవా
చాలవిశాల మాధుకర • శబ్దములన్ విన జాలనేలరా ౧౭౯

వ. అనిపలికి యాచిత్ర ఫలకంబక్కునం జేర్చి పలుకరించినం బలుకవని చిత్తం
బున జడియుడి పడుచు సారెసారెకు దూరుచు విరిపరపునం బొరలుచు నంత
లోఁ దెలివొంది శిరఃకంపం బొనరించి కన్నీరు మున్నీరయి పయ్యెద దడియ
నెడఁగుందికొంది యాశయ్యను మేనుజేర్చి నేత్రాబ్జంబులర్ధముకుళితంబుగా విం
చి ప్రాణనాథుండు పురోభాగంబున నిలచెనని విచారించి లేకున్న విన్నదనం
బుదోఁచ విరహమోహ సాగరమగ్నయై యేదెసకేగెనో యని నలుదెసలం
జూచి లేచి సౌందర్య చంద్రాతపంబునఁ దిరిగి పరవశాయత్తచిత్తయై దే
హంబు గంపింప నెచ్చెలి మేన [illegible]లియొక్కింతసేపు నజ్ఞాతచేతనయై నిదురిం
చిన నీవలవంత కొంతదీరునని తలంచి యూరకుండి కలవరంబునొంది పలువ
తలఁ జెందు సుందరి తలంకి ౧౮౦

లయగ్రాహి

బంగరు మెఱుంగుల తె • రంగు లలితాంగముల
నంగునిడు బీరపు సె • గంగరఁ గనీరై
పొంగి వలిగుబ్బల బె • డంగులఁ దగంగదరి
యంగ దలి పాక్కలి మ • [illegible]గు నఁ బడంగన్
ముంగురులు చెంగలు వ • రంగుల కనుంగవకుఁ
జెంగటనటింపుచుఁ దొ • లంగకనియాడఁగ
ముంగర జరంగి పెద • వంగదియ నంగలియ
నంగుచెలు లంగను చ • నంగనపడం కెన్ ౧౮౧

నాతియును

౧౮౨

ఉరుపీరని యాళంబు ◆ రారిమిమ్ము
నజుఁడు దుష్టచతుష్టయం ◆ బనియెఁ దోలుతే. ౧౮౪

క. మదనా యిప్పుడు నీకే। మదనాయెనొ కాని తెలియ ◆ దయ్యాయోదు
ర్మదనానామార్గములు। మదనారతి బోధఁదిర్పు ◆ మదిగరఁగద యో. ౧౮౫

గీ. నిన్నుగన్నట్టి దానిము ◆ న్నిగ్రహించు
నట్టివారలఁ జెనకతే ◆ కనదవైతి
వనదలైనట్టి వనితల ◆ నడలఁజేయఁ
దగదు నీకట్టి ధర్మంబు ◆ చిగురుటంప ౧౮౬

గీ. ఓరి మన్మథ నీతండ్రి ◆ యుగ్రశక్తిఁ
గన్నతల్లినిద్రుంచి యా ◆ ఖడ్గమిపుడు
నీకొసంగెను లేకున్న ◆ నీరజాక్షు
లను గలంచంగఁ దలతువే ◆ యువనిలోన. ౧౮౭

సీ. విరహాంబుచే నుప్పు ◆ వెలఁదుల నేచేవు
నీయిక్షుకోదండంబు ◆ నేలఁగలియ
కళవళపాటొందు ◆ చెలుల వేచెద వేల
కలనీశరీరంబులు ◆ గాలిపోను
వెతనొందు తరుణుల ◆ వెరపించెదవు నీదు
బలము లరణ్యంబు ◆ పాలుగాను
జడతనొందిన స్త్రీలఁ ◆ జెరిపించవచ్చెదు
నీకేతనంబులు ◆ నీటఁగ్రుంక

గీ. మునువియోగార్తిఁ జెందిన ◆ వనితలందు
విక్రమముఁ జూపెదవు నీదు ◆ విభవమెల్ల
వినుము సంభోగశృంగార ◆ మున్నవసించు
వారి వంచించి చేవుగా ◆ వారిజాస్త్ర ౧౮౮

సీ॥ ఎన్మిదింబలాత్కారి • గలసిన వానికి
మధుసంభ్రమంబున • మసలుటెంత
మధుసంభ్రమంబున • మసలినవానికి
చండాలులను గూడి • చలగుటెంత
చండాలురగూడి • చలగిన వానికిఁ
బుష్పవతులఁ గూడి • పొందుటెంత
పుష్పవతులఁగూడి • పొరలెడు వానికి
నలకుజన్మప్రాప్తి • నలరుటెంత ౧౯౩

గీ॥ రొకటి కంటెనొకటి యుచ్ఛ • రికము సేయఁ
బద్మసీద్విజగోహతుల్ • బరఁగఁ జేయఁ
గడఁగు వారలలోపల • గలసిమెలసి
సంతసించెదు దుర్గుణ • సదనమదన ౧౯౪

సీ॥ దాహంబుగొనినీరు • దాఁగవచ్చినవిప్రు
ధరఁ ద్రెళ్ళనేసెనీ • తాతయెన్న
చనువుతో శిశువని • స్తన్యంబొసఁగవచ్చు
దానివధించెనీ • తండ్రియెన్న
హోరంబున వశించి • యోగిరం బిడునట్టి
జననిఁ జంపితివి నీ • వరుసదలఁప
జాతిహీనులెటుంగ • జాలకంతట నిందు
కొనియుండె నారనీ • జననియరయ

గీ. నిలను స్త్రీఘ్నంస మానసం • బులగలంచి
పెనఁగఁ జేసిన నినుబట్టి • కినుకతోడ
గట్టివిల్తుండు వధియించి • కరుణఁదిరుగఁ
బుట్టజేయుట కేమాదుః • బుష్పధన్వా. ౧౯౬

—:౦ చంద్రభూషణ ౦:—

సీ. లలితసంపూర్ణక ◆ ళావేది యనఁదగి
విష్ణుపదాసక్తి ◆ వెలసినావు
సన్మార్గముఁ గమించి ◆ సంచార మొనరించి
విబుధసంగతిఁ గని ◆ వెలసినావు
ఘనసంగమంబున ◆ ననయంబు విలసిల్లి
యతనుమిత్రఖ్యాతి ◆ నలరినావు
చెలఁగుచు సర్వజ్ఞ ◆ శేఖరత వహించి
ఖచరత్వస్ఫూర్తిఁ ◆ జరగినావు

గీ. తిరుచు బలుపోకలను బోయి ◆ తిరుగుచున్న
గంధవహునితో నేస్తంబు ◆ గలిగియేచ
నేలయీవేల నేముద్దు ◆ రా నసంగ
నందమానీకు చంద్రమా ◆ చందమామ ౧౯౬

సీ. దోషాభిముఖుఁడవై ◆ దురితంబు నొందుచు
నలసదాచారుండ ◆ ననుటకో నంత
మ్లేచ్ఛాను మోదివై ◆ మేదిని విహరించి
ద్విజరాజ ననుకొంట ◆ వెఱ్ఱిగాదె!
కువలయాధ్వన్యులఁ ◆ గుందింపుచుండియుఁ
గువలయాప్తుఁడనను ◆ కొంట కొదువ
విషసరిత్పతి నుద్భ ◆ వించి యమృతవార్ధి
వెడలితి నను మాట ◆ కడమగాదె

గీ. నేరముల పారములు గల్గి ◆ మీరి గేరి
నందియము లేకయిపుడు మి ◆ న్నందినావు

నీదునఘమంత్ర పుంగల్మ్ని • వాదులేల
సారెసారెకు వినరోరి • సారసారి

సీ॥ తగుసకలామండనా • ధన్యనామము జెంది
మునుకళాదుండనః • దనరినావు
తతసురాహానార్హ్మ • తవహించి తతసురా
హానార్హ్మతనహించి • ప్రబలినావు
గురుపరిగ్రహము పైఁ • గోర్కెఁ దీపింపగను
గురు పరిగ్రహమునఁ • గుందినావు
ద్విజవర్ధన ఖ్యాతిఁ • దేజరిల్లుచునుండి
ద్విజవర్ధన ఖ్యాతిఁ • దేలినావు

గీ॥ బహుళపాపంబుల భరించి • పరఁగునిన్ను
ముందుగా రౌరవ స్థితిఁ • జెందకున్న
మెలమిఁ గీలాలజన్మ్మునఁ • కేలగల్గు
సద్గతులు భువివినరోరి • సారసారి

సీ॥ భర్గుఁడధ్వరములో • పలనీకరంబులు
దరగంగ ఖండించఁ • దలఁచఁడయ్యె
రాహువునిన్ దంష్ట్రాంత • రంబునని మిడించి
కసిగంద కుండంగ • మెసవఁడయ్యెఁ
దపసీగున్ పాండురు • క్తనుఁ గానోనర్చెను
గటుడస్సి పోవంగ • నుడువఁడయ్యెఁ
జడదారి నినుగంట • వెడలించెఁగానివే
గర్భస్థుగాఁ జేయఁ • గానడయ్యెఁ

గీ॥ నార నీవంటి దుర్మార్గుఁ • డఖిలమునను
గలఁ డెనవలాలనే చెంగఁ • దొలుతకడిమి

నిన్నుబుట్టించి మున్నొక్క • జన్నిగట్టు
పాదతాడనము వహించెఁ • బంకజారి ౧౯౯

॥ చల్లచేతులవాఁడని • జనులుబొగడ
వేడికరముల వాఁడవై • చేడియలను
జలతనొందింపఁ జేసితి • జడభవంబు
గలుగువానికిజ్ఞానంబు • గలదెచంద్రా ౨౦౦

## మలయమారుత దూషణము

సీ. ఎనసిచూచిననిల • చినచోట నిలువక
భువనావిలత్వంబు • బూనినావు
భువనావిలత్వంబు • బూనుటయేగాదు
ఘనుల నిల్వఁగనీక • కలఁచినావు
ఘనుల నిల్వఁగనీక • కలచుటయేకాదు
తవిలి రజోవృత్తిఁ • దాల్చినావు
తవిలి రజోవృత్తిఁ దాల్చుటయేకాదు
పోకుసంగతులచే • పోలినావు

గీ. బుడమి పాశ్చాత్యసరణులఁ • బొందువారు
తవిలి దాక్షిణ్యపదమున • దారుటరిది
సుందరీజన బృందంబు • గందఁజేయ
వలదు వలమ్మాన పవమాన • మలయనిలయ

ఆ. విరహిజనులక్షుద్ర • వేడిమిఁ దరికొల్పు
సామివగుట కగ్ని • సాక్షియయ్యె
నలినకారణంబి • నాకార్య ముత్పద్య

తేయటంచు నీతి ♦ తేటపడియె. ౨౦౨

సీ. కనకసంచయముప్పైఁ ♦ గాంతి జెన్నొందుచు
గంధోత్తమావనిఁ ♦ గలయనిరిగి
ద్విజసంతతుల మింటి ♦ తెరువ్రునంటగఁజేసి
గోచయంబుల తెల్విఁ ♦ గొఅలఁజేసి
బలముచే సరసుల ♦ భంగపాటొందించి
సుమనః ప్రపాతన ♦ స్ఫూర్తిమించి
పరరజోవత్తులైన ♦ పద్మినులఁగలంచి
యుత్పల ప్రీతిచే ♦ నుల్లసిల్లి

గీ. మహినిస్థావరములజంగ ♦ ములఁగ్లంప
మొందజేసి పిశాచాది ♦ యోగ్యవృత్తి
మేనులభరించి దర్పించి ♦ మించియిపుడు
మలయవలదుర నామీఁద ♦ మలయపవనా. ౨౦౩

క. పవనావన్నికి! కరుణింపవనాపవనాళినగర ♦ భారగమలయో
పవనోదర భవనాకర! జవనాకుసుమాళుగాంగ ♦ జాతశతాంగా. ౨౦౪

—:వసంత దూషణ:—

క. తివిరిమదన యానమవై! తివిగాభవనాయమాన ♦ దీన్యన్మలయో
పవనాగురుపవనాజరు! పవనాముకుబారిని గుడి ♦ పై రాకుండగ ౨౦౫

గీ. పకలజాతుల కెల్లన ♦ సహ్యావృత్తి
సంచరింపుచు నుండు వ ♦ సంతనీవు
విరహిదశనొందు చున్నట్టి ♦ వెలఁదులందుఁ
గనుణలేనట్టి కాయఁజు ♦ గదియఁదగునా ౨౦౬

వ॥ అని పలికి పికశుకమధుక రాదుల నిందించి నివ్వెరఁ గందు యాసుందరింగని చెలులపుడు ౨౦౭

చ. కదియఁగ జేరిచేరి బిగి • కౌఁగిటఁ జేర్చి యదేమి దేమి నీ
వదరునఁ జెందనందములె • యానవునేమన నింటికేగినం
గొదువ యొకింతలేక యొన • గూఁడుశుభంబన నమ్మినమ్మి కం
బాదలెడు విప్రలంభ పరి • పూరితమానసయై రయంబునన్. ౨౦౮

వ. ఇవ్విధంబున బోధితయై సఖీజనంబులతోడ నిజాంతఃపురంబు ప్రవేశించి యొక్క సూనశయనంబునం బవ్వళించి మిక్కుటంబగు చక్కెరవిలుకాని చిక్కులఁజిక్కి నొక్కి కళవళపడుచు నలుదెసలంజూచుచు నాచిగురాకుఁబోడి విరహవేదనా ధూయమాన మానసయై యుండు తఱిఁ దత్సఖీజనంబు వగచి తద్విధంబుఁ దెలియఁ దజ్జనకున కెఱింగించ నతండు శైత్యోపచారంబులు జేయ నియోగించిన. ౨౦౯

సీ. నెలరాలనల్పఁ గిన్నెల। జిలజిలయని జాలువారు • శీతలవారిన్
పలిపె ముత్తామరనూల్గల। తెలివలువలు ముంచిమించి • తేకువతోడన్ ౨౧౦

గీ. కప్పురంబును బన్నీరు • గదిసినట్టి
గందమందంబుగాఁ బూసి • కంజపుంజ
కేసరంబుల వ్యజనంబు • జేసివిసరి
శాంతి నొందింపుచుండిరి • సంభ్రమమున ౨౧౧

వ. అని శౌనకాది మహామునులకు సూతుండు జెప్పిన ౨౧౨

మ. అసమాశేష విశేష పాశుపతయో • గాధేయగాధేయతై
జసవృత్తి ప్రదవిశ్రుత శ్రుతిశిర • స్సంధాన సంధానమ
ల్లసమాన ప్రమథాధి నాయకసదా • లంకార లంకారసా
రసదింద్రాది నుతాంఘ్రి పద్మహృతపా • రావార రావారయా

సీ. రణవిజితలాంకజృంభణ। చణకాంచదనంతకోటి • సరసీరుహాభా
గణితాంధక వారదృంభా • ఫణిమణి ఘృణిలసితకర్ణ • ప్రత్యక్పూర్ణ ౨౧౩

పంచచామరము

చరాచర ప్రపంచరూప • సజ్జటాట వీనట
స్మరుత్సరిత్త రంగసంగ • మప్రశస్త మస్తకా
సురాసురాది వందనీయ • శుద్ధశైవ భక్తిమ
ద్ధరామరప్రధానధీని • ధానముక్తిదాయకా ౨౧౫

మ. ఇదిరాజేశ్వర పాదపంకజ సప • ర్యైతప్రభా ... ప్తసం
పదుదీర్ణత్వ విధుత్వ ధర్మసుగుణ • ప్రావల్భ్య సంయుక్తసం
మ్మదరాజన్న నృపాలకాభిహితశుం • భత్కీర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము చతు • రోలాస మొప్పా౯ధర౯ ౨౧౬

గద్య.

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద ప్రా
పాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్ల గోత్రపాత్రి కామినేనివం
శపయః పారావార రాకాసుధాకర రాజద్రాజన్న దేశాయిసార్వ
భౌమాజ్ఞా పితాంధ్ర గీర్వాణ కవిత్వతత్వ చాతుర్యధుర్య
పరాశరగోత్ర రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయురభ్యుదయంబను
మహాప్రబంధంబునందు
చతుర్థోల్లాసము



శ్రీ శుభ మస్తు

# భద్రాయురభ్యుదయము



## పంచమోల్లాసము

---



శ్రీమత్సువర్ణ పూర్ణమ
ణీమయసంతత సువాసి • నీపూజితల
క్ష్మీమందిర పరితోషిత।
రామారెడ్డీంద్ర నగర • రాజమహేశా. ౧

వ. అవధరింపుము • శౌనకాది మునీంద్రులకు నిఖిలపురాణ వ్యాఖ్యా విఖ్యాతుం డైన సూతుం డిట్లనియె నట్లు నారాజకన్య నిశాంత సమయంబున శీకృత శైత్యోపచారంబు లొందుచుండు సమయంబున ౨

సీ॥ ఎడనెడఁ గన్పట్టు • నడుతతుల్ ముత్తెంపు
గుత్తులు గలపువ్వు • గుత్తులుగను
తొగరుఁడాల్గల మొగుల్ • తెగలు లత్తుకనుబె
డంగైన చీరచెౌ • రంగులుగను

మెఱుఁగారు కటిమొగుల్ ♦ తెరతెరల్ నలుపైన
యగరు ధూపంబుల ♦ పొగలుగాఁగ
బలుచనై వెలయువె ♦ న్నెలపిండు లందంపు
గందంపుకోరల ♦ చందములుగఁ

గీ॥ బొడలచాయలు కపురంపు ♦ మడుపులుగను
గుంపురేయెండ దీపంపు ♦ సొంపుమీరఁ
బొలిచె నౌనాయికానాయ ♦ కులకుఁ గలయుఁ
కేళికా తల్పమనఁగన ♦ వ్వేళమింట

సీ॥ శ్యామానుమోదంబు ♦ నమకూర్చి కలజీవ
నములకుఁ జల్లద ♦ నంభానర్చి
సంపూర్ణ కళలచేఁ ♦ బెంపువహించి కు
ముద్వతీ వికసితా ♦ మోదమొనసి
బహుళరశ్మిస్ఫీతిఁ ♦ బలుమారు బుధకోటి
కర్పించినట్టి మ ♦ హానుభావుఁ
డనుదిన శ్రీవ్యయా ♦ వ్యయమునఁ దనరారి
కువలయంబుల ప్రేమఁ ♦ గోరుచున్న

గీ॥ సరసుఁడైనట్టిరాజు ద్వి ♦ జప్రభువుల
స్వపదములనుంచె యామత్ర ♦ యపరిమితప
థంబు గతియని పలుమరు ♦ ధర్మదేవ
తలు బలుకురీతిఁ జరణాయు ♦ ధములు మ్రోసె

ఆ॥ సకల చక్రపాల ♦ నకుతూహాతేనుండు
శార్వరప్రకాశ ♦ శాసనుండు
కదిసిరాగ నెదుట ♦ కాహళంబులు మ్రోయు
సరణి కుక్కుటములు ♦ తరచు మ్రోసె

ఆ॥ ఇంక మరుద్విజాళి ♦ వృత్తులొనఁగు కొర
వచ్చెనని త్రిశుద్ధి ♦ వాచకముగ
నమ్మెఁడనుచు సజ్జ ♦ నమ్ముఁదెల్పఁగ తీఁగు
క్కుటములొక్క చక్కిఁ ♦ గూయఁదొడఁగె ౬

గీ॥ వీర్యవృద్ధికరంబుగా ♦ విశదపాద
రసఘుటిక వుక్కుటనుబెట్టి ♦ రాజసమ్మ
దోత్తరాద్రి సతీకేళి ♦ నొనరిమరల
నుమియుగతి వేగునక్షత్ర ♦ ముదయమయ్యె ౭

చ॥ బలువియ దాలయంబునన ♦ పారసరంపరలైన పూసరం
బులగతి వెల్గుతారలను ♦ బొల్పుగ వేకువ యాదికెంపుతో
య్యాలిలలిమించు శోధినిబ ♦ యల్పడనూడిచి యొక్కరాశిగా
నలరిచెనోయనంగ జల ♦ జారిగనంబడె సారెసారెకున్ ౮

మ॥ కమనీయారుణ వాసరంబను వనౌ ♦ కంబానభోవృక్షమిం
పమరన్ప్రాచికిని శాఖ్యాశాఖలనూము ♦ న్నట్టిట్టు గానూచబు
క్షములఁ బువ్వులు పల్చనై కనఁబడెన్ ♦ చంద్రుండనే పండు ప
శ్చిమపుంసంద్రములోన వ్రాలెననఁదో ♦ చెన్ సంధివేళన్దగన్ ౯

వ॥ మఱియును ౧౦

గీ॥ యామినీ కామినీపీత ♦ హస్తసార
సీరుహచ్యుత పతేయాళు ♦ శేషమధుభ
రస్ఫురద్రాప్య పానపా ♦ త్రంబనందఁ
జరమ బూధరమునశీత ♦ కిరణుఁడలరె ౧౧

గీ॥ ద్విజపతియునై ప్రవృద్ధసం ♦ దీప్తవారు
ణీసమాగమమునవుండి ♦ నిశ్చయముగఁ

బతితుఁడగునని నవ్వీన ♦ పగిదిదూర్పు
దెసను తెలిడాలు ♦ గనుపట్టెఁ ♦ దెలివిదనర

శా॥ అంధీకార ది శాంధమంధతమసా ♦ హంకార శూరంబనం
బంధేందీవర గంధమంబు రుహాసం ♦ బంధానుసంధానతా
బంధూభూత మహార్మ్మఖాగ్ని ముఖసం ♦ ప్రాప్త ప్రభంబుజ్వల
ద్బంధూకస్తబకాభిరామము జగ ♦ ద్బంధూదయంబొప్పినన్ ౧౩

వ॥ మఱియుఁ బ్రాచీకుమారీలలామ లలాటతటఘటిత కుంకుమ తిలకంబనఁ బ్రాగ్దిశా విలాసినీ కనక కుకురంబనఁ దప్తలోహ కుంభంబన మంజిష్ఠారుణ పట్టసూత్ర పిండంబన ప్రాగ్ధర ధాతుధారా ఘనదిగ్గజ పాదతలంబనఁ దిమిరచోరుండైన దివాకరుండన సంహృతతారకుండై న కుమారుండనఁదగి ఉల్లసిత పద్మిండై పద్మనాభుండనఁదగి గోపతియై శంకరుండనఁదగియుండి యరుణ కేసరి ఖరనఖరహతాంధకార కరీంద్ర రక్తధారలై యుదయగిరి గైరికధాతు భూతలపరాగంబులై హేమారవపరి కుపిత కానన సెరి భభయచకితపూష శతాంగ తురంగ ఖురపుటీపాటిత పద్మరాగోత్కరత్కాంతులై ప్రాగ్గిరికూట కోటిప్రరూఢజపాకుసుమద్యుతులై యరుణ కిరణంబులు వెలయ జలధరచ్ఛదాంతరేంద్ర ధనుఃకాంతి లేపంబన శాక్యాశ్రమశాఖిశాఖాతాండ వితకాషాయపటంబన వ్యోమసౌధాంగణ లిప్తకుంకుమ రసంబనఁ గామమహానటన నటనయోగ్యారుణ యవనికాపటల మనఁ బ్రవాళ భంగారుణంబైన బాలాతపంబు ప్రసరించెఁ గ్రమక్రమంబుఁ జక్రవాక హృదయసంతాప హరణంబువలనఁ దహనప్రవేశ ప్రభాగ్రహణంబువలన సూర్యకాంతోపల సంగమంబువలన నుష్ణత్వంబు వహించిమించిన ౧౪

చ॥ పలుచని నాతెఱల్ మెఱుఁగు ♦ పట్టుల గన్పడుచుండ బేరురంబులవలిచన్నులన్నెలల ♦ పొందలి నందముజూఁపగందప్రుందళుకులు మేనదంతురిత ♦ ధామముఁబూన నిజాంగణంబులన్
వెలచెలులట్టిమెండలను ♦ వేడ్కఁ జరింపుచు నుండిరింపుగన్ ౧౫

వ॥ అట్టియెడఁ గీర్తిమాలిని విరహసాగర నిమజ్జనోన్మజ్జన సజ్జీభవదంతరంగయై నిజమనోహరుండు దృగ్గోచరుండుగాఁ దలంచి మనోవృత్తిఁ జక్కఁజేసిన నది సంకల్పమాత్రంబై తోఁచ జాగరావస్థాధీనంబై కృశత్వంబు సంపాదించి యరతిప్రకారంబు లజ్జాభావంబు మూర్ఛోన్మాదంబులు జిత్తంబునం బేరంబులు వారవియోగావస్థ నొందిన ౧౬

కం॥ ఆసమయంబునఁ గుసుమశ। రాసనుఁడా సుదతిహృదయ ♦ మట్టిట్టుగను
దాఖసిశరములను సారెకు। గాసింబడఁజేయ సకియ ♦ కళవళపడుచున్ ౧౭

కం॥ చెలులార; మరుని బారిం। గలఁగితి నే నెట్టులింకఁ ♦ గడ తేరుదు నా
వలవంతఁ దీర్చ రేయని। యలరుల పానుపునఁ బొదలి ♦ యలసుట నొందన్ ౧౮

కం॥ వనితవిరహార్తిఁ బలికిన। వినియుత్తరుణీలలామ ♦ విధమంతయుఁ ద
జ్జనకునికిఁ దెలియఁజెప్పినఁ। దనయపయిం గూర్మిచేత ♦ ధరణిపుఁడంతన్ ౧౯

గీ॥ నిఖిల సుగుణరత్న ♦ నీరధియైన భ
ద్రాయువల్లుఁడైన ♦ నంతకంటెఁ
బుణ్యమేమియనుచుఁ ♦ బురము చాటింపఁగఁ
బనిపి నిజపురోహి ♦ తునికిఁ దెలుప ౨౦

మ॥ వినయంబేర్పడ మంచిలగ్నము మనో ♦ వృత్తిన్విచారించి యో
జనపాలాగ్రణి; శోభనావసరమా ♦ సన్నంబుగన్ వచ్చె రా
ట్తనయుం డోడ్కొని రాగ మంత్రివరు వే ♦ డ్కం బంపు మీవన్న సం
జనితానంద మమందమై తనరఁగాఁ ♦ జంద్రాంగదుం డర్మిలిన్ ౨౧

కం॥ తనమంత్రివరులలో నొక। ఘనగుణమణి రాజకార్య ♦ ఘటనాచతురా
త్ముని వాయువేగ జవవా। హనరథమున నునిచి పనుప ♦ నాతఁడు గడిమిన్ ౨౨

గీ॥ భూరితర మోదమున వైశ్య ♦ పురములోవ
సించు భద్రాయుఁగని ప్రమో ♦ దించి రత్న

నికరముతోఁ జముగఁ జేసి ♦ నిఖలరాజ
మంత్ర తంత్రాంగములఁ దెల్పి ♦ మదిఁ గరంచి ౨౩

క॥ స్వామీ; చంద్రాంగదుఁడను। భూమీశుఁడు తనదుకూర్మి ♦ పుత్రికనుబలో
ద్దాముఁడవగు నీకియ్యఁగ। నేమంబొనరించెనిపుడు ♦ నియతాత్ముండై ౨౪

ఉ॥ కావున నీవువచ్చుటయె ♦ కర్జమటంచు వచించియుమ్మహా
భావుఁడు వైశ్యవర్యుఁడు స ♦ బాంధవుఁడై చనుదేర దీప్తర
త్నావళి మైన వాహనము ♦ నందుముదంబునఁ దల్లినుంచిపుం
భావపరాక్రమక్రమము ♦ బర్వస హాసుఁడై రయంబునన్ ౨౫

క॥ వచ్చిన నెదురుగఁ జనిమును। గ్రుచ్చి పరీరంభమునుంచి ♦ కూరిమితోఁడన్
విచ్చల విడివిడిదలలో। నచ్చుపడన్ విడియఁజేసి ♦ యతిమోదమునన్ ౨౬

వ॥ పురాధికార పురుషుల రావించి వివాహకార్య ప్రయత్నోత్సవం బవలంబిం చుండని నియోగించిన శుంభద్రంభా స్తంభంబులు నిలిపి గరికపచ్చల తోరణం బులు గట్టువారును బ్రశస్త కస్తూరి కలనసలికి యొప్పిన కప్పురంబున ముగ్గు లు పెట్టువారును. మృగమద సంకుమద పరిమృదిత హిమాంబు సంచయంబుల నెల్లకడలం జల్లువారును వివిక్త ముక్తాఫలరంగ వల్లీసంగత శృంగాటకంబుల హాటకమయ వర్ణనీయ పూర్ణకలశంబు లుంచువారును నిట్టుల బహువిధ శో భనకార్యంబు లొనరించి యాభద్రాయువును శిల్పకళా మర్మ పారగ నిర్మిత భర్మమయలక్ష్మీవిలాస మందిరంబుల వసింపఁజేసిన ౨౭

గీ॥ అట్టుల వసియింపఁ గూతురు ♦ ననుగుచెలుల
కలరఁ జేయుండనుచుఁ దెల్పి ♦ నంతకంత
కభినవవ్యక్త లావణ్య ♦ మమరఁగాఁ బ్ర
సాధికలు తత్సమయకృత ♦ సాధనముల

సీ. తతపయో ధరనిరో • ధంబుగా నంబరం
బలరించఁ దగెనొక్క • తలిరుఁబోఁడి
ఘనసువర్ణపరిభఁ • గన్పట్టునంజనం
బమరించఁ దగెనొక్క • కమలవదన
హృదయరంజకముగా • మెదపి కుంకుమగంధ
మలరించఁ దగెనొక్క • జలజనయన
నేత్రాంతకాంతితో • సూత్రపట్టినరీతి
కస్తూరి బొట్టొక్క • కలికిదీర్చె

గీ. విమల గోరోచనాచిత్ర • కములురోజ
గల్లసీమల యందొక్క • కాంతనిలిపెఁ
జరణతలముల లాక్షార • సపరికార
ముంచి చెలరేఁగె నందొక్క • చంచలాక్షి ౨౯

ఆ॥ మెఱుఁగులీనుచున్న • మేలిమి సంపంగి
విరుల మెఱుగుతురుము • తరుచుమెఱసె
మెఱుపు విడుముకొన్న • మేఘమో యనఁగను
వెలసెఁ జూమవారు • వెరఁగుపడఁగా ౩౦

క॥ పుల్లుగడిగినట్టి ముత్తియ। ములచే రొకసకియదీర్చె • ము[illegible]
వెలసె నలతురుము తారో। జ్వాలదంతుర మైతనర్చు • జలధరమనఁగ ౩౧

ఆ॥ చెలియయొకతె సకియ • చెలువైననాసను
గొప్పముత్తియంపు • నొప్పునుప
నాస్యమునఁ దలిర్చె • నధరామృతప్రతి
బింబమైనరాజ • బింబమనఁగా ౩౨

గీ॥ సుదతి యొక్కతె కరములఁ • బదతలములఁ

గంకణంబులు ఘనహంస • కములు నిలుప
మెఱసెఁ దద్దేహలావణ్య • సరసిలోన
నవి వినోదింపు టాశ్చర్య • మవునెతలఁప ౩౩

చ॥ చెలియ యొకర్తు బోటికటి • సీమపయిన్ రతనంపుసొంపు బి
ల్లల మొలనూలు నిల్పిన సు • లక్షణమై కనుపట్టె నెట్లనన్
గలికి విలోచనంబులు మృ • గంబులనన్ విలసిల్లుచుండఁగా
న్నోలయును దారమారమృగ • యుండొనరించిన జాలమోయనన్ ౩౪

సీ॥ తీగబోడి యొకర్తు ను • త్తెంపుసరులు
గలికి కుచసీమ వెలయింప • వెలసెనవియు
వెలఁది వేసవి మేఘంబు • వలనఁ దొరఁగి
గిరుల జాల్గొను ముక్తప్ర • కరమనంగా ౩౫

గీ॥ పొంకమై తగువజ్రతా • టంకయుగళ
మొకసరోరుహలోచన • యుంచనలరె
మంగళాంగతి దంగనా • పాంగశరము
సానబట్టెడు కంతుని • శాణములన ౩౬

క॥ చెలియొక తెరుచిరమౌక్తిక। ములచే లు నుదుటఁజేర్ప • ముదమలరించెన
య్యలికార్ధ విధుఁడు తారా। వలయవిలాసంబుదోచ • వఱలెననంగన్ ౩౭

క॥ తరుణియొక తె నవరసరిచ। నుతమణిగణ ఖచితఘంటి • కాధ్యానముపై
మెరసెనభోంతర్గతమై। మెరుగుల నెడ తెగక నిలుచు • మెరపోయనఁగన్ ౩౮

గీ॥ పడఁతి యొక్కతె తళుకుల • పద్మరాగ
మణుల పదకంబు సవరింప • మహిమ నలరె
సరసతఁ దలిర్చు కుచసీమ • గిరులనడుమ
డంబుమీరిన బాలార్క • బింబమనఁగా ౩౯

సీ॥ లలితకంబుసమాన ♦ గళమందు నేకమై
భాసిల్లు ముత్యాల ♦ పట్టెగట్టి
సుందరదోఃకాంతి ♦ కందళప్రసములౌ
సందిటి తాయెతుల్ ♦ బొందుపరచి
పొగ రెక్కు బిగిమైన ♦ జిగిగబ్బిగుబ్బల
సవరించి జాలీల ♦ రవికెదొడిగి
కస్తుగోరోచనా ♦ కస్తూరికాసంకు
మదకుంకుమాగరు ♦ మలయజాది

గీ॥ వస్తువుల విస్తరించిరి ♦ వలయునెడల
రమణీయక దేహాభి ♦ రామసీమ
నలరఁజేయుచు దృష్టిదో ♦ షాభిహతిగ
మంచి సామ్రాణి ధూపము ♦ ర్పించి మఱియు ౪౦

గీ॥ తరుణియొక్కతె నిలువుట ♦ ద్దంబుదెచ్చి
యెదుట నిల్పిన నారాచ ♦ సుదతిఁజూచె
నంగశృంగార రసభేద ♦ మమరనపర
లక్ష్మియనిమద నాత్మీయ ♦ లలనలలరా ౪౧

వ॥ ఇవ్విధంబున నలంకరించుట విని పెండ్లికొడుకు నలంకరించుఁడని నియోగించిన నర్మసఖులుగడంగి ౪౨

సీ॥ సంపంగ నూనెచే ♦ సవరించి యొక్కతె
శిరసంటెనమ్మహీ ♦ పరసుతునకు
మలయజపరిమళ ♦ మర్దితంబై నట్టి
నలుగిడె నొకతెమ ♦ విలసితునకు
నామోద యుక్తమౌ ♦ నటకలి నొనరించె
నొకముద్దుగుమ్మయా ♦ యుర్విపతికి

పన్నీట జలకమే ♦ ర్పరచెనొక్క లతాంగి
సాహస బిరుదాంక ♦ సంయుతునకు

గీ॥ మిసిమిబంగరు కోకచే ♦ మేనునంటి
నట్టి తడియొత్తె నొకలేమ ♦ యధికమతిని
దివ్యవసనంబు గట్టించె ♦ దెరవయొకతె
సకల జనసమ్మోద ప్రద ♦ జనవరునకు

సీ॥ రంగుబంగరుశాలు ♦ రింగులువారంగ
గప్పి మేనునసిరి ♦ గందమలది
కురులలో బువ్వులు ♦ దురిమి క్రొమ్ముడివేసి
పైమణి మకుటంబు ♦ బదిలపరచి
కళలీను మకరకుం ♦ డలములు శ్రవణసం
గతములుగా జేసి ♦ కరములందు
గంకణంబులునిల్పి ♦ ఘనదోర్యుగమునందు
గేయూర వరములు ♦ గీలుకొల్పి

గీ॥ వక్షమున బతక మొనర్చి ♦ వజ్రరశన
గటితటి సవరించి డా ♦ కాలబిరుద
సారమై తగుగండపెం ♦ డారముంచి
పడతులీరీతి వరు బెండ్లి ♦ కొడుకుజేసి ౪౪

చ॥ కళలు వెలుంగునెన్నొదుట ♦ గస్తురినామము దిద్ది సొంపుగా
గలయగ గంఠసీమసిరి ♦ గందముబూసి సరుల్ ఘటింపుచుం
బొలుపుగ గప్పురంపుమడ ♦ పుల్ దగనోటికొసంగుచుం సఖుల్
నిలువగు దర్పణంబెదుట ♦ నిల్పిన జూచెద దోచితస్థితిన్ ౪౫

వ॥ ఇవ్విధంబున జూచి భద్రాయున భంగమంగళ స్నానానంతరంబున ససాధన ప్రసాధికాలంకృతులంగైకొని నిర్జితసంక్రందన నందనుండు నిర్భర్త్సిత రాజ

రాజతనూజుండు నిందిత వసంతుండునై నిరుపమాన మానాతీత నూతన శృంగారరస విశేషుండు తన్మహోత్సవాగతానంద కందళిత దరహాస సుందర వదనారవిందుండునై యుండుటవిని ౪౬

చ॥ అలరు మనంబుతోడ వసు • ధాధిపుఁ డాప్తులఁ బుత్రమిత్రమం
త్రులఁ దగుబంధులంగనివు • రోహిత నిశ్చిత చంద్రతారకా
బలయుత లగ్ననిర్ణయము • బర్విన వేడుకతోప నాయెడఁ
గలిత వివాహవేళయని • కైకొనుఁడందఱు సంభ్రమంబునన్ ౪౭

వ. అని పెండ్లికొమరుని కభ్యుదయిక స్థితి నొనరించి గోదాన భూదాన హిరణ్యాది దానంబులు నిర్వహించి బహుమణిగణాగణిత భూషావిశేష భూషితులును బంధురసుగంధ మాల్యాలంకృతులును. బరిమళ మిళిత గంధలేపన శరీరులును బాంధవులు వరునివారలై వచ్చుట కిచ్చగించి భేరీపటహఢక్కాడిండి మమర్దలతాళకాహళ ముఖవృద్యానవద్యధ్వనులును వారనారీవిలాస కుండలిదండలాసక ప్రేరణాది నృత్తావధాన విధాన చమత్క్రియా చంచలమణి శ్లాఘ్య మేఖలా మంజుసింజాన మంజీర విలసిత వలయకింకిణీ విలాప సంభూతారావ సంఘాతంబులు తర్కద్వయ సాంఖ్యయోగమీమాంసాయుగ భాట్టప్రాభాకర నాటకాలంకారాక్షీణలక్షణ గంధసందర్భ దుర్భర వ్యాఖ్యాన ప్రఖ్యాతి ధౌరంధర్య ధుర్యావనీసుర క్షేమంక రాశీర్వాద భేదంబులు వందిమాగధ జయజయ శబ్దంబులు మాధురీధురీణతాన మానషడ్జ మధ్యమ గాంధారబంధుర గ్రామకరానూన గానన సంధాన గాయక వీణావేణు ముఖనిన్వనంబు లేకీభవింప నిజాజ్ఞావశవర్తి సమాగతాంగ వంగకళింగ కాంభోజాది దేశాధీశ్వర సల్లాపంబులు చెలంగనిజమనోరంబులగు రథంబులును, సంతత గాంభీర్య నిర్జిత సింధువులగు సింధువులును, జవనదూరీకృత గంధర్వంబులగు గంధర్వంబులును, నిరంతర బాహుబలోద్భటులగు భటులును దనర భద్రాయు భద్రగజంబు నెక్కించి మండలాధిపతులను సామంతుల నతనివెంబడి రానియమించి సాంద్రచంద్ర చంద్రికా ప్రభాసుర వివిక్త మౌక్తికాతపత్రంబులు ధ్వజాలవట్టి కావ్య జనాదులు పదడిపఁ బరశుగదా ప్రాసతో మరభిండివాల మండలా

గ్రాది సాధనంబులుగాని కాల్బలంబునే తేరం గనత్కనకమణిమయ వేత్రహస్తులు నలుదెసల బరాబరులుసేయ బంగరు పళ్ళెరంబుల సాక్షత మృగమద సంకుమద ఘనసార గంధసార కుంకుమ చంపక తైల హిమోదకాది గంధిల ద్రవ్యంబుల గొనుచు బుణ్యస్త్రీలు నిజకర సరసిజ పరిస్ఫురన్మంగళారాత్రికలు వెలుంగ రత్నమయ పాత్రంబుల నవీన దుకూలంబులు మనోహరంబులు ఫలంబులు కుసుమంబులు గొనుచు కనకమణిమయ రాజప్రాజ మార్గంబునం జనుదెంచు సమయంబున ౪౯

గీ॥ అమ్మహాత్మునిం గనువేడ్క నతివ యొర్తు
హారవల్లులు మొలనూళ్ళఁ గారఁ జించి
కంకణంబుల నలకాళ్ళఁ గడియములుగఁ
జేసి చనుదెంచె విభ్రమస్థితిఁ దలిర్ప

క॥ స్నానంబు చేయుచో నొక। మానిని రవణములదాల్చి మఱచి జగద్ర
క్షానిపుణత్వము గలిగిన। యానరపతి సుతునిఁ జూడ నల్లన వచ్చెన్ ౫౦

ఉ॥ చేడియ యొర్తు గల్లకుచసీమల పై మకరీకలాపముల్
వేడుకతో వహించక రవేనలి దూలఁగ వేగ మొప్పఁ దూ
గాడెడు హేమధామ వసనాంచల మిట్టటుఁ జేసి కొంచు త
న్గూడిన ప్రేమ నవ్వగను గోరిక దీరఁగ వచ్చెఁ జెచ్చెరన్ ౫౧

మ॥ పొలంతి యొకర్తు నెచ్చెలి యుతపుష్పాడి చీర ధరించి మేడలో
వలఁగల యంగజానితనప్రాణసఖుండు రతిప్రసంగముల్
దలపంగ వల్దువల్దనుచుఁ దవ్వగనిం గనవచ్చెఁ జెచ్చెరన్
బిలువని పేరటంబనుచుఁ బెక్కు తెఱంగుల గేలిసేయఁగన్ ౫౨

ఉ॥ రామ యొకర్తు వచ్చి యలరాజకుమారునిఁ గాంచి కాంచికా
దామము పుష్పదామము యథాక్రమ యోగమున్ పొందనందమా

మోహమునసాదు బొట్టమర ♦ ముంగురులల్లన నాడఁజూచు భా
మామణులెల్ల నవ్వగను ♦ మారవికారము జెందిమున్నుగన్ ౫౩

శా॥ ద్వారాసక్తదృగబ్జముల్ దనరనిం ♦ ద్రప్రస్త రంగారశృం
గారోదార విహారకేల్ మరచిభూ ♦ కాంతాత్మజుండల్లదే
తారేశారె యటంచుఁబిల్చి కొనుచున్ ♦ రామామణుల్ వచ్చిరో
య్యారంబేర్పడఁ జూడవేడ్కఁ గలవా ♦ రాబాల గోపాలమున్ ౫౪

వ॥ ఇటుల సకలజనంబులు ఘనంబులగు నుపహారంబులుగొని యవ్వరునికి సమ
ర్పించి వెంటరానయ్యెడ ౫౫

గీ॥ మలయుచు పకోర నక్షత్ర ♦ మాలదనర
కుజను లడరంగఁగఁ విబుధ ♦ గురువులలరఁ
గలసిచూచు చకోరాక్షు లెలమిఁ జెంద
సత్పథంబున నారాజు ♦ సంభ్రమించె ౫౬

వ॥ మఱియు నీరాజన భాజన కరసరసిజాగణ్య పుణ్యాంగన లుప్పొంగుచు మంగ
ళపాఠంబులు పాడ దేదీప్యమాన కరదీపికా నేకంబులు వెలుంగ సాంద్రచం
ద్రజ్యోతిస్సంచయంబులు ప్రకాశింప నుభయ వైవాహిక బలంబు లెదుర్కొ
ను నెడ ముందుముందుగ నందంబుగ నందఱు గ్రంధుకొని గంధవహులు పిడికిళ్ల
కొలందిగుప్పునం బరవఁదత్సుగంధ బంధుర పరాగంబు నల్దెసలఁ బ్రసరింపుచుం
డ నిర్నిద్రభద్ర చతుర్దంతకాంత దంతావళంబులనుండి యామహీపతి కుమా
రుండు మగసాలందిగి యుద్దండ మండలాధిపతులు కైదండ లొసంగ సాకల్య
కల్యాణావహవివాహ వేదికకేతెంచి ప్రచుర రచిత నూత్నరత్న హాటక పీఠం
బునం దధివసించి యుండునంత మహోత్సవంబున జంద్రాంగదునను మఱివ
డసి యత్తఱి ౫౭

## భద్రాయువు కీర్తిమాలిని వివాహమాడుట

గీ॥ పాలఁతుకలుపొంగి సింగార ♦ మొలుకఁదళుకు
బెళుకుచూపుల నద్దెసల్ ♦ వెలుగ గలికిఁ
గులుకుగుబ్బలు మోహంబు ♦ దెలుపమెఱుపు
మొలకనగఁకీర్తిమాలిని ♦ నిలుపనపుడు ౫౯

క॥ తెరఁబట్టిరి తెఱవకుఁదెర। తెరమైలజ్జోదయంబు ♦ తీసువరాన
త్తెరఁ గెఱుఁగలేక జనమే। తెరపైపైఁ గదియుభాగ ♦ ధేయత్మదార్యుల్గాఁ

చ॥ వెలయఁగ సావధానయని ♦ వేదవిదుల్ బలుకంగరాజున
త్ఫలకరవిశ్రుతశ్రుతివి ♦ ధానగతిన్మధు పర్కమాదిగా
గలుగు విశేషకార్యములఁ ♦ గౌశలమేర్పడఁ జేసి కామినుల్
బలుమరు మంగళార్థగతిఁ ♦ బాటలుబాడుచు సంభ్రమింపఁగన్ ౬౦

క॥ జలజాక్షి గళమునను మం। గళసూత్రముఁ గట్టెవరుఁడు ♦ కౌతుక మొదవన్
జలజాస్త్రు గెలిచి తత్పురిఁ। గలువలతోరణముగట్టు ♦ కైవడిదోవన్ ౬౧

క॥ నలువొందనప్పుడంజలిఁ। దెలిముత్తియముల ఘటించి ♦ తెరవతురమునన్
నిలుపనవియు జీమూతము। వలనన్ జలజలగఁ దొరఁగు ♦ వై పెఱిగించెన్ ౬౨

ఆ॥ వనితయప్పుడంజ ♦ లిని వెల్గుముత్యముల్
వరుని శిరముమీఁద ♦ విరివిఁజేయఁ
బరగఁ నింద్రుశిరము ♦ పై శచీదేవిక
ల్పకసుమంబులుంచు ♦ పాటిదనరె

వ॥ ఇత్తెరంగున ౬౩

సీ॥ ముత్యాల బాసికం ♦ బులు ఫాలతలములఁ
బొలుపొందు కాంతులఁ ♦ బొదలుచుండ
సప్తర్షి దివ్యతే ♦ జస్ఫూర్తి గలవాఁడ
గనిపల్కుబడి ముందు ♦ ననువుఁదోప

సప్తపదంబుల ♦ సనకల్లునంజేర్చి ♦
ప్రకృతి పురుషులెడఁ ♦ బాయరనెడు
సుధ్రువుఁ దోఁపగబమ్మ ♦ ముడిని వెలుంగుచుఁ
జెంగటనుప్పొంగి ♦ తొంగలించు

ఆ॥ వేడఁదగినకులము ♦ వేల్పులగురువగు ♦
తపసితేనిరాణి ♦ దర్శనంబు
జేసి పెండ్లిజగతిఁ ♦ డాసిపీఠంబుపై
పొలచి రవ్వధూవ ♦ రులుకడంగి॥ ౬౮

సీ॥ నిజమైనపెనువీఁడు ♦ నెలవైనదేవర
ఘూటలోఁదిరిగిన ♦ మధురవాణి
తేజరిల్లుచునుండు ♦ జేజేలరాయెదిఁ
బాయక నిలచిన ♦ పంకజాక్షి
బత్తులంబ్రోవఁగ ♦ సత్తెంబుగలదొర
కరగామెలంగిన ♦ పరమసాధ్వి
తరుచుగాసుఖయించు ♦ తెరగన్నులలరిన
పెనిమిటితోఁగూడు ♦ పువ్వుఁబోఁడి॥

గీ॥ గావలయునీవెలఁది యని ♦ కాంచుజనము
పొగడుచుండంగ నారాచ♦బోలతిఁమిన్న
మగనితోఁగూడి ♦ దేదీప్య♦మానయగుచు
మూర్తివిస్ఫూర్తిగను ♦ పట్టెమోదమలరా॥ ౬౯

క॥ సరసవృత్తులనవ్వధూ ♦ వరులువేద
ఫణితమార్గస్థితులనేరు ♦ పరచితెలుప

---

* కీర్తిమాలిని జూపట్టెమూర్ధసర- తా-ప్ర

నిత్యకర్తవ్య సంగతుల్ ♦ నెరపిరపుడు
బ్రాహ్మణాశీర్వచనములు ♦ బలసియుండ॥

చ॥ మునుకొని నేలవేలుపుల ♦ మూకలువీకను దానమాడి భో
జనము సకిచ్ఛగించఁగర ♦ సాతలనాథుఁడ భీప్సితంబుగా
నను వుపదంగపద్రసన ♦ మంచితమైన పదార్థమెల్లమున్
బనివడ వడ్డనల్ సలిపి ♦ బంతులవెంబడి సంచరింపుచున్॥

సీ॥ అన్నముష్ణంనస ♦ మంచితంశాకషా
కత్వంనభవతీహ ♦ ఘనశిలాటు
సంఘటితోపదం ♦ శవిశేష బహుళతా
నాస్తిరసాఢ్యప్ర ♦ శస్తపక్వ
ఫలసౌష్ఠవంనాస్తి ♦ బహుకృతభక్ష్యాది
క సమీత్యనితాంత ♦ కరుణయాప్ర
కటశీతలోదక ♦ పటుతాంనపరమాన్న
మస్తినాస్తర్షప ♦ న్యస్తవస్తు

గీ॥ సంచయోనాస్తిలవణంచిం ♦ చాఫలరస
కలితమోదనమోవభో ♦ క్తవ్యమత్ర
మదపరాధవిచార్యత్ఞ ♦ మస్వమనుచు
విభుఁడుభోక్తలనందఱి ♦ నభినుతించె

వ॥ క్రమ్మరనమ్మహీమండలాఖండనుండు దభ్రసితాభ్ర ప్రశస్తకస్తూరికాకుం
కుమ సంకుమద మృగమద హిమాంబు పరిమళ పరిమిళిత సుగంధబంధు రచ
ర్చల వలనను గంబూరంబు వేడబంబుగల తాంబూలంబుల వలననుం బహు
విధవాసనావాసప్రఫుల్లసత్ఫుల్ల హల్లకమల్లికాదికుసుమ విసరంబుల వలనను
సౌరవార నారీవిహార వారపార వారసార సాక్షీకృత తౌర్యత్రికచమత్కృ
తులవలనవిభావాను భావాద్యుల్లసద్రసవిశేష శ్లేషాభిముఖ సుఖముఖోచ్చార
ణోల్లాస కరపరిహాస కసల్లాప ప్రసంగంబుల వలసను ఇది మొదలగు దైనంది

న బహుమాస కార్యంబుల వలన నంతకంతకుసంతోషంబుల నందందయంద రి కానందంబు నొందించి సొంపుఁపుట్టించు నిలింప పతివైభవంబున సంభూ తోత్సవ ప్రభూత భూతలాధీశ జాలంబులకు జాతరూపస్వరూప చేలంబులొ సంగి ధరామర వరుల కపరిమిత రత్న సువర్ణ దుర్వర్ణ నిర్ణిద్రముద్రిక లొసంగి సుజన నేతయగు జామాతకుఁ బహువేల మొదవుల కదుపుల నంతకిమ్మడి తురం గంబుల నంతకు జమిలిబలుగొ మ్మల మెకమ్ముల నంతకు రెట్టిరథంబుల నం తకినుమడి యూడిగపుచేడి యలనంత కెక్కువ విడిను డి సంతకన్న మిగుల రతనంబులనివి మొదలగు హరణంబుల నాగమోక్ష ప్రకారంబుల సవినయం బుగానిచ్చి మణిపుత్రి యనందగు తనపుత్రింజూచి.

సీ॥ అత్తమామలయాన • నోగాదనక వారి
మనసురా మెలఁగుమీ • మంజువాణి
పతిమాట జవదాట • కతనికింపగు వేళ
నెదురాడఁబోకుమీ • యిందువదన
తోడికోడండ్రతోఁ • గూడివారలకెల్ల
హితమాచరింపుమీ • యిగురుఁబోడి
చుట్టాల యెడ యేనిఁ • గొట్టుమిట్టాడక
కరుణ రానమువుమీ • కంబుకంఠి

గీ॥ సేవలొనరించు దాసదా • సీజనముల
దయఁదలంపుచుఁ బ్రోవుమీ • తరళనయన
యెన్నికత్తింటికినిబుట్టి • నింటికెప్పుడు
వాసిరాగఁజరింపుమీ • భానుకాంగి 20

ఆ॥ ఎల్లజనుల యెడలఁ • దల్లితల్లి యనంగ
మెలఁగ వలయుబుధులు • మేలనంగ
భావమరుదులందు • నావంతయైనను
గడుసుతనము వలదు • కమల నయనా 21

క॥ మనుదాదులు ప్రమదాదులు। నినదాదులు నెరపఁబుట్టి • నెనరట్టిపడన్
ఘనజాలకవినుతాలక। చనజాల కయున్నగన్న ♦ జనకుండంతన్ ౭౨

చ॥ కరములుచాచి యెత్తుకొని ♦ కౌఁగిట నొప్పఁగ నప్పళించుచున్
శిరముప యింగనుంగవను ♦ జెందిన యశ్రువులుంచె నెట్లనన్
సిరిజనియించువేళ్లఁల ♦ క్షీరసరిత్పతి తచ్చిరంబునన్
దరగలుచాచిశీ ంరకదం♦ బములందగఁ జల్లెనోయనన్ ౭౩

వ॥ ఇవ్విధంబున గారవించి ౭౪

క॥ అమ్మా, అత్తింటికిఁబో। వమ్మా తడవేలచేసె ♦ దమ్మా; నీతో ♦ డమ్మా;
యింతటవచ్చెద। మమ్మాయీ జాలిమాన ♦ వమ్మా కొమ్మా ౭౫

ఆ॥ అనుచుజాలిమాన్పి • యంపక మొనరింప
మగుడి మగుడిచూచె ♦ జిగురుఁబోడి
చెలఁగిపెనిమిటెంత ♦ సిరిగలవాఁడైన
నతివపుట్టినింటి • కాసపడును. ౭౬

క॥ అంతట నవోఢతోసా ♦ మంతహితప్రరోహితాను ♦ మతితత్పరశు
ద్ధాంత ప్రదేశముధ ♦ కాంతుండొనరించె జనముకౌతుకమందన్ ౭౭

వ॥ అంత శుద్ధాంత ప్రవేశానంతరంబునఁ జొక్కమగు నొక్కసమయంబున

ఉ॥ చంపకగంధి యోర్తురభ ♦ సంబునరాజకుమారుఁజేరినా
కెంపుపసిండి గిండియును • నిండిన సంపెగనూనెం బూసెని
ద్దంపుకురుల్ నటింపఁగను ♦ దమ్మలు పెంపెసలారఁజన్నవన్
సొంపులుజూపఁగంకణరు ♦ చుల్‌గను పట్టువలగ్న మూగగన్ ౭౮

క॥ శిరసంటి వదనకమలము • చిరుచెమ్మట గ్రుమ్మరింప శీతోదకసం
భరితమగు నటకలిడిచె చ్చెరమజ్జనశాలకడకుఁ, జేర్చిపిదపముసన్ ౮౦

సీ॥ మంజువాణి యొకర్తు ♦ మజ్జనంబొనరింప
శ్వేతవస్త్రములొక్క ♦ చెలియగట్టె
మదవతి యొక్కతె ♦ మణిభూషలనొసంగె
శిరముననొకలేమ ♦ విరులుదురిమె
కంజాక్షి యొక్కతె ♦ కనకపీఠముపెట్టెఁ
గలికియొక్కతె మేన ♦ గంధమలఁదె
అగరుధూపమునొక్క ♦ యతివసమర్పించె
లలనయొక్కతెపాదు ♦ కలనమర్చె

గీ॥ నాతియొక్కతె నీరాజ♦నంబుజూపెఁ
బడఁతియొక్కతెసురటిచేఁ ♦బట్టివిసరె
బాలయొక్కతె రత్నద ♦ ర్పణముఁజూపె
రామయొక్కతె ఘనచామ ♦ రంబుబూనె॥ ౭౧

క॥ వనజాస్యయొకతె[ ]మోలన్ । గనకపుపళ్లెరముపెట్టె ♦ గలికియొకతె వా
సన దొలుకుజలములలరిన । కనకాలుకనుంచె వేడ్క ♦ కల్జనియింపన్॥ ౭౨

మ॥ సమరస్యంబయికించి దుష్టమగునా ♦ శాల్యన్నమున్ దుగ్ధమా
జ్యముపచ్చళ్ళునపూపముల్ వడియముల్ ♦ శాకంబులున్ సూపము
త్తమలేహ్యంబు రసాయనంబులు ప్రమో♦దంబొప్పవడ్డించిరా
రమణుల్ కంకణకింకిణీకటకజా ♦ రావంబు తోరంబుగాన్॥ ౭౩

గీ॥ ఇటుల వడ్డింపనవియెల్ల ♦ నింపులేక
పెరుగు పరమాన్నములరుచు ♦ లెఱుగఁలేక
కూరగాయలుచవియని ♦ కోరరాక
వలసివల్లమిసాపాటు ♦ సలిపెనవుడు॥ ౭౪

క॥ అంగనయొక్కతె ముంగల । బంగరుపావలుల గించ బదములఁదొడియా
భృంగారు జలముచేను । ప్పొంగుచుఁజేవార్చె రాజపుంగవుడంతన్॥ ౭౫

క॥ జాంబూనదవిదితములౌ । గంబూరపుబాగములను ♦ గ్రైరావళులస్
బింబోష్ఠియొకతియందియఁ । దాంబూలము వేసికొనియ ♦ ధావిధిదోపన్॥ ౮౬

సీ॥ పంజరసింజాన ♦ బహుకీరశారికా
ఫణితమన్మథతంత్ర ♦ బంధురంబు
జాలాగతారవ ♦ స్పర్శవీణారవా
కర్ణనోత్సుకపటు ♦ కలరవంబు
సుఖకృద్రతిరహస్య ♦ లిఖితబంధవిశేష
సంయుతయవనికా ♦ సంచయంబు
నవరత్న కీలిత ♦ నవ్యోపచారస
జీవపాంచాలికా ♦ సేవ్యతలము

గీ॥ సారఘనసార వరగంధ ♦ సారచారు
మసృణఘుసృణవిదిత సంకు ♦ మదమృగమద
ముఖరతి సుఖకరద్రవ్య ♦ ముఖ్యమగుచు
నలరుచుండిన కేళికా ♦ నిలయముననుఁ॥ ౮౭

చ॥ అరుదొనరించు కుందనపు ♦ టందలముల్ దగుతూగుటుయ్యెలల్
విరివిరిచప్పరంబులును ♦ వింతగుకాంతులఁ జెందు చందువల్
వరలెడు దర్పణస్ఫటిక ♦ వాటములున్ మగరాలదేహళుల్
తరళగ వాతురత్నములు ♦ తద్గృహదీపములై కనంబడున్॥ ౮౮

క॥ మగరాలకురుచలును నిగ । నిగమను మరకతపుమణుల ♦ నిడుపులు కోడల్
ధగధగను పద్మరాగము । లుగనొనరినశయనమున్న ♦ లోపలిదెసకున్॥ ౮౯

ఉ॥ మూలలనీలముల్ తుదల ♦ ముత్తెపుగుత్తులు సందుసందులన్
జాలగు పచ్చలున్నడుమ ♦ చక్కనిఁ గెంపుల జొంపముద్దులన్
మేలగుస్ఫాటి కాంతములు ♦ మించులసంచుల మించుపట్టెయున్
నేలుగఁగల్గి వెల్గుటకుఁ ♦ జిత్తమురంజిలి సేమ్మదంబునన్॥ ౯౦

కం॥ ఆరీతి మదినిఁబొదలుచు । నారాజనుతుఁడు పరిమ్మి యాంచితలీలా
గారాంతర శయ్యావర్యుఁ । గూరిమితో నధివసించి కోరికదీరన్ ౯౧

ఉ॥ ఎప్పుడువచ్చునోచెలియ ♦ యెప్పుడుప్రేమను గారవించునో
యెప్పుడు కౌంగలించుకొను ♦ నెప్పుడు వాతెరగ్రోలనిచ్చునో
యెప్పుడుకేళి సల్పుదొకొ ♦ యెప్పుడునేసల మారుగెల్తునో
యెప్పటికెప్పుడంచు హృద ♦ యేశ్వరిరాక మదిన్ దలంపుచున్॥ ౯౨

ఆ॥ చంచలాత్ములాల ♦ సించఁగారణమేమొ
కాఁసుధాంశునెండ ♦ కాకలకును
మరునిఢాకలకును ♦ మదతిరాకలకునేఁ
దాళలేనటంచుఁ ♦ దలఁకితలఁకి ౯౩

వ॥ ఇవ్విధంబున నెదురుచూచు చున్నంత। ౪

సీ॥ కురులుచక్కఁగదువ్వి ♦ విరులచేరులఁజుట్టి
విరివిగా మురిపెంపు ♦ తురుము మొనర్చి
సిరులీనువజ్రంపు ♦ చేర్చుక్కసవరించి
కస్తూరికాచిత్ర ♦ కంబునిలిపి
వీనుల మణిగణా ♦ న్వితకుండలములుంచి
యరుత ముత్తెపుపట్ట ♦ నిరవుగొల్పి
నిబ్బరంబొనరించు ♦ గబ్బిగుబ్బలమీఁద
గంబురాగలసిరి ♦ గందమలఁది

గీ॥ కరములను గంకణంబులు ♦ మెరయనుంచి
యలుకుతళుకుల హారంబట్టు ♦ చీరఁగట్టి
యడుగులను విడువక వ్రేలాయు ♦ సందియలును
సొవరపరచిరి ముగుదకుఁ ♦ జెవురుఁబోండ్లు ౯౫

వ. మఱియుఁ గర్బురాభంబులైన కుంభికుంభ సంభవంబులు రక్తసిత వర్ణంబు
లైన వంశజంబులు జ్యోతి ప్రభంబులగు జలద జననంబులు హారిద్రాభంబు
లైన యిక్షు సంభూతంబులు నీల కాంతిగల ఫణిఫణోద్భవంబులు శుద్ధస్ఫ
టిక సంకాశంబులగు శంఖ జాతంబులు కృష్ణలోహితచ్ఛవిగల వరాహదం
ష్ట్రోదితంబులు పాటల ప్రకాశంబులగు శుక్తి జన్మంబులు గజల హారంబులు
ముక్తావళులు దేవచ్ఛందంబులు గుత్సంబులు గుత్సార్థంబులు గోస్తనంబులు
మాణవకంబులు నేకావళులు నక్షత్రమాలికలు ననుహార విశేషంబులు నవ
రించి రత్నమయంబులగు భూషణంబులు శ్రీగంధాది పరిమళ లేపంబులు
నానావిధ కుసుమ మాల్యంబులు మొదలగు చతుర్విధ శృంగారంబుల నలం
కరించి యించుబోడులలోఁ బ్రోడయగు నొక్కచేడియ యాపూఁబోఁడి కిట్ల
నియె॥ ౯౬

శా. ఓ నారీమణి చెల్వునింగదిసి నీ । యుల్లాసముల్ జూపి నీ
వానింగానొనరించు మించుకవిన్నే । వాకౌఁగిటన్జేర్చుచున్,
సూనాస్త్రుంగెలిపించి నేరుపులచే ♦ సొక్కించి సోలించితే
నీనాన్నేస్త మెఱుంగవచ్చు నిపుడో ♦ నీరేజపత్రేక్షణా॥ ౯౭

గీ॥ అనుగులాత్తి పందు ♦ టాకుల సొగసైన
మడుపులొసఁగి రతుల ♦ జడుపులేక
సరసరతులవిభుని ♦ గరగించితేనియు
నేడు దెలియునీదు ♦ నిపుణతయును॥ ౯౮

క॥ వినుముద్దుగులుకు పలుకుల । వినఁదలఁచి విభుండుగోరి ♦ వేఁడిపలుకరిం
చిన సిగ్గుఁబడుచు లోభం । బొనరఁగ వినివినని పగిది ♦ నుండెదుసుమీ॥ ౯౯

చ॥ అనిచతురోక్తి సూక్తులగ । యాళితనంబునఁ బల్కునా సఖుల్
దనువిడనాడి యెక్కడఁ దొ ♦ లంగుదురోయని వారిపయ్యెదల్
బెనఁగొని వెన్కముందడుగు ♦ బెట్టుచు నందెలు ఘల్లుఘల్లనన్
గినుకఁదొలంగు చూపులన ♦ శీఘ్రతఁదూరుచు వచ్చెనయ్యెడన్ ౧౦౦

ందెంచి ౧౦౧

అతివమణిమయ కేళి గృ ♦ హాంతరాళ
రమ్యశయనంబు వసియించు ♦ రమణునెదుట
నిలిచి భయకంపవిస్మయో ♦ త్కలికపులక
ముఖ్యసాత్వికదశలచేఁ ♦ బొలిచియపుడు ౧౦౨

చెలియత్తద్దేహళీ ♦ సీమఁజెంది
వెనుకముందైన యడుగులఁ ♦ దనరెలజ్జ
యనెడు చెలివెన్క కొనగించ ♦ నలరుప్రేమ
యనెడు చెలిముందరికిఁ ద్రోచు ♦ ననువుఁదోప॥ ౧౦౩

న విభుని ప్రోల నిలిచిన ♦ తత్సఖులమ్మనోహరాంగు నిఁజూచి ౧౦౪

నేరుపరికాఁడవన్నిఁట ♦ నృపతనూజ
బాలఁజూచినఁగడు ముద్దు ♦ రాలుగాని
ప్రౌఢతన మేమియుంగదు ♦ బుజ్జగించి
తీరఁగడఁగాఁగ మెల్లన ♦ దిద్దుకొమ్ము॥ ౧౦౫

జ్జయై పెనఁగ ♦ నేరదుమాఁని కేళిలోపలఁ
ంమెలంగఁ జొరఁ ♦ బొరదు కౌఁగిఁటి కాసఁజేసినఁ
ంచి ముంగలికిఁ ♦ జీరదు శ్రీధరణీశ ప్పుత్రమా
కేళీవెరుగ ♦ వా వివరింపఁబనేమి మాకికన్॥ ౧౦౬

॥ అనుచుఁబక్కన నగుచు భ ♦ ద్రాయువపుడు
మందు ఘనసారసహిత తాం ♦ బూలములను
లలిత మణిభూషణాంబరా ♦ దుల నొసంగి
యెని పెనచ్చేడి యలనేరు ♦ పలరుచుండ॥ ౧౦౭

౧౦౮

వ॥ అటులలంభనిపిన॥

సీ॥ శ్రీగంధమే దెత్తు ♦ శ్రీగంధగజయాన
చంద్రంబునే దెత్తు ♦ చంద్రవదన
సుమజాలమే దెత్తు ♦ సుమనోరథావాప్తి
ఫలములేఁ దెత్తుజం ♦ భలదురోజ
సారసంబేఁ దెత్తు ♦ సారసాంచితవాణి
పాటలంబేఁ దెత్తు ♦ పాటలోష్ఠి
పరిమళంబేఁ దెత్తుఁ బరిమళోత్సవవాంఛ
సరసినేఁ దెత్తుఁ గే ♦ సరిసుమధ్య॥

గీ॥ యనుచు నొక్కొక్కరయ్యంతి ♦ ననుఁగుఁ జెలులు
కార్యమిమ్మునఁ గేళికా ♦ గారమెడలిఁ
చిఱునగవు నెమ్మనమ్ములఁ ♦ జెంగలింప
వచ్చిరయ్యెడ సిగ్గను ♦ వనితదక్క

౧౦౯

౧౧౦

వ॥ అట్టియెడ॥

క॥ పతియపుడు స్థాయిభావం ♦ బతిరతమునఁ దోఁచ ♦ భావహావాదికముల్
మితిలేక మెలఁగెఁ బ్రేమస్ ♦ సతిమోమున దృష్టినిలిపి ♦ సరభసవృత్తిన్

చ॥ చరణతలంబులెంచికర ♦ సారసముల్ బరికించి పెందొడల్
మురియుచుఁ గాంచి చిన్ననడు ♦ మున్ వివరించి చెలంగుచున్న మో
మరసివచించి పేరురము ♦ నందుఁ బ్రియంబున మించియున్న భూ
వరునయ నాంతముల్ మగుడ ♦ నెనులాతనికత్వ పొంపుఁగన్

౧౧౧

వ॥ అప్పుడు

సీ॥ సమ్మోదమునసల ♦ సంబులై యంతలో
గ్రమ్మరవలితప ♦ కారమొంది

ప్రేమచే నార్ద్రింబులై ♦ మాటిమాటికి
ముకుళీకృతంబులై ♦ మోహామునను
క్షణమాత్రమాభిము ♦ ఖ్యస్ఫీతివిలసిల్లి
లజ్జాప్తిచేఁ జంచ ♦ లంబులగుచు
గడుని మేషపరాఙ్ము ♦ ఖంబులైహృదయ భా
వా కూపములనుబ ♦ యల్పడంగఁ

గీ॥ జేయుచూపులచేఁబ్రియు ♦ జెంతఁజేరి
యిందిరాసు తుపట్టంపు ♦ టేచఁగనగఁ
నలరువిల్తుని నవమోహ ♦ నాస్త్రమనఁగ
నిలుచునయ్యెం తీఁగనుఁగొని ♦ నృపవరుండు ౧౧౩

సీ॥ ముందుగానేనయై ♦ నుంచలించినఁపల్క
నలుగునోకలుగునో ♦ తెలియరాదు
సూచితప్రేమచేఁ జూచితినా ♦ వెన్క
కేగునోలోగునో ♦ యెఱుగరాదు
పీఁడమిమ్మనిచేరఁ ♦ బిలచినవింతగాఁ
జేరునోమీరునో ♦ చెప్పరాదు
పైఁతాపటంబుచేఁ ♦ బట్టెదనంటినా
వెరచునోపరచునో ♦ దెరవుగాదు

గీ॥ ఏమి సేయుదు నేమందు ♦ నేయుపాయ
మేగతినియీవిరాళిని ♦ నెటులనోర్తు
ననుచుశిరమూచుఁజేజాచు ♦ నెనయఁజూచు
నేగునేర్పడ కప్పుడా ♦ నృపవరుండు ౧౧౪

నుందలింతునిపు ♦ డిందుముఖీదృక్ష మానసంబు నే
రంతులజ్జితవి ♦ లాసకళాకుశలాత్మనిప్పుడే

బాగుగఁ గూడువాఁడసుమ। బాణుశరంబులఁ జిక్కి స్రుక్కినే
వేగఁగలేనటంచు మదివిశ్వవిభుండు దలంకి చింతిలెన్ ౧౧౫

వ॥ ఇట్లు చింతించి. ౧౧౬

గీ॥ నేరుపునఁగాని కరఁగదీ ♦ నెలఁతమనసు
ప్రోడ తనమేరు పరచంగఁ ♦ బొసఁగదనుచుఁ
జాటుకారప్రకార వా ♦ చావిచార
మమర ధరణీధవుండిట్టు ♦ లనియె నపుడు ౧౧౭

క॥ ఓరాజీవాక్షి రామరు। బారింబడియున్న ననుఁ గృ ♦ పారసధారా
వారిం దేలించుటకై। రారాదా యిందుముందు ♦ రాకేందుముఖీ

గీ॥ కొమ్మ యీ మదుపులనుజే ♦ కొమ్మనీదు
మధుధురాధర రససుధా ♦ మధురభాష
కొమ్మ లలరంగ మణిభూష ♦ కొమ్మలిపుడు
గనికరమ్మునఁ గైకొమ్ము ♦ కనికరమున ౧౧౮

సీ॥ పలుకవే తేనియల్ ♦ జిలుకంగ ముంగల
నబ్బుసిబ్బపు గబ్బి ♦ గుబ్బలాడి
చూడవే వేడుకల్ ♦ తోడనేకూడంగఁ
జన్నారి నెమ్మోము ♦ చిన్నెలాడి
పలుకవే పాయంబు ♦ గులుకులు తళుకొత్త
మేలైన పువ్వుల ♦ మేనులాడి
తెలఁగవే యొయ్యారి ♦ మొలకనమ్మదమున
మించుసంచులమించు ♦ మెఱుఁగుఁబోడి

గీ॥ [illegible] లమున మేలమేటికి ♦ వాలుగంటి
[illegible]దుట కేతెంచవేటికే ♦ యిందువదన

జాలిఁ దేలించ నేటికే ♦ సారసాక్షి
కేళి నేలంగ రాదె యో ♦ కీరవాణి ౧౨౦

సీ॥ ఏకాంతమున నను నీ ♦ న్నెపుడు వీక్షింతునో
యని తల్చుకొనఁగొన్ని ♦ దినములరిఁగె
సరస రాత్రిందివ ♦ జాగ్రదవస్థచేఁ
జరియించఁ గొన్నివా ♦ సరములరిఁగెఁ
మదనవేదనధూయ ♦ మానమానసతనా
రంభించఁ గొన్నివా ♦ రంబులరిఁగెఁ
కుశలవాంఛితభవ ♦ ద్గురుజనాజ్ఞప్తిక్లి
వసియించఁ గొన్నిది ♦ వంబులరిఁగె

గీ॥ నిముస మొక పూట పూటొక్క ♦ నెలయు నెలయు
హాయనము హాయనముగల్పు ♦ మగుచునుండుఁ
గరుణఁ జేయుట యెప్పుడో ♦ గారవించు
టెప్పుడో కాని తెలియదే ♦ యిందువదన ౧౨౧

సీ॥ ఇంపుగా నగుమొగం ♦ బెత్తి కన్గొనకున్న
దొగలరాయని నెట్లుఁ ♦ దెగడువాఁడఁ
దేనెజాల్గుల్గువా ♦ తెరఁగ్రోల నీకున్న
మధువిజృంభణ మెట్లు ♦ మరచువాఁడఁ
గలితామృతములొల్కు ♦ పలుకుఁ బల్కకయున్నఁ
గీరాదికము నెట్లు ♦ గెలచువాఁడ
సురతసౌఖ్యంబునఁ ♦ జొక్కించకున్నను
దర్పకు నే నెట్లుఁ ♦ దరుమువాఁడ

గీ॥ గబ్బి చనుగుబ్బ లొరయంగఁ ♦ గౌఁగలింపఁ
జేయకున్నను బైవచ్చు ♦ శీతలాని

లుని హసించంగ నేనెట్లు • పెనఁగువాఁడ
వింతసేయంగ నేటికే • విభ్రమాక్షి అ౨ ౨

సీ॥ అతివరో మన్మథుం • డనుసూత్రధారుండు
తద్దేహలావణ్య • ధన్యకళలఁ
బాత్రముల్ జేసినే • పత్యాఖ్య యవనికాం
తరములోపల స్థాపి • తముగఁజేయు
నవియు బాహ్యాభ్యంత • రావాప్తిఁ జెన్నొందఁ
గనుగొంటి గానిమి • కుటముగాఁగ
దారయులజ్జాతిర • స్కరణిలోపలనుండి
విలసిల్లు నీమనో • వృత్తి నటిని

గీ॥ వెడల నీవయ్యె నీకృపా • న్వితదృష్టి
నను గనుంగొంటి వేనిఁద • న్నాట్యవిధముఁ
జూచి సమ్మోద మొందుదో • సుందరాంగి
మనవిఁ గైకొను మికనైనఁ • జనువుమీఱ ౧౨౫

వ॥ అని విప్రలంభ శృంగారంబున నొక్కింత సరసవచన రచనల నెఱపి సంభోగ
శృంగారంబున గోవాటించి ౧౨౬

చ॥ నడుమసియాడఁ గంకణని • నాదము లుప్పతిలన్పదాబ్జముల్
తడఁబడ ఘల్లుఘల్లని ముదంబున నందెలు మ్రోయుచుండసొం
పడరెడు మాను కేతనప • టాంచలమై తగ్గిపైటజారన
వ్వడఁతి కరాంబుజంబాడసి • పట్టెన్నృపాలవతంసుఁ డయ్యెడన్ ౧౨౭

వ॥ ఇవ్విధంబున బట్టినఁ గిలికించిత భావంబున సంచలించు చంచలాక్షిని హంస
తూలికాతల్పంబునం జేర్చి ౧౨౮

సీ॥ తరళాన్వితంబులై • విరళప్రవాళహా
స్తాంచితంబులు కంచు • కాంతరంబు

లగుబాల చన్గొండ ♦ లవనీవతికరగ్ర
హాణసౌభాగ్యములు గా ♦ నాత్మఁదలఁపు
మనియాంత రంగికుం ♦ డగుశంబరారిత
త్కంపితోత్పత దంశు ♦ కంబుచేత
సంజ్ఞచేయంగన ♦ జ్జనపతి గదియఁత
త్కటకస్థ ఘంటికల్ ♦ కవులటంచు

॥ తెలుపు గతిఁ బోయఁ దత్క్రియా ♦ కలితుఁడగుచు
గడక నిజశాసనములుంచు ♦ గతినిఁజంద్ర
రేఖ లొనరించఁ దలఁచిన ♦ రీచిసాత్వి
కాదులఁ జెలంగినప్పుడ ♦ యాగ్రిమమున ౧౩౬

॥ సరసలాక్షారాగ ♦ భరమున్న దనుచును
దంటగా మోవిప ♦ ల్లంటఁ జేసి
మకరికలాపముల్ ♦ మకరంబులని మెచ్చి
నునువుచెక్కులను చుం ♦ బనమొనర్చి
కంచుకం బారవుగాఁ ♦ గనుపట్టె ననికుల్కు
గుబ్బలు గోరఁగొల్ల ♦ గ్రుచ్చిచూచి
మృగమద సౌరభ ♦ మెదురంబని మేను
మూర్కొని పరిరంభ ♦ మొనరఁ జేసి

॥ పదఁతి కపురంపు బాగాలు ♦ మనువులివిగో
గొమ్మనుచు గంఠసీమను ♦ గోరులూని
యునియు మొదలగు క్రియలచే ♦ నెలిమి చెలిరు
నతులిత స్థితిచేఁ ♦ బాహ్యా ♦ రతులఁగలఁచి ౧౩౭

॥ కోరికా తెరతేనెఁ ♦ గ్రోలంగ గమకింపఁ
జెదవుల నందంద ♦ వేనఁగి పెనఁగి
ముకురంబులని పూని ♦ ముద్దిడరాఁజూచి

చెక్కులంసంబుల ♦ నొక్కివట్టి
యురముపైఁ గరయుగ్మ ♦ మొనరించ గన్గొని
బిగిచనుల్ గరమునఁ ♦ బిగియఁబట్టి
సుఖకేళిఁ దేలించు ♦ నరువునిరీక్షించి
చెందొడ లందందఁ ♦ బెనఁగఁ జేసి

గీ॥ పరగుకటిసీమ నుత్పల ♦ పత్రములను
నఖరవైఖరులుంచు న ♦ న్నాహమెఱఁగి
సీత్కృతం బొనరించుచు ♦ సిగ్గునొంది
విముఖత వహించు చెలిఁగూడె ♦ విభుఁడు మొదల ౧౨౯

వ॥ మఱియు సామోక్తులఁ బ్రార్థనాది శేషంబుల రతిప్రేమఁ బుట్టించి డెందంబు గందనీయక కందర్ప కేళినొందించి ౧౩౦

సీ॥ తలకమున విరివిగాఁ ♦ దురిమిన పూవరుల్
చెదరి వన్నెలుదీఁ ♦ జిక్కువడఁగ
నురముపై నిరవొంది ♦ సిరులకింపైనము
క్తాహారములు జారి ♦ కన్పడంగ
లీలాకపోలపా ♦ లికసన్మరీకక
లాపముల్ శ్వేతాంబు ♦ లనుగరంగఁ
మేననిండనలందు ♦ మిసిమిశ్రీగంధాది
పరిమళంబులు పలు ♦ పల్చగాఁగ

ఆ॥ గమ్మతెమ్మరలకు సరి ♦ గాఁజరించు
నార్పుగమిదోఁచఁ బెనుమోహ ♦ మొప్పచుండఁ
జిరుత ముత్తియములరీతిఁ ♦ జెమటచిన్కు
లలికమునఁ దోఁచఁదత్కాంత ♦ మమరె నపుడు ౧౩౧
౧౩౨

వ॥ మఱియును

సీ॥ నునుగప్పు కొప్పుమై ♦ నున్నపువగదియంగఁ
జన్గొండ లురమున ♦ సంఘటిల్లఁ
జిక్కన్నె మెఱుఁగెక్కు ♦ చెక్కుచెక్కుట నుండఁ
దావిచేఁ దగు మోవి ♦ మోవి మెసఁగ
సరసకటీతటిఁ ♦ జరణాబ్జము జెలంగఁ
బాలుపొందు కరమువీ ♦ పునఁబూసంగ
నలయిక తనరుమై ♦ నల నొక్కటిగఁ జేసి
రతిపారవశ్యసం ♦ రంభమొంది

గీ॥ సుందరీమణి గూడియా ♦ సూనబాణుఁ
డనఁగఁదగినట్టి భద్రాయు ♦ వతివినోద
సమ్యగమృతాంబు నిధియందు ♦ శయితుఁడై స
నీరజాక్షుఁడవలె సుఖ ♦ నిద్రఁజెందె ౧౩౮

౧౩౯

వ॥ అట్టియెడ

గీ॥ అంతకన్నమున్నె ♦ మానీరజాతాక్షి
లేచి కేళిలతు ♦ నోచితముల
మరుఁగుపడ విలాస ♦ మందిరం బెడఁబాసి ౧౪౦
వచ్చి సిగ్గుపడిన ♦ వనితలపుడు

గీ॥ చెలియ యీరేయి విభుఁడేమి ♦ జేసెనతని
కిష్టవర్తనమేరీతి ♦ నీవుసలిపి
తింతయు వచింపుమిపుడనీ ♦ చెంతనిరుగు
వారలముగాని సఖిలాతి ♦ వారమటవె ౧౪౧

క॥ అనవిని విననట్టులనా। ననకామరసంబువంచు ♦ ననఁబొడినిచ
య్యనఁ గదిసెపరిరంభం। బునఁ జేర్చిప్రియోక్తులొప్పఁ ♦ బొదలించితగఁ [illegible]

భూషణస్థానవిపర్యంబున నగు విభ్రమంబును, దోషాశ్రుహర్షచిత్త్యాది సాంకర్యంబున నొప్పు కిలికించితంబును ఇష్టకథాది సంభవ సంభావనా సూచకంబులగు మోట్టాయితంబును రతిసమ్మర్ద సుఖాధిక్యంబగు కుట్టమితంబు విలాసజనితంబగు బిబ్బోకంబు నిరంతర సౌందర్యంబున దగులలితంబు మనోజ్ఞదృష్టి చపలత్వంబుగల కుతూహలంబు భయసంభ్రమంబులందగు చకితంబు వాక్యవివరణంబుగలవి హృతంబును వికృతివస్తు సంజాతంబై తోచు హసనంబు నివి మొదలగు యష్టాదశ శృంగార చేష్టలెఱుంగఁజేసి స్థాయీ భావంబునఁ బరస్పరావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేకవిధవ్యాపారంబులుగ నలశృంగార రసంబునకు నుత్సాహంబు బుట్టించి నగుచుఁ బ్రియునివలనఁ బ్రతిదినాభ్యస్తరతిగతు లెఱింగి యక్కాంతారత్నంబు ౧౮౫

సీ॥ పర్వేందు ఖండప్ర ♦ భాఫాలతలమున
నునుకుంతలములు న ♦ ర్తనము సలుప
సురుచిర భాస్వన్మ ♦ కురుకపోలస్థల
ములమణితాటంక ♦ ములునటింప
విలసిత శ్రమజలం ♦ బులచేత నించుక
తొలఁగిన మౌక్తిక ♦ తిలక మలరఁ
గుచకుంభములమీఁదఁ ♦ బ్రచురంబులగుతార
హారముల్ డోలా వి ♦ హార మొంద

గీ॥ జఘనఘన మేఖలారావ ♦ చరణనూపు
రస్వరంబులు గళరవ ♦ సుస్వరములు
కంకణనినాదములు నొక్క ♦ గతిచెలంగఁ
బడతిపు యిత న న ♦ వృతిఁ గలంచె ౧౮౬

వ॥ అట్టియెడ ౧౮౭

సీ॥ మౌక్తికంబుల చంద్ర ♦ మండలంబు జెలంగె
విరళతారలవ్యోమ ♦ వీథిదనరె
జంచలత్వము మాసి ♦ స్మారచాపముదోనె

గలరవంబులు మానె ♦ గలరవములు
నించుక ముకుళించె ♦ నిందీవరంబులు
కమ్మ తెమ్మెరలు ని ♦ ల్కడలఁ జెంద
నచలితస్తబకమై ♦ యలరె జంపకవల్లి
చిగుత వెన్నెల గల్గి ♦ చిగురునిగుడ

గీ॥ మెఱుపులొందిన మేఘంబు ♦ విరివిదూచె
నేమిచిత్రంబొ కాని యా ♦ భామయనుచు
సరస వచనరచనల త ♦ రుణిగరఁగఁ
జేసిసంతోషవారిధిఁ ♦ జెందెనృపుఁడు ౧౪౮

బున నర్మోక్తి నర్మగర్భనర్మ స్ఫోటనర్మస్వంజ్ఞమధురిలమధురిణంబగు ...లఁ బ్రతిదినంబు సమస్త సురతవిశేషంబులఁ బ్రౌఢనాయక నొనరించ నవతి స్వాధీనపతికాది లక్షణ లక్షితయై సరస సల్లాపహావభావ విలాసాదులఁ గొన్నిదినంబులు దనర్చ ౧౪౯

గీ॥ అంతక తకుఁ బ్రౌఢిమ ♦ నలరికీర్తి
మాలినీకాంత కాంతుని ♦ మనసుఁగరఁగఁ
జేసిచంద్రాంగ దాజ్ఞప్తి ♦ శిశిరవిలస
దుపవని చరించెఁ బ్రియునితో ♦ నుత్సహించి ౧౫౦

గీ॥ ...రయనితఁ డద ♦ శార్ణ దేశాధిరాజ్య
పూజ్యుఁడగువజ్రబాహుని ♦ పుత్రుఁడగుటఁ
దద్విషయమున కాధిప ♦ త్యమువహింపఁ
జేయవలెనని సంతోష ♦ చిత్తుఁడగుచు ౧౫౧

ఉమాస్త్రి నొక్కనిఁ బెరితదధ్యక్షుఁడటకుఁ ♦ జేరనుపాయ
నంబొనరింపుమ! ఘోరయమునసగి యనిన ♦ యతఁడిట్లనుచు ౧౫౨

సీ॥ దాశార్ణదేశప్ర ♦ ధానపురాధివాస
దాసనోల్లాసియౌ ♦ వ్యాఘ్రబాహు
కాత్మాగతంబుచం ♦ ద్రాంగదప్రేషిత
త్వంబని ముందుగాఁ ♦ దగవచింవి
మీరువిచ్ఛేయుట ♦ మేలుసిద్ధించునీ
యెడలను సమ్మోద ♦ మలరుచుండ
హస్త్యశ్వరథపదా ♦ త్యాప్తభృత్యామాత్య
హితపురోహితనమ ♦ న్వితుఁడపగుచు

గీ॥ తొలుత గిరిసరిదుపవన ♦ ములనుదుర్గ
దుర్గమస్థానములనెల్ల ♦ నిర్గమించి
ధన్యచంద్రాంగదప్రసి ♦ ద్ధప్రధాన
నగరిఁజూడంగ జనిన న ♦ జ్జగతివిభుఁడు ౧౧౩

క॥ చతురంగ బలముగొలువగ॥ నతిరయమున నెదురుకొనుచు ♦ నన్యోన్యసమ
ర్పిత కలితాలింగనముల। జతురవచన రచన లెనయ ♦ నల్పుచు ప్రేమన్ ౧౧౪

క॥ నవరత్న మయశుభోద్యా। హావిధసవిధ వివిధమణి ♦ సమన్వితముసభా
భవనమున కలరుచు దశా। ర్ణవిభుండో తెంచిమణిక ♦ నకపీఠము నన్ ౧౧౫

క॥ వినయమునఁ జేర్పసింహా। సనమున నూతనలతాంతశరుఁ ♦ డనఁదగురా
ట్తనయునిఁగనుఁగొని నిజజీఁ వనదునిఁ గాఁదలచనతఁడ ♦ వారణభక్తిన్ ౧౧౬

సీ॥ పాదకంజములకుఁ ♦ బ్రణమిల్లికవినవే
గంబుగాధాలిఁగ ♦ సంబోనర్చి
యితఁడు మత్ప్రాణదుం ♦ డితఁడు మద్బాంధవుం
డితఁడు మచ్ఛత్రుసం ♦ హాతివాదుంచు
నితని యున్నాయం ♦ బితని సౌందర్య
మీతని విక్రమం ♦ బెల్లసేను

సరసోక్తిఁ దెల్పునే • మథమహారాజేంద్ర
యనను పాంశుస్థితి • నతనిఁగూర్చి

గీ॥ యుష్మహాత్ముని జననాదు • లేర్పడంగ
దెలియ వచియింతు యిప్పుడు • ధీరహృదయ
సావధాన మనంబుతో • నలరివినుము
టంచుఁ జెంద్రాంగదుండిట్టు • లనియె నగుచు ౧౫౮

మ॥ అవనీనాథ యితండు నీనుతుఁడుగో • గార్త్యుండునై యుండనీ
వవినీతాత్మత మాతృయుక్తునిగ బ్ర • హ్మారణ్య మార్గంబునన్
దవులంజ్జేయఁ బరిభ్రమత్త్వ వనమిద్ధవ్యాధిచే నాధిచే
వివిధా పద్దశచేఁ గృశింపుచుసమా • విర్భూత భీతస్థితిన్

మ॥ బహుధాధావదనేక భీకరమృగా బ్రహ్మాణ్య మర్థింపుచున్
గహన ప్రస్ఫుట కంటకావృతలతా • క్రాంతాలకాంతాళివై
యహరీశోగ్ర సమగ్రఘృష్టి పరిత • ప్తాంగంబునన్ బ్రుంగదు
ర్దహనజ్వాల విశాలమైనపదమ్ముం • దాపంబు నొందింపగా ౧౫౯

గీ॥ ఘృణ్యుఁడైనట్టి యొకవైశ్య • పుంగవుండు
సార్థవజ్జన పదమునం • దధివసింప
వనట నొందుచుఁ దత్స్థాన • మునకుఁబోవ
నతఁడు గన్గొని భూరిద • ర్పార్ద్రమతిని ౧౬౦

క॥ అగదంకారుల బహువిధు। లగువారల బిల్వసంపి యజ్ఞనసివు
త్రుంగద వినివారణంబుగ। జగతిగలుగు నౌషధముల • నవరణ లొసగన్ ౧౬౧

సీ॥ పొసఁగంగ నొసఁగఁద • త్పుత్రుండు మృతుఁడైన
దీనార్తయగుచు న • ద్దేవితలఁక
ఋషభాఖ్య శివయోగి • యేతెంచి ప్రీతిచే
సంజీవితునిఁ జేసి • సదయుఁడగుచుఁ

వానిదివ్యాకార • వంతునిగాఁజేసి
యారాజపుత్రుని • కతిముదమున
శత్రువధంబుతో శంఖఖడ్గములిచ్చి
యొనసిద్వాదశ సహ • స్రేభబలము

గీ॥ నొసఁగి సకలార్థశాస్త్ర సం • యుక్తుఁజేసె
గాననితఁడు సమర్థుండు • ఘనవిచారం
రాజవదనుని బుత్రుని • రాజధాని
కిపుడు దోడ్కొని పొమ్మను • హితతిలకా ౧౬౨

క॥ అని సర్వంబువచించిన। వినివిస్మయ మందికుంది. వెనుకనుదాఁజే
సినదుర్నయమును దెగడుచు।జననాథుఁడుసమ్మదమున•సత్వరుఁడగుచున్ ౧౬౩

క॥ ఆయుగ్రభార్యతనయుని। చాయవిమోహంబుతోడ•పరిరంభములన్
డాయంజేయుచు సమ్మో। దాయత్తమనంబుదోప • నధిపతియాచటన్ ౧౬౪

వ॥ కొన్ని దినంబు లధివసించి తదిష్టగోష్ఠితో నుండునెడ

క॥ ఆనైషధుండుబహుబహు। మానంబొనరింపనగ్ర • మహిషినిసుతునిం ౧౬౫
నానావిధమణినికర।స్యానరథంబులనువిడుక • చయ్యనవచ్చెన్ ౧౬౬

క॥ వచ్చినిజరాజధానికి। విచ్చలవిడి యచ్చరాలి • వెరగందంగన్
సచ్చరితుఁ డైనపుత్రుని। జెచ్చెరసింహాసనస్థు • జేసెముదమునన్ ౧౬౭

వ॥ ఇట్లుచేసిన ౧౬౮

గీ॥ సకలజనుల సదానంద • జలధిఁదేల్చి
దేవగురువిప్ర పూజా • విధేయవృత్తిఁ
బ్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • భారమూని
వెలిబెర భద్రాయు వీంద్రవా • భవముదోప

గీ॥ మగధదేశాధి నాథుహే • మరథునుందుఁ
బుత్రమిత్ర కళత్రప • భూతభూతి
నొందఁజేయుచు విడచియా • నందిమహిమ
సకల పృథ్వీభరంబున • సంభ్రమించె ౧౭౦

చ॥ శౌనకపంచ్రపభావము ప్ర • సిద్ధతరర్ష భయోగిదత్త ఖ
డ్గవరదరప్రతాపమున • ఖండపరాక్రమ విక్రమంబుప్రా
భవముఁ జెలంగుచుండఁ బరి • పంథివిదారణ మాట చిత్రమా
యవిరళదానధర్మ పరఁజొటకుఁ • జోద్యమె యెన్నిభంగులన్ ౧౭౧

వ॥ అని యివ్విధంబున సకలవర్ణంబులవారు వినుతింప సామ్రాజ్య ధురంధరుండ యిట్లుండెనని సూతుండు శౌనకాది మునీంద్రులకు నీ పుణ్యకథా శ్రవణంబునఁ జతుర్విధ పురుషార్థంబులు సిద్ధించునని వివరించి యైతిహ్య పురాణంబుల వినోదంబు సల్పుచుండె. ౧౭౨

శా॥ అండేజధ్వజకాండకాండ కకటా • హాప్రాంచదుద్యద్యశ
స్తండప్రక్రమ దక్షదక్షసవన • ధ్వంసక్రియాహంక్రియా
ఖండప్రాభవ చిత్తచిత్తజ మహా • గర్వాభ్రజంఝానిలో
ద్దండస్థైర్య విహారహారశరదు • ద్యద్వారిభృద్విగ్రహా ౧౭౩

క॥ సురధరణీధరశాసన। నరసారథితో దనర్చ • ణవజపక్ష్మద్వా
శరధి హేతకరణ ధీరత। నరధీకృత శరధిశైల • శయభూమిరథ ౧౭౪

పృథ్వీవృత్తము

నియుద్ధ సమయోద్యమ • నిజభుజార్గళాస్త్ర త్రుట
ద్వియత్స్థ ఘపదాపత • ద్విమతతుండ చండోత్త మా
భయభ్రమద[illegible]రా • భయకర [illegible] చకీభవ
త్స్వయోదయశ[illegible]నా • తతసమ[illegible]రిత్రకోత్సవా ౧౭౫

మ॥ ఇదిశ్రీవేములవాడ పట్టణనివా • సేశానసంప్రాప్తశ
శ్వదయప్రాభవ కామినేనికుల రా • జారెడ్డి దేశాయిస
మ్మదలక్ష్మీపతి పండితోదితసు • ధీమందార భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమురుచిం • పుష్పంచమోల్లాసమై ౧౭౬

**గద్య**

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణాకటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తోభయ భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచర్ల గోత్రపాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజన్న
దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణ కవిత్వ
చాతుర్యధుర్య పరాశరగోత్ర రాపాకలింగ
నార్యపుత్ర లక్ష్మీపతి ప్రణీతంబైన
భద్రాయురభ్యుదయంబు
నందు సర్వము
పంచమోల్లాసము



# అచ్చు చెదరిపోయిన శబ్దముల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౬ | దాత్రృయజేత్యు | దాత్రృయజేత్యుక్తి | ౮౪ | ౪ | సత్యాది | సత్వాది |
| ,, | ౧౨ | భాషి | భాషిత | ౮౬ | ౨౫ | న్వాంత | స్వాంత |
| ౯ | ౨౦ | జలంబున్బడి | జలంబునబ్బడి | ౮౭ | ౧౮ | జెలగుచుదురు, | జలఁగుచుండురు |
| ౧౧ | ౧౩ | పద్మరాయుగ తోపరి | పద్మరాగయు తోపరి | ౭౩ | ౧౮ | దెతీయ | దెలియ |
| ౧౩ | ౧౪ | సుప్తాంగ | సుప్తాంగజ | ౭౯ | ౨౧ | ప్రతితోగ | ప్రతితోగ్ర |
| ౧౬ | ౨౩ | నైదిఘంటిక | నైఘంటిక | ౯౧ | ౧౬ | సతతంచాక్షరీ | సతత పంచాక్షరీ |
| ౨౦ | ౧౪ | నిర్వ్హాణ | నిర్వాణ | ౯౨ | ౧౨ | యామునిరాజ | మునుపారాజ |
| ౨౩ | ౨౭ | వజకీలిత | వ జకీలిత | ౧౦౧ | ౨౪ | సహనతాహిస | సహనతాహింసల |
| ౨౪ | ౧౬ | భాగ్యాగర్వాద | భాగ్యనగరాధ్ | ౧౦౬ | ౨౮ | మంత్రరాజమహా | వరమంత్రరాజమహా |
| ౨౫ | ౧౦ | శోకుఁడు | శ్లోకుఁడు | ౧౧౧ | ౪ | రామమహేశా | రాజమహేశా |
| ౮౫ | ౧౮ | నుదతి | సుదతి | ౧౨౨ | ౩ | విసు | విష్ణు |
| ౪౭ | ౯ | నిత్యస్వ | నిత్యసత్య | ౧౨౩ | ౧౪ | సక్తి | సక్థి |
| ౫౨ | ౧౭ | కఠిన్యము | కాఠిన్యము | ౧౨౭ | ౮ | వ్రడనాభుని | వ్రజనాభుని |
| ౫౫ | ౨౧ | శిరంగ | శ్రీరంగ | ,, | ౧౭ | సమ్మ్రతంబు | సమ్మతంబు |
| ౬౧ | ౫ | షష్ట్యంతములు | షష్ఠ్యంతము లు | ,, | ౨౩ | శరత్పర్జాన్యగర్జ | శరత్పర్జన్యగర్జా |
| ౬౯ | ౮ | మహారోగము | మహారోగము | ౧౩౩ | ౨౭ | మిని | భూమిని |
| ౧౩౪ | ౨౭ | సల | స్థల | ౧౩౬ | ౩ | పలియ | మల్లియ |
| ౧౪౬ | ౨౬ | సంకిస్థితి | సంక్షిప్తస్థితి | ,, | ౧౪ | తిలిలాక | తెలివాక |
| ౧౫౩ | ౧౫ | డగ | దగ | ౧౭౨ | ౮ | యేమనఁ | యేమనన్ |
| ౧౫౫ | ౧ | గ్రౌని | గౌని | ౨౦౩ | ౧౬ | మలి | దెమలి |
| ౧౫౮ | ౧౨౩ | జేయ్రగా | జేయఁగా | ౨౦౧ | ౮ | వీణాదన | వీణావాదన |
| ౧౫౭ | ౧౦ | నొందించె | నొందించె | ౨౧౨ | ౧ | చండాలుఁలర | చండాలులను |
| ౧౮౧ | ౪ | లసదువ | లసదుప | ౨౧౫ | ౧౧ | రజోవతి | రజోవృత్తి |